ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

మోహన్ పబ్లికేషన్స్

కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,

రాజమహేంద్రవరం - 533101.

# భాగవతకథ

## 5వ భాగము

గ్రంథకర్త - శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి

అనువాదం - శ్రీ కుందుర్తి వేంకట నరసయ్య

సాధన గ్రంథ మండలి, ౬౫.

శ్రీ భాగవత దర్శనము

# భాగవత కథ

( పంచమ ఖండము )

౫

శ్లో॥ వ్యాసశాస్త్రోపవనతః సుమనాంసి విచిన్వతా।
కృతా వై ప్రభుదత్తేన మాలా 'భాగవతీ కథా'॥


గ్రంథకర్త:

శ్రీ ౧౦౮ ప్రభుదత్త బ్రహ్మచారిగారు

అనువాదకుడు:

శ్రీరామశరణ్, కుందుర్తి వేంకటనరసయ్య





ప్రకాశకులు:

సాధన గ్రంథ మండలి, తెనాలి.




★

[వెల రు. 2-0-0

# శ్రీ కృష్ణాష్టకమ్

శ్రీ శంకరాచార్య
విరచితమ్.





శ్లో॥ భజే వ్రజైకమణ్డనం సమస్తపాప ఖణ్డనం
స్వభక్తచిత్తరఞ్జనం సదైవ నన్దనన్దనమ్,
సుపిచ్ఛగుచ్ఛమస్తకం సునాదవేణుహస్తకం
అనఙ్గరఙ్గసాగరం నమామి కృష్ణసాగరమ్. ౧

శ్లో॥ మనోజగర్వమోచనం విశాలలోలలోచనం
విధూతగోపశోచనం నమామి పద్మలోచనమ్,
కరారవిన్దభూధరం స్మితావలోకసున్దరం
మహేన్ద్రమానదారణం నమామి కృష్ణవారణమ్. ౨

శ్లో॥ కదమ్బసూనుకుణ్డలం సుచారుగణ్డమణ్డలం
వ్రజాఙ్గనైకవల్లభం నమామి కృష్ణదుర్లభమ్,
యశోదయా సమోదయా సగోపయా సనన్దయా
యుతం సుఖైకదాయకం నమామి గోపనాయకమ్. 3

శ్లో॥ సదైవ పాదపఙ్కజం మదీయమానసే నిజం
దధానముత్తమాలకం నమామి నన్దబాలకమ్,
సమస్తదోషశోషణం సమస్తలోకపోషణం
సమస్తగోపమానసం నమామి నన్దలాలసమ్. ౪

శ్లో॥ భువో భరావతారకం భవాబ్ధికర్ణధారకం
యశోమతీకిశోరకం నమామి చిత్తచోరకమ్,
దృగన్తకాన్తభఙ్గినం సదాసదాలసఙ్గినం
దినే దినే నవం నవం నమామి నన్దసమ్భవమ్. ౫

శ్లో॥ గుణాకరం సుఖాకరం కృపాకరం కృపాపరం
సురద్విషన్నికన్దనం నమామి గోపనన్దనమ్,
నవీనగోపనాగరం నవీనకేలిలమ్పటం
నమామి మేఘసున్దరం తటిత్ప్రభాలసత్పటమ్. ౬

శ్లో॥ సమస్తగోపనన్దనం హృదమ్బుజైకమోదనం
నమామి కుఞ్జమధ్యగం ప్రసన్నభానుశోభనమ్,
నికామకామదాయకం దృగన్తచారుసాయకం
రసాలవేణుగాయకం నమామి కుఞ్జనాయకమ్. ౭

శ్లో॥ విదగ్ధగోపికామనోమనోజ్ఞతల్పశాయినం
నమామి కుఞ్జకాననే ప్రవృద్ధవహ్నిపాయినమ్,
యదా తదా యథా తథా తథైవ కృష్ణసత్కథా
మయా సదైవ గీయతాం తథా కృపా విధీయతామ్,

ప్రమాణికాష్టకద్వయం జపత్యధీత్య యః పుమాన్
భవేత్స నన్దనన్దనే భవే భవే సుభక్తిమాన్.

ఇతి శ్రీమచ్ఛఙ్కరాచార్యకృతం శ్రీకృష్ణాష్టకం సంపూర్ణమ్.

# పీఠిక

భాగవతకథా ప్రసంగమునుగూర్చి చదివినకొలఁది, వినినకొలఁది, వ్రాసినకొలఁది చవులూరుచుండును. ఎంతగా ననుభవించినను దృప్తి కాదు. కారణ మా భాగవతకథా విధానమందే అట్టిది కలదని తోఁచుచున్నది. అందుకనియే పరీక్షిన్మహారాజు మాటిమాటికి భాగవతకథా శ్రవణమునకతృప్తుఁడై గద్గదకంఠముతో నిట్లనెను:- ''కల్యాణాత్మకమైన విష్ణుకథలాకర్ణించుచుఁ ముక్తునై కల్యుండెవ్వఁడు తృప్తుఁడౌ? అవి వినఁగాఁ గ్రొత్తలౌచుండు'' అని భగవత్కథలోఁ గల నిత్యనూతనత్వమును జాటినాఁడు. లౌకికవిషయప్రసంగములు, విషయములను అనుభవించినతర్వాత మరల ననుభవింపవలయునని బుద్ధిమంతులైనవారి కుండదు. ఏలననఁగా నొక్కసారి అనుభవించిన తర్వాత నది పాతపడిపోయినది. నూతనత్వమందు లేదు. కాని భగవత్కథలందుఁ గానిండు, భగవద్రూపమునఁ గానిండు, భగవద్గుణములందుఁ గానిండు నిత్యనూతనత్వము కలదు. అందువలననే భగవత్కథలను నెన్నిసారులు విన్నను మనకు విసుఁగు దోఁచుటలేదు. ఇంకను వినవలయునని యుండును. ఒక్కొక్కప్పుడు మోక్షమక్కఱలేదు, ఎల్లప్పుడీ భగవత్కథలను వినుచుండినఁ జాలదా యనియు ననిపించును.

ఈ యుపాధికి అనారోగ్యముండినను, ముఖ్యముగఁ జూపుకు సంబంధించిన రోగముండినను, అదేపనిగఁ జూచుట బాధగానున్నను ఈ భాగవతకథయందు గల రసమే దీని ననువాదము చేయుటయందు ప్రోత్సహించుచున్నది. అన్య

స్వంతగ్రంథము లనేకములు వ్రాయవలయునని ప్రారంభించియు నీ యనువాదముచేఁ గలుగు నానంద రసాస్వాదన మింకొకచోట జిక్కకపోవుట దీనిని వదలఁజాలక చేతనైనట్లు అనువాదము చేయుచున్నాను. నేను సంస్కృతభాగవతమును, బోతన భాగవతమును జూచితిని. కాని యింత విపులముగను, నింత రసవంతముగను గన్నుల గట్టినట్లు తన రచనవలనఁ బాఠకుని మనస్సును లాగుకొనిపోవునట్లు రసవత్తరమైన హిందీ భాషలో రచించిన శ్రీ ౧౦౮ ప్రభుదత్తజీ బ్రహ్మచారిగారికి నా ధన్యవాదము లెంతగా నర్పించినను దీరదు. అపర వ్యాస మహర్షి యనఁదగు బ్రహ్మచారిగారి యీ గ్రంథమును జదివిన నాధ్యాత్మికముగ నింకొక గ్రంథము చదువఁ బనిలేదనవచ్చును. అట్టిదానిని పాఠకమహాశయు లాదరించి భాగవతకథా పఠనమునఁ బవిత్రులగుదురుగాత యనియుఁ బ్రతివారును నీ ప్రతి నొకదానినిఁ జదివి తగినరీతిని భావి భాగవతకథాగ్రంథములు కూడ వెలువడఁగలుగునట్లు ప్రోత్సాహ మొసంగవలయునని ప్రార్థించుచున్నాను. ఈ మొదవభాగముతో మూడు స్కంధముల కథ పూర్తియైనది.

ఇట్లు

శ్రీ రామ శరణ్

కుందుర్తి వేంకటనరసయ్య పాకయాజి



# వ్యవస్థాపకుల మనవి

మహాశయులారా!

సాధన గ్రంథ మండలికి తొమ్మిదిసంవత్సరములు నిండి, పదియవ సంవత్సరము ప్రారంభమయినది. ఈ సంవత్సర ప్రథమపుష్పముగా 'భాగవతకథ' ఐదవభాగము వెలువరించి మీ కరకమలములం దుంచుచుంటిమి. ఇంతవరకు మండలి చేసిన కృషి పాఠకలోకమునకు విదితము. ఆర్థికముగ మండలి యనేక కష్టనష్టములకు లోనై ఉన్నది. మండలి సభ్యులవలన గూడ 3, 4 సం॥ల నుండి పారితోషికములు రావటంలేదు. ఇట్టి గ్రంథ ప్రచురణలో గల కష్టము తమకు తెలిసినదే. మీ యందరి సంపూర్ణ సహకారము చూపి, మండలి ప్రచురించు గ్రంథములద్వారా లోకమున ఆధ్యాత్మిక సేవయు, ప్రచారముచేసిన భాగ్యమునకు భాగస్వాములై, భగవదనుగ్రహమునకు పాత్రులు కాగలందులకు ప్రార్థన.

భాగవతకథలోని వైశిష్ట్యము పాఠకలోకము గుర్తించినది. ఆ గ్రంథ ప్రచురణకు విశేష ధనసహాయమున్నగాని జరుగదు. ఇట్టి గ్రంథ ప్రచురణగూడ నొక మహత్తరమగు తపస్సు. శాశ్వతధర్మ సంపాదన. లోగడ పారితోషిక మివ్వవలసినసభ్యులు వెంటనే తమ పారితోషికమును పంప ప్రార్థన. మా యీకృషికి తోడ్పడు ఉదారులెల్లరకు మా కృతజ్ఞతాభివందనములు.

హేమలంబి
శ్రీరామనవమి

వ్యవస్థాపకులు
సాధన గ్రంథ మండలి



# విషయసూచిక




అనువాదకులు — లేఖకులు

శ్రీరామ

# భాగవత కథ

## పరీక్షిత్తునకు శాపము

### ౭౯

శ్లో॥ తస్యపుత్రోఽతితేజస్వీ విహరన్ బాలకోఽర్భకైః
రాజ్ఞాఘం ప్రాపితం తాతం శ్రుత్వా తత్రేద మబ్రవీత్॥
ఇతి లంఘితమర్యాదం తక్షకః సప్తమేఽహని ।
దంక్ష్యతిస్మ కులాంగారం చోదితో మే తతద్రుహమ్ ॥

— శ్రీభాగ. ౧ స్కం. ౧౮ అ. ౩౬. ౩౭ శ్లో.

"వ. ... సమాన వయోరూప మునికుమార లీలాసంగి యయిన శృంగి శృంగంబులతోడి మూర్తిధరియించినట్లు విజృంభించి రోషసంరంభంబున నుదరిపడి ... రోషించి కౌశికీనదికిం జని జలోపస్పర్శంబు చేసి"

ఉ. ఓడక వింటికోపున మృతోరగముం గొనివచ్చి మాటుమా
టాడకయున్న మజ్జనకు నంసతలంబునఁ బెట్టి దుర్మద
క్రీడఁజరించు రాజు హరకేశవులాఁగినఁ జచ్చు నేటితో
నేడవనాఁడు తక్షకఫణీంద్రవిషానల హేతిసంహతిన్.

— శ్రీమదాంధ్ర భాగవతము

ఛప్పయ

హామునికో, ఇక పుత్ర సంయమీ పరమ తపస్వీ ।
ధర్మ కర్మ మహఁ నిరత తపోనిధి మహాయశస్వీ॥

పితృ అవజ్ఞా సునీ కోప అతి మన మహఁ ఆయో।
ముని పుత్రని కేనికట క్రోధ కరి బచన సునాయో॥
అరే, దుష్టక్షత్రియ అధమ, ఐసో సాహస కరి సకే।
గరుడ గరే మేఁ కాటి అహి, కహు కో జీవిత రహి సకే॥

### అర్థము.

శమీకమహామునికి సంయమియుఁ, బరమ తపస్వియు, ధర్మకర్మలయందు నిరతుఁడును, తపోనిధియు, మహాయశస్వియు నగు నొక కుమారుఁడు కలఁడు. ఆతఁడు తన తండ్రికి జరిగిన యవమానమును వినఁగానే, మహత్తరమగుఁ గోపము కలవాఁడయ్యెను. మునికుమారులకడ మండిపడి యిట్లనెను:— "అరే! దుష్ట క్షత్రియాధమా! ఇంతటి సాహసకార్యమును జేసితివా? గరుడుని కంఠమును గఱచిన పాము జీవింపఁగలదా?"

---

మన కోరికకు అంతరాయము కలిగించినప్పుడు క్రోధము కలుగును. మన కిష్టమైన కార్యములలో జోక్యము కలుగఁ జేసికొనినను, మనమాట మన్నింపకున్నను వానియెడలఁ గోపము వచ్చును. త్రిగుణాతీతులగు మహాపురుషులను వదలిన, మిగిలిన వారందఱకును గోపము వచ్చుచుండును. కాని తా నన్నివిధముల బలహీనుఁడనని తలఁచువాని క్రోధము ఉపవసించినవాని అజీర్ణ పదార్థము జీర్ణించినట్లు లోలోపల జీర్ణమై పోవును. దీనికి విపరీతముగ మానవుఁడు బలవంతుఁ డగుచో, వాని క్రోధము ప్రచండమై, వాఁడెవరిపైఁ గోపించునో వానిపై బదులు తీర్చుకొని శాంతించును. ఎవని కెంతటి

గర్వముండునో వాని కంత అధికముగఁ గ్రోధ భీషణము లుండును. గర్వమునకుఁ గారణములు ముఖ్యమైనవి అయిదు కలవు.

౧. సమ్మానితమగు శ్రేష్ఠకులమున జన్మించుట.

౨. మేమెంత ఐశ్వర్యశాలురమో చూడుమన్నట్లు వివిధైశ్వర్యములు కలిగి యుండుట.

3. విద్యవలనఁగూడ గొప్ప గర్వము కలుగును.

౪. ధనము, అధికారము వీనివలనఁగలుగు గర్వమునుగూర్చి చెప్పవలసినదియే లేదు. వీటివలన మానవుఁ డంధుఁ డగును.

౫. వీటి అన్నిటికంటె నభిమానము త్యాగ, తపస్సుల వలనఁ గూడ కలుగు చుండును. భక్తిహీనమగు తపోత్యాగముల వలన గర్వమింకను బెరుగును. స్వచ్ఛమగుభక్తి దగ్గఱకు గర్వము రాఁజాలదు. ఏలననఁగా భక్తికి వాహనము వినయము — దీనత లేక నమ్రత. నమ్రతపై నెక్కివచ్చిన భక్తి వచ్చినప్పుడు పిల్లిముందు ఎలుక నిలువఁజాలనట్లు గర్వాభిమానములు నిలువఁ జాలవు. గరుడుని భయముచే సర్పములన్నియుఁ బరువిడి పోయినట్లు, హృదయములో భక్తి ఉదయించినప్పుడును, బ్రహ్మసాక్షాత్కారమైనప్పుడును అహంకార ముండఁ జాలదు. క్రోధకారణమునే నశింపఁజేయును.

పరీక్షిన్మహారాజున కాసమయమునఁ దనరాజ్యైశ్వర్యములను గూర్చిన గర్వమేర్పడెను. నెత్తికెక్కిన కలి యాతని

బుద్ధిని భ్రష్టము కావించెను. శ్రేష్ఠత్వాభిమానము ఈర్ష్యా మత్సరములకుఁ దావొసంగెను. ఆఁకలి దప్పులగుటచేఁ క్రోధము తన యథార్థస్వరూపమును బయటపెట్టెను. చచ్చిన పామును మునికంఠమున వైచి, రాజు వెళ్లిపోగానే, సంయోగ వశమున మునిబాలకు లచ్చటకు ఆడుకొనవచ్చిరి. మహా తేజస్వియగు శమీకమహాముని కంఠములోఁ జచ్చిన సర్ప మును గాంచియు, నాశ్రమమునుండి అశ్వము నెక్కి అవనీపతి వెళ్లుటను గాంచియు, బాలురు పరుగెత్తుకొని నదీతటమునకుఁ బోయిరి. తేజస్వియగు శమీక పుత్రుఁడు అన్యఋషి కుమా రులతో నాడుకొనుచుండెను. బాలు రాతనిని సంబోధించుచు నిట్లనిరి:- "ఓరీ శృంగీ! నీవిచ్చట నాడుచున్నావు. నీతండ్రి సంగతి నీవెఱుఁగుదువా? ఆతని కెట్టి దుర్ఘటన తటస్థించినదో? ఈదేశమును బరిపాలించు రాజు, పరీక్షిత్తు ఆశ్రమమునకు వచ్చి, యాతని మెడలోఁ జచ్చిన పామును వేసి వెళ్లినాఁడు."

కుమారుఁ డిట్లనెను:- "ఎగతాళి కాదు కదా? నిజమేనా?"

బాలురు వారు చెప్పిన మాటలను మఱల నొక్కి చెప్పుచు నిట్లనిరి:- "ఒరే! నీవే గొప్ప సత్యవంతుఁడ వనుకొనుచున్నావు. మేము మాత్రము ఋషికుమారులము కామా? మేమెన్నఁడు నెగతాళికైన నబద్ధమును మాట్లా డము. ఒకవేళ మామాటలునమ్మకున్న పోయి స్వయముగఁ జూడుము."

అంత శమీకపుత్రునకు మిక్కిలి క్రోధము కలిగెను. పిల్లవాఁడే; కాని తాను తపస్వినను గర్వము కలదు. బ్రహ్మ

తేజముచే గ్రీష్మఋతువులో నెవరికిని దాఁకుటకు వీలులేని జాజ్వల్యమానమగు నగ్నివలె నాతఁడు మండిపోవుచుండెను. ఒక క్షత్రియుఁడిట్టి సాహసము చేయఁగలడా? నేను బ్రదికి యుండఁగాఁ దైత్రిలోక్యవందితుఁడగు నా తండ్రి నిట్లవమానము చేయఁగలఁడా? ఈవిషయ మాతని మనస్సులోనికి రాఁగానే వాని పెదవులు వణఁక మొదలిడెను. రెండు నేత్రము లరుణ వర్ణము కలిగి అగ్నివలె మండిపడిపోవుచుండెను.

బాలకు లందఱు వినునట్లాతఁడు క్రోధముతో నిండి యిట్లనెను:- "ఈ యధమక్షత్రియున కింతటి సాహసమా? తిన్న ఆకునే చింపివేయుటా? రాజుగా నెవరొనర్చిరో వారి యెడలనే నిట్టి దుర్మార్గమా? ఒక వైశ్యుని యింటిలో నొక కాకి బాగుగా నెంగిలిపదార్థము లన్నిటిని దిని, బలిసి, యా గర్వమునఁ దాను హంసలకు సమానమని తలఁచినదఁట. అంత హంసలతో పందెమువేసి మానససరోవరమును దాఁట సిద్ధపడెను. అది హంసలకు సమానము కాకపోవుటచేఁ దన ప్రాణమును గోల్పోయినట్లు ఈ రాజునుండ తన ప్రాణములను గోల్పోవును."

అన్య ఋషికుమారు లిట్లనిరి:- "అన్నా! ఆతఁడీ దేశమునకురక్షకుఁడు. అట్టివాని నేదైన ననవచ్చునా? సమస్త ప్రజలను దొంగలు, దోపిడిగాండ్రు, బలవంతులనుండి బాధలు కలుగకుండ రక్షించుచున్నాఁడు."

మిక్కిలి క్రోధమున నిండి ఋషిపుత్రుఁ డిట్లనెను:- "వానిని రక్షకునిగాఁ జేసిన దెవరు? యజ్ఞసమయమున

మన బ్రాహ్మణులు ద్వారరక్షణకై కుక్కను గావలియుంచెదరు. అది ఆపనినే చేయక, వచ్చి మన హవిస్సుల నెంగిలి చేసి, మన నేతిలో మూతిఁబెట్టి, స్రుక్స్రువములను మూచూచుచు నిట్టి సాహసము కావించిన దాని నేమి చేయుదుము? బడితపూజ చేసెదము. నడుము విఱుగఁగొట్టెదము. కోటలు పెఱికివేసెదము.''

బుద్ధిమంతుఁడగు బాలకుఁ డింకొకఁ డిట్లనెను:-''కుక్క విషయము వేఱు. రాజు మనుష్యుడు, వీరుఁడు. అస్త్రశస్త్ర ధారణ చేసినాఁడు.''

క్రోధముతో శృంగి యిట్లనెను:- ''మనుష్యుఁడైన నధర్మము చేయవలెనని కలదా? అస్త్రశస్త్రములు ధరించి అన్యాయము చేయునా? సేవకుఁడు స్వామికి సమానుఁడగునా? అస్త్రశస్త్రములు ధరించి ద్వారములోనుండి, అస్త్రశస్త్రములను ధరించి కావలి కాయుమనఁగా వాఁడు లోపలికిఁ బ్రవేశించి యజమాని కుర్చీమీఁదఁ గూర్చుండవచ్చునా? ఆతని పక్కమీఁదఁ బరుండవచ్చునా? ఆతని పాత్రలలో భోజనము చేయవచ్చునా? బ్రాహ్మణులే క్షత్రియులను దమకు రక్షకులుగాను, కావలివారిఁగాను, ద్వారపాలురుగాను కావించిరి. ఆతని పని ఆతని విధ్యుక్త ధర్మమును హద్దులు మీరక పాలించుట. వా రెక్కడ కూర్చుండుమనిరో వా రక్కడ కూర్చుండవలయును. ఆతఁడు యజమానికి అపకారము చేయరాదు. నేఁడాతఁ డీధర్మవిరుద్ధమును, శిష్టతారహితము నగు కార్యము నిష్టమువచ్చినట్లు చేసినాఁడు.''

ఋషికుమారు లిట్లడిగిరి:- "ఇంతవఱకు ఇట్టిందులకు జరుగుటలేదు? ఇంతవఱకేరాజైనను బ్రాహ్మణుల నీవిధమున నవమానము నేల చేయలేదు?"

శృంగి కుపితుడై యిట్లనెను:- "ఇప్పటివరకు వీరందరపైన పరమబ్రహ్మణ్యదేవుఁడగు వాసుదేవ భగవానుఁడు కలఁడు. ఆతఁ డుండఁగా నిట్టి యధర్మకార్యమును జేయు సాహస మెవనికి కలదు? బ్రాహ్మణుల కిట్టి యవజ్ఞత చేయు మనస్సుతోనైన నెవఁడు తలఁపఁగలిగెను? దుష్టశిక్షకుఁడగు శ్యామసుందరభగవానుఁడు స్వధామమును జేరెను. ఇప్పుడిఁక నీ యధర్ములు తాము స్వతంత్రుల మనుకొనుచుండిరి. ఇప్పుడెవరేమి మనలను జేయఁగలరను ధీమాతో వారుండిరి."

ఋషికుమారులు వివశతాస్వరమున నిట్లనిరి:-"అయితే మన మిప్పు డేమి చేయవలయును? భగవానుఁడు స్వధామమును జేరినాడు కావున మనమిఁక నన్నియును సహింపవలసినదే. అపకారిమీఁద కసితీర్చుకొనుటకు మనము క్షత్రియులము కాదుగదా! మన బ్రాహ్మణులకు క్షమయే బలము."

అత్యంతక్రోధస్వరముతో శమీకతనయుఁ డిట్లనెను:- "క్షమయా! ఇటువంటివారియెడలనా క్షమ? భగవానుఁడు స్వధామమునకుఁ బోయిన నేమి? మనకు తపోబలము లేదా? అస్త్రశస్త్రములు దుర్బలులగు క్షత్రియులకుఁ గావలయును. మనకు బలము తపస్సు. వాణియే మన కమోఘమగు వజ్రము. నేఁడు నేనా యమోఘవాగ్వజ్రముచే నధర్మాత్ముఁడగు రాజును బూర్తి చేసెదను. అన్యాయియగు నవనీశ్వరుఁడు శీఘ్రముగఁ

దాను జేసినదానికి ఫల మనుభవింపవలెను. ఆలస్యము లేకుండ నాతఁడు యమసదనమును జూడవలయును. నా తండ్రి మెడలో మృతసర్పమును వేసినవాఁడు మృత్యుపాశమునఁ బడవలయును.''

ఇట్లని యా శమీకకుమారుఁడు క్రోధోద్రేకమున కౌశికీనదీజలమున నాచమించి రాజునకు భీషణశాపమొసంగ నుద్యుక్తుఁడయ్యెను.

ఆ సమయమున ఋషికుమారుని రెండుకన్నులనుండి క్రోధముచే నిప్పులురాలుచుండెనా యనునట్లుండెను. ఆతఁడు తన శరీరమును మఱచెను. కౌశికీనదీజలమును దోసిలిలోఁ గైకొని ఋషికుమారులందఱు వినున ట్లిట్లనెను:— ''ఏ దుష్ట కులాంగారుఁడు నా తండ్రిగళమున మృతసర్పమును వైచెనో వాఁడు నేఁటి కేడవదినమున నాశాసనమున మహావిషధర సర్పమగు తక్షకునిచేఁ గఱువఁబడి మృతిఁజెందునుగాక!''

ఈ విధముగ శాప మొసంగి తేజస్వియగు నా ఋషి కుమారుఁ డన్యఋషికుమారులతోఁ దన యాశ్రమమునకుఁ బోయెను. కుమారుఁ డింకను జిన్నవాఁడు. ఇంకను ఆటపాట లచేఁ గాలము గడుపవలసిన వయస్సు. ఋషిపుత్రుఁడగుటచే వంశపరంపరాగతమగు తేజస్సు, తపస్సు ఆతని శరీరమున వ్యాపించి యుండెను. అయినప్పటికిని చిన్నతనపుఁ జేష్ట లెక్కడికి పోవును? ఆశ్రమమునకు వచ్చి, తన తండ్రి మెడలో మృతసర్పము మాలవలె నుండుటను గాంచి యాతఁడు సహింపలేకఁబోయెను. ఆతఁడు దానిని గాంచి వెక్కి వెక్కి యేడ్వఁ బ్రారంభించెను. ఆతని రోదన ధ్వనిచే ముని సమాధి

భంగమయ్యెను. అతఁడు నిద్రనుండి లేచిన వానివలె నలు వైపులను గాంచెను.

అంత శౌనకుఁ డిట్లనెను:- "సూతా! రాజు ముని ననేక విధములఁ బిలిచినను సమాధి భంగము కాలేదు. తన కుమారుని రోదన ధ్వనిని వినఁగానే సమాధి భంగమైనది; కారణమేమి? అయితే ముని నిజముగ రాజును గని కన్నులు మూసికొనెనా? అట్లు కాకున్న అంతగొప్పరాజు వాక్యములు వినఁబడనిది చిన్నవాని రోదనమెట్లు సమాధిని భంగము కలిగింపఁగలిగినది? మా యీసంశయమును బోఁగొట్టుము."

ముని యడిగిన యిట్టి ప్రశ్నను విని సూతుఁడిట్లనియె:- "మహాభాగా! ఫలాని సమయమునకు మాసమాధి పూర్తి కావలెనని మొదటనే సంకల్పము చేయుదురు. ఈ జగత్తంతయు సంకల్పముననే ఆధారపడియున్నది. నిస్సంకల్పుఁడైన వాఁడు సంసారసాగరమును దాఁటిసట్లే. సమాధిలో నీదృశ్య ప్రపంచము లేకున్నప్పటికిని, అనుకొన్న కాలము పూర్తి కాఁగానే అప్పుడు బాహ్యావృత్తి కలుగును. ఈదృశ్యమాన జగత్తుతో మరల నింద్రియ సంబంధము కలుగును. దీనికి నేను స్థూలోదాహరణము నొసంగెదను. ఏమానవుఁడైనను రాత్రి పరుండఁబోవునపు డిన్నిగంటలకు తప్పక లేవవలెనను కొనిన, సరిగా నాసమయమునకు మెలకువ వచ్చును. దాని కొక్క-నిమిషమైనను ముందువెనుక లుండదు. దైవికముగ సరిగా నాతని కుమారుఁడేడ్చునప్పుడే ఆతఁడు సమాధినుండి లేవవలసిన వేళయైనది. బాహ్యావృత్తి కలుగుటచే మునిదృష్టి మునుముందుగాఁ బిల్లవాని రోదనము మీఁదఁబడెను. అంతఁ

దన గళమునఁగల మృతసర్పమును గాంచెను. వెంటనే యాతఁడు తన చేతితో దానిని పట్టుకొని ఆవల విసరివేసెను.

సర్పము నావలఁ బారవైచి మిక్కిలి స్నేహముచే నాతని పుత్రునితో నిట్లనెను:- "నాయనా! నీ వెందుల కిట్లేడ్చుచున్నావు? నిన్ను బాధించిన దెవరు? నీ కపకార మొనర్చిన దెవరు? నీకేకారణమున నిట్టి మానసిక వ్యథ కలిగినది? ఈ మృతసర్పము నామెడలోని కెట్లువచ్చినది? ఈ విషయములన్నిటిని నాకుఁ జెప్పుము. ఏడ్వకుము. ఇట్లధీరుఁడ వగుట మంచిది కాదు."

తండ్రి యట్లుడుగఁగాఁ గన్నులు నీరు తుడుచుకొనుచు శృంగి మొదటనుండి చివరవఱకు సమస్తవృత్తాంతము నిట్లు చెప్పెను:- "పరీక్షిన్మహారాజనెడు ఈదేశపురాజు కలఁడు. మీరు సమాధిలో నుండుటనుగాంచి మృతసర్పమును దెచ్చి మీమెడలో వేసివెళ్లినాఁడు. నేనీ సమాచారమును విని వెంటనే 'నేఁటి కేడవదినమున నీ మృతసర్పమే తక్షకసర్పమై కాటువేయుఁగాక!' అని శపించితిని."

పుత్రుని నోట శాపవృత్తాంతమును విని, ముని తన యవమానమును మరచి తనకుమారుఁడు శాపమిచ్చినందులకుఁ జాల దుఃఖించెను. ఆతఁడిట్లనుకొనెను:- "రామ! రామా! ఈకుఱ్ఱవాఁడు చిన్నతనముచే నెట్టియన్యాయమును గావించినాఁడు! ఎక్కడనైన నిట్టి ధర్మాత్ముఁడగు రాజునకిట్టి శాప మొసంగవచ్చునా?" ఆతఁడు పుత్రుని కసరుచు నిట్లనెను:- "మూర్ఖా! నీవెట్టి పిల్లతనపుచేష్టలు చేసితివిరా! చిన్నతప్పునకు వాగ్వజ్రమును బ్రయోగించుటయా తపము

చేసినందులకు ఫలము? నిరపరాధులకు శాపప్రహారము కావించుటా?''

బాలుఁ డేడ్చుచు నిట్లనెను:- ''తండ్రీ! ఆతని నిరపరాధుఁడని మీ రెట్లనుచున్నారు? నాకుఁ బూజ్యుఁడైనవాని నిట్లవమానించిన వానిని దండింపక యెట్లుండఁగలుగుదును?''

కసరుచు ముని యిట్లనెను:- ''నోరు మూయుము. దండించువాఁడు దిగివచ్చినాఁడు! ఋషులెచ్చటనైన దండింతురా? ఇది తన తపోబల నాశము చేసికొనుటకే. పోనిండు, అదియైన నెవరిమీఁద? ఇతరుని మీఁదఁ గాదు. కేవలము విష్ణ్వంశ సంభూతుఁడగు రాజు మీఁదనా? ఆతని తేజము చేతనే నేఁడీ ఘోరవనములో నిర్భయముగ తపస్సు చేసికొనుచున్నాము. ఆతని పురుషార్థము చేతనే యజ్ఞయాగాది కార్యములలో దుష్టులు, రాక్షసులు విఘ్నము చేయఁజాలకుండిరి.''

భయపడుచు బాలుఁ డిట్లనెను:- ''అయితే ఆతఁ డిట్టి యధర్మకార్యమేల కావించెను?''

ఋషి గంభీరముగ దుఃఖతాపూర్ణస్వరమున నిట్లనెను:- ''ఓరీ! నీవింకను బాలుఁడవు. నీబుద్ధి యింకను బరిపక్వము కాలేదు. నీశాపమున నేమి యనర్థములు కల్గునో ఆసంగతి నీకు తెలియదు. ఈరాజు గొప్ప ధర్మాత్ముఁడు. వీనితో సమానమగు సదాచారవంతుఁడు, బలవంతుఁడు, ప్రతాపవంతుఁడు, ప్రభావశాలియగు రాజింకొకఁడు లేఁడు. నీ శాపముచే నీవిష్ణుస్వరూపుఁడగు రాజు మరణించిన, నీ భూమి మీఁద దస్యులు, చోరులు ప్రబలఁగలరు. అప్డు

డన్నియెడలను దోపిడులు జరుగఁగలవు. ఒకరిధనము నొకరు లాగుకొందురు. పశువులను దొంగిలింతురు. కన్యకలను-బలాత్కారము కావింతురు. స్త్రీలను హరింతురు. ప్రజలలో హాహాకారములు వ్యాపింపఁగలవు. ప్రజలు కాపులేని గొఱ్ఱెల వలె గుంపులుగుంపులుగాఁ బరువిడి బావులలో బడిపోవుదురు. సర్వత్ర అనర్థము, అత్యాచారము వ్యాపింపఁ గలదు. ఈ దుఃఖము లన్నిటిని మనముకూడ అనుభవింపవలసి యుండును. మన కారణమున నీయనర్థము లన్నియుఁ గలిగినవి కావున దీనిలోని పాపమును మనముకూడ పంచుకొనవలసి యుండును.

ఇంతేకాదు, ధార్మికుడగు రాజులేకున్న వర్ణాశ్రమ ధర్మములుండవు. వర్ణాశ్రమధర్మములు లేకున్న వేదవిహితాచారములు నశించిపోవును. ఆచార విచారములు, కులపరంపరాగతమగు మర్యాదలు నశించుటచే నన్నివర్ణములవారు అంతర్వర్ణ వివాహసంబంధములు చేయుచుందురు. అందును వారియిష్టముప్రకారము ఆచారవ్యవహారములు పాటింపకయే ఆహార పానీయములను గైకొనుచుందురు. కామవాసన పెరుగఁగలదు. లోకమర్యాద నశింపగలదు ప్రజలు కుక్కలు, క్రోఁతులవలె నన్నివర్ణముల స్త్రీలతో సంగమించి సంతానోత్పత్తి కావింపఁగలరు. ఆవర్ణసంకర సంతానము ధర్మకర్మ విహీనులై - పరలోక కార్యములను వదలి - పాపకర్మలందు ప్రవృత్తులగుచుందురు.''

కుమారుఁడగు శృంగి యిది యంతయును విని మిక్కిలి దుఃఖితుఁడై యేడ్చుచు నిట్లనెను:- ''నా కివి యన్నియు నేమి తెలియును? రాజు చూపిన యవినయమును గాంచఁ

గానే నేను కుపితుఁడనైతిని. మీయెడలఁ జేసిన యీయభద్ర వ్యవహారమును గాంచి నేను సహింపలేకపోయితిని. ఆతనిని గూర్చి నే నిట్లనుకొంటిని:- 'ఈరాజు అమితాహంకారి. అశిష్టుఁడు. అధార్మికుఁడు అభక్తుఁడు. కావున ఋష్యాశ్రమమునకు వచ్చి, యిట్టి అనుచిత వ్యవహారమును గావించినాఁడు.' కావుననే వీనికిట్టి శాపమొసంగితిని.''

శమీకమహాముని మమతనంతను బుంజీభవింపఁజేసి. యేడ్చుచున్న తన పుత్రుని గాంచి యిట్లనెను:- ''బిడ్డా! పరీక్షిన్మహారాజు గొప్ప ధర్మాత్ముఁడు. ఆతఁడు సమస్త భూమండలమునకుఁ జక్రవర్తి. ఆతఁడీ కలికాలములోఁగూడ ధర్మము నెంతో రక్షించెను. ఆతని భయముచే నెవఁడుఁ నధర్మకార్యములందు ప్రవృత్తుఁడగుటలేదు; పరదార, పరధనాపహరణము లొనర్చుటలేదు. ఆతఁడు గొప్పగొప్ప అశ్వమేధాదియాగములను గావించెను. ఆతని యశస్సు త్రిభువనములలో వ్యాపించినది. ఆతఁడు యశస్వి యగుటయే కాదు, ఆతఁడు వాసుదేవభగవానునకు గొప్పభక్తుఁడు. భగవంతుఁడాతనికి గర్భములోనే దర్శనమొసంగెను. గదతో ద్రోణతనయుఁడగు అశ్వత్థామ వేసిన బ్రహ్మాస్త్రమునుండి రక్షించెను. ఆతని కిట్టి శాపమొసంగుట, ఏపాటి ఉచితమగు కార్యము ?''

కుమారుఁడు చింతా మనస్కుఁడై యిట్లనెను:- ''తండ్రీ! రాజింతటి భగవద్భక్తుఁడు, యశస్వి, తేజస్వి, ధర్మాత్ముఁడగుచో, నాతఁడిట్టి యనుచిత కార్యము నేల చేసెను? ఆతఁడు మీవంటి తపోనిధుల నేల యవమానించెను?

మీమెడలో మృతసర్పమును వేయుటచే నాతని కేమి ప్రయోజనము ?''

మహాముని మిక్కిలి గంభీర స్వరమున నిట్లనెను:— ''నాయనా! కాలము బలవత్తరమైనది. అన్నియు నదియే చేయింపఁగలుగును. మానవునకు వివేకము నశించు పరిస్థితి అప్పుడప్పు డేర్పడుచుండును. నీవు ధ్యానపూర్వకముగ రాజుగారి పరిస్థితిని గూర్చి విచారించుము. ఆతఁడు చక్రవర్తి. ఎల్లప్పుడాతనిని వేలకొలఁది దాస దాసీజనములు సేవించుచుందురు. ఆతనిభావముల వలననే అందఱు తక్షణమాజ్ఞలను పాలించుచుందురు. ఆతఁడు బయటకు బయలుదేఱఁగానే గొప్పగొప్పరాజు లాతనికి స్వాగతసత్కారములు చేయుటకు సిద్ధపడియుందురు. ఎప్పుడు నిట్టి భోగములు జరుగుచుండుట చే నాతనికవియే అలవాటైపోయినది. ఆతఁడిచ్చటికి ఒంటరిగా వచ్చెను. ఆతఁడెప్పుడును మాచేత సమ్మానింపఁబడుచుండెడు వాఁడు. అట్టిదే యిప్పుడు నాశించెను. ఇక్కడికి రాఁగానే ఆతనికి సమ్మానము జరుగలేదు. పిలిచిన జవాబురాలేదు. అడిగినను ఆతనికి త్రాగనీరు దొరుకలేదు. ఆఁకలిదప్పికలబాధ ఆతని వివేకమును నశింపజేయునంత మిక్కుటమయ్యెను. అట్టిస్థితిలో నాతఁడది అనుచితమనుకొనక, తానొక యనుచిత కార్యమొనర్చిన దానికి మనమలిగి శపింప వచ్చునా? ఛీ! ఛీ! నీవు చాల చెడ్డపని చేసితివి. నీవింకను పిల్లవాఁడవు. అపక్వ బుద్ధి కలవాఁడవు. కర్తవ్యాకర్తవ్యతా జ్ఞానము లేదు. అవ్యగ్ర భావముతో మనల నెల్లప్పుడు సేవించువాఁడు, ఒకవేళ నట్టి నిరపరాధుఁడు మనకపరాధ మొనర్చినను క్షమింపవలెను.''

ఈవిధముగ బాలుని మందలించి, ముని చాలదుఃఖము చెందెను. ఇప్పుడింకొక ఉపాయమేమియు లేకపోయెను. కావున నాతఁడు కన్నులుమూసికొని సర్వాంతర్యామియగు వాసుదేవభగవానుని ప్రార్థింప మొదలిడెను. "ఓ ప్రభూ! బాల్యచాపల్యముచే నీ యజ్ఞానియగు బాలఁకుడు రాజున కపరాధము కావించెను. ఘటఘటవాసియగు నో జగదాధార స్వామీ! వీనిని క్షమింపుము. ఈ బాలునికి శుభము లొనగూర్పుము! రాజునకుఁగూడ కల్యాణము కలుగుఁగాక!"

సూతుఁడిట్లనెను:- "ఋషులారా! దీనికే సాధుత్వమని పేరు. రాజు కలి ప్రభావమున మునికెంతయో అవమానమును గావించెను; కాని మునికి దానియందు దృష్టియే లేదు. మాటిమాటికి జ్ఞాపకము చేసినప్పటికిని, ఆయపరాధము లెక్కకురాని సాధారణమైన దనియే చెప్పుచుండెను; కాని శృంగియిచ్చిన శాపమున కాతఁడు చాల వ్యథితుఁడయ్యెను. పుత్రుని మందలించెను; భగవానుని క్షమింప వేఁడుకొనెను. రాజు క్షేమమును గోరెను. ఆత్మజ్ఞానులు, భగవద్భక్తులగు మహాత్ములు ఇతరులుపెట్టిన సుఖదుఃఖములను బాటింపక మిక్కిలి వ్యథితులునుగారు, మిక్కిలి ప్రసన్నులును గారు. సుఖదుఃఖాది ద్వంద్వములు మనోధర్మములనియు, ఆత్మ నిర్ద్వంద్వము, నిర్లేపము, సుఖదుఃఖముల కతీతమైనదనియు, సదా పరమ సుఖస్వరూపమనియు నాతనికిఁ దెలియును. అట్టి నిర్గుణున కెవఁడు సుఖదుఃఖము లొనగూర్పఁగలుగును?"

శౌనకుఁ డిట్లనెను:- "సూతా! మహాముని కింతటి పశ్చాత్తాపము కలిగియుండినచో, శాపమిచ్చినది పుత్రుడు

కదా, తనపుత్రునికంటె నాతఁడధికశక్తిశాలియగు తేజస్వియుఁ, దపస్వియు, సర్వసమర్థుఁడును గదా! అట్టియెడ నాతఁడా శాపము నేల అన్యథా కావింపరాదు? రాజు చిరంజీవి కావలెనని యేల నాశీర్వదించి వరము లీయరాదు?''

అంత సూతుఁ డిట్లనెను:-''మహాభాగా! ఇది నిజమే. శమీకమహాముని పరమ తేజస్వియు, సర్వసమర్థుఁడును. త్రికాలదర్శియగు నా ముని ధ్యానమునఁ జూడఁగా రాజు మృత్యువు తక్షకవిషానలమునఁ జెందవలెననియు, నిది తప్పదనియుఁ దెలిసెను. అట్టి విధివిధానమును దప్పింప నాతని కిష్టము లేదు. జరుగవలసినది జరుగవలయుననియే యాతని మతము. అందువలన నాతఁడు శాపము నన్యథా కావింపలేదు. ఆ సమయమున నాతఁ డొక సర్వసమర్థుఁడగు శిష్యుని బిలిచి యిట్లనెను:- 'నీ విప్పుడే యోగమార్గమున హస్తినాపురమునకుఁ బొమ్ము. పోయి రాజుతో నా కుమారుఁడు బాల్యచాపల్యముచే నిట్టి యనుచిత శాపము నొసంగెనని చెప్పిరమ్ము. నేఁటి కేడవదినమునఁ దక్షకుఁడు కాటు వేయఁగలఁడనియు, నీ యేడుదినములలోఁ దనకు శ్రేష్ఠమనితోఁచిన కార్యములను జేసికొనవచ్చుననియుఁ జెప్పుము. నా హృదయపూర్వకముగ నాతని నాశీర్వదించుచుంటిని. నీవు పరమ భగవద్భక్తుఁడవు. కావునఁ బాముకాటుచేఁ జచ్చినను నీకు దుర్గతి కలుగదు. నీవు భగవంతుని వైకుంఠధామమును బొందగలుగుదు'వని చెప్పుము.''

ఈ విధముగ శిష్యునకు సందేశ మొసంగి శమీకముని వానిని ద్వరగాఁ బంపెను. శిష్యుఁడుకూడ అత్యంతశీఘ్రముగ నాకాశమార్గమున హస్తినాపురమునకుఁ బోయెను.

ఛప్పయ.

డర్యో పితు ఉర స్యాఁప శాపు హాఁ దేహాఁ వాకూఁ।
డసే సాతవేఁ దివస మహా అహి తక్షక తాకూ॥
యోఁ దేకేఁ సుతశాప పూజ్యపితు కేఢిఁగ్ ఆయో।
మర్యో స్యాఁపు ఉర నిరఖి, బహుత రోయో చిల్లాయో॥
జగే మహాముని సునీ సబ, బాతబహుత దుఖ మన కియో
ధిక్కార్యో సుత వివిధ విధి, నృపసన వృత్త పఠై దియో॥

అర్థము.

తండ్రి మెడలోని సర్పమును గాంచి భయపడి యిట్లు శపించెను. 'ఎవఁడు నా తండ్రి మెడలో నీపామును వైచెనో ఆతఁ డేడవదినమునఁ దక్షకునిచేఁ గాటువడి కాలగతిఁ జెందఁ గలఁ'డని శపించి తండ్రికడకు వచ్చి, చచ్చిన పామాతని మెడలో నుండుటను గాంచి, మిక్కిలిగ విలపించి, కేకలు వేసెను. అంతట ముని యాశబ్దమును విని లేచి సమస్త వృత్తాంతమును గ్రహించి, దుఃఖించి, నందనుని మందలించి, యీ వృత్తాంతమును నృపునకుఁ దెలియఁ బంచెను.

# పరీక్షిత్తుని పశ్చాత్తాపము

## ౮౦

శ్లో॥ స చింతయన్నిత్థమథా శృణోద్యథా,
మునేః సుతోక్తో నిర్‌ృతి స్తక్షకాఖ్యః।
స సాధు మేనే న చిరేణ తక్షకా
నలం ప్రసక్తస్య విరక్తి కారణమ్॥
— శ్రీభాగ. ౧ స్కం. ౧౯ అ. ౪ శ్లో.

"వ. ............ ఆ యభిమన్యు పుత్రుండు శమీకముని శిష్యునివలన శాపవృత్తాంతంబువిని కామక్రోధాది విషయాసక్తుండగు తనకుం దక్షకవిషాగ్ని విరక్తిబీజం బగుననుచుం గరినగరంబునకుం జని యేకాంతంబునం బశ్చాత్తాపంబుం జెందెను."
— శ్రీమదాంధ్రభాగవతము

ఛప్పయ.

ఇత నృప పురమహఁ పహుఁచి కనక జబ ముకుట ఉతార్యో।
ఆశ్రమ కర్యో కుకృత్య చిత్తమహఁ ఫేరి విచార్యో॥
అరే, బుద్ధి మమ భ్రష్ట భఈ, అనుచిత యహ కీన్హో।
యోగనిష్ఠ తే మహా తపస్వీ ముని అబ చీన్హో॥
సోచే - అబ ముని కోప తేఁ, మమ సరబసు నసి జాయగో।
తాహీ ఛిన సందేశ లే, శిష్య నృపతి ఢిఁగ ఆఇగో॥

అర్థము.

ఇచ్చట నృపతి స్వపురమునకుఁ జేరి, స్వర్ణముకుటమును దీయఁగానే, ఆశ్రమములోఁ దాను జేసిన దుష్కార్యమునుగూర్చి

విచారింపఁదొడఁగెను. ఆతఁ డిట్లనుకొనెను:- 'అయ్యయ్యో! నాబుద్ధి భ్రష్టమైనది. అనుచితకార్య మొనర్చితిని. యోగ నిష్ఠుఁడగు మహాతపస్విని నే నవమానించితిని. ఇపుడిఁక ముని కోపముచే నా సర్వస్వము నశింపఁగల'దని చింతించుచున్న సమయమున మునిదగ్గఱనుండిశిష్యులుసందేశమునుగొనివచ్చిరి.



లోకములో పొరపాటుననైన నపరాధము చేయనివాఁ డెవఁడున్నాఁడు? మంచివారు, చెడ్డవారు; సజ్జనులు, దుర్జనులు; మూర్ఖులు, పండితులు అందఱును గొంచెముగనో గొప్పగనో ప్రకృతి వశమున నపరాధమును జేయుచునే యుందురు. దుష్టులద్వారా జరిగిన అపరాధమునకు, సజ్జనులద్వారాజరిగిన అపరాధమునకు భేదముకలదు. దుష్టుఁడెవనికైన నపరాధము కావించి సంతోషించి గర్వపూర్వకముగ "వానికి బాగుగా శాస్తి చేసినాను అదియు బ్రతికినంతవఱకు మఱవకుండునట్లు చేసినా"నని ప్రలాపించుచుండును. పూర్తిగ దీనికి వ్యతిరేక ముగ సజ్జనుఁడు బుద్ధిపూర్వకముగ నే యపచారమును జేయఁడు. ఒకవేళఁ బ్రకృతి వశమున నేదైన జిన్న అపచా రమును గావించెనా, ప్రకృతిస్థుఁడై యుండ నాతనిహృదయము మాటిమాటికి వానిని ధిక్కరించుచుండును. ఆతఁడు పశ్చా త్తాపాగ్నిలోఁబడి తపించుచు, మాటిమాటికి ఇట్లనుకొను చుండును:- "అయ్యో! ఆసమయమున నాదగు నిట్టి బుద్ధి యేల భ్రష్టమైనది? నే నిట్టి మహాదనర్థము నేల చేసితిని? నేను ఇంద్రియ వశుఁడనైతినా?" ఇట్టి పశ్చాత్తాపాగ్నిలో నాతఁడు తన పాపమును గాల్చివేయును. ఆ పాపమునకు

యథాశక్తిగఁ బ్రాయశ్చిత్తము చేసికొనును. దాని ప్రతీకారము కొఱకు జప, తపానుష్ఠానాది ప్రాయశ్చిత్తములలో దేనినైనఁ జేసికొను చుండును. పశ్చాత్తాపము వలనను, ప్రాయశ్చిత్తము వలనను అనేకములగు పాపములు నశించియే పోవును. చాల తగ్గిపోవును.

పరీక్షిన్మహారాజు మిక్కిలి శీఘ్రముగఁ దన నగరములోనికి పోయెను. పురమును జేరి, తన సువర్ణ రత్నమండిత కిరీటమును దీసెను. కిరీటమును దీయఁగానే ఆతనికి తెలియవచ్చెను. ఆశ్రమములోఁ దాను చేసిన పనిని దలఁచుకొనఁగానే ఆతనికి హృదయము బ్రద్దలగుచుండెను. ఆతఁడు పశ్చాత్తాపాగ్నిలోఁ దపించుచుండెను. ఆతనికి జగత్తంతయు శూన్యముగఁ దోఁచుచుండెను. ఇఁకఁ దనకు క్షేమము లేదని ఆతఁడు మనస్సులో నిశ్చయించుకొనెను. ముని శాపముచే తన సర్వస్వము నాశమై పోఁగలదనుకొనుచుండెను. ఆతఁడేకాంతమునఁ గూర్చుండి మెదలకుండ కన్నీరు కార్చుచుండెను. ఉండి ఉండి ఆతని నింద్య దుష్కృత్యముమీఁద నాంతరిక పశ్చాత్తాపము కలుగుచుండెను. ఆతఁడదే విషయము ననేక తర్కవితర్కములచేఁ జింతించుచుండెను:– "అయ్యో! నాబుద్ధి యిట్లు బుగ్గయినదేమి? ఆసమయమున నేను నిరపరాధియు, గూఢుఁడును, తేజోమయుఁడు నగు మునీశ్వరునితో నెట్టి యనార్య పురుషునివలె వ్యవహరించితిని? ఆతఁడు నాకేమి చెఱుపుఁ జేసినాఁడు? నగరమునకు దూరముగనుండి, ఘోరారణ్యములలో కటు తిక్త తీక్ష్ణ కందమూలాది ఫలములను దిని యాతఁడు కాలయాపనఁ జేసికొనుచుండెను. ఆతఁడు

నన్నెప్పుడు నేమియు నడిగెడువాడే కాడు. నావలన నాతనికిఁ గావలసిన దేమియును లేదు. భగవద్ధ్యానము చేసికొను చుండును. తన తపోధనమును వృద్ధి చేసికొనుచుండెను. నేనకారణముగ నాతని మెడలో మృతసర్పమును వేసితిని. నేనాతని మెడలో మృతసర్పమును వేయలేదు సరిగదా విషధర భుజంగ ఫణమునఁ గాలిడితిని. పగపట్టిన పాము ఒక్కని ప్రాణముమాత్రమే తీసిపోవును. దాని విషాగ్నిచే నపకారియే దగ్ధము కాఁగలఁడు; కాని మునికోపాగ్నిచే పాపినగు నేను, నారాజ్యము, సమస్త సేన, బంధువులు, వేయేల నా సర్వస్వమును దగ్ధమై భస్మమై పోఁగలదు. ఒక్క నా వలనఁ గోట్లకొలఁది నిరపరాధుల జీవములు పోఁగలవు. అయ్యో! నే నెట్టి పాడుపని చేసితిని? నా కెంతటి కఠిన శిక్ష వేసినను అది మిక్కిలి యల్పముగఁ దోఁపచేయు నిందనీయ కార్యమును నేను చేసితిని. కావున మునియిచ్చిన దారుణశాపము నా పాపమునకుఁ బ్రాయశ్చిత్తము కాఁగలదు. అదియును గాక నాకును, ఇతర రాజులకును ఇట్టి యపరాధము నిఁక నెన్నడును జేయరాదను శిక్షణ ఈ మూలమున లభించుఁ గాక! తపస్వుల కపరాధ మొనర్చువారి కిట్టి దుర్దశ కలుగునని తెలియునుగాక! ఇఁక నేనుగాని, నా వంశజులుగాని, ఇతర రాజులుగాని బ్రాహ్మణులకును, దేవతలకును, గోవులకును ఇట్టి యనాదరము, నిట్టి అవమానమును జేయకుందురుగాక!''

రాఁగానే మహారాజున కీ చింత కలిగెను. అతఁడాశ్రమమునుండి వచ్చిన తర్వాత నాచమింపలేదు. చేతులను గాళ్లను గడుగుకొనలేదు. దాసీలు స్వర్ణపాత్రలతో జలము

లను దెచ్చి చాలసేపటినుండి ప్రతీక్షించుచుండిరి కాని రాజున కా ధ్యాసమే లేదు. ఆతఁడు కుపితుఁడైన మునిని భావజగత్తులోఁ గాంచి భయభీతుఁడై గడగడ వణఁకుచుండెను. ఇంతలోనే ద్వారపాలకుఁడు వచ్చి, మహారాజునకు జయజయ శబ్దములు కావించి, చేతులు జోడించుకొని వినీతభావముతో నిట్లనెను:— "ప్రభూ! శమీకమహాముని ఆశ్రమమునుండి వచ్చిన పరమతేజస్వి యగు నొక శిష్యుఁడు వచ్చి వాఁకిట నిలిచియున్నాఁడు. ఆతఁడు మహారాజుగారిని శీఘ్రముగ దర్శింపవలయు ననుచున్నాఁడు. మీ యాజ్ఞ యగుచో వాని నిటఁ గొనివచ్చి, అగ్నిశాలలోఁ గూర్చుండఁ జేతును."

"శమీకమహాముని ఆశ్రమమునుండి ఆతని శిష్యుఁడు వచ్చినాఁడు." అనువాక్యమును వినఁగానే మహారాజు అదరి పడెను. అత్యంతోత్సుకతతో ద్వారపాలునితో బాలునివలె నిట్లడిగెను:— "ఓరీ! మునిశిష్యుఁ డేమనినాఁడు? ఆతఁడు కోపముగ నున్నాఁడా? ఆతని చేష్ట లెట్లు కనఁబడుచున్నవి? ఆతఁడేమి చెప్పఁదలఁచినాఁడు?"

ద్వారపాలుఁ డత్యంత వినయముతో నిట్లనెను:— "ప్రభూ! ముని అతిశాంతుఁడు. ఆతఁడు మహారాజునకు జయజయశబ్దములు పలుకుచున్నాఁడు. ఆతఁడు పలుకుటకు వ్యగ్రుఁడైనట్లున్నాఁడు. ఆతఁడాశీర్వాదపూర్వకముగ నన్ను మీ దగ్గఱకు వెళ్లి రమ్మని పంపినాఁడు నే నిట్లు నివేదించితిని కూడా:— "విప్రోత్తమా! మా ప్రభు విప్పుడే వనమునుండి అలసి వచ్చినారు. మీ రొక ముహూర్తము సేపు విశ్రమించినఁ గొంచెము సేపైన తర్వాత మీరాకఁ దెల్పుదును"

అంత నాతఁ డత్యంతగంభీరుఁడై శాంతభావముతో నిట్లనెను:– "ఓయీ! నాకు చాల ముఖ్యమగు కార్యము కలదు. నేను మరల మా యాశ్రమమునకు తిరిగి వెళ్లి మా గురువుగారికి సంగతి సందర్భములు తెలుపవలెను. నీవు సావధానముగ నమ్రతతో మహారాజునకు నా సందేశమును జెప్పుము. దానిని వినియుఁ గూర్చుండుమనిన నేను కూర్చుండెదను."

'మునిశిష్యుఁడు కుపితుఁడుగా లేఁడు, శాంతుఁడుగా నున్నాఁడు. తన్నాశీర్వాదముతోఁ బిలుచుచున్నాఁ'డను సంగతిని వినఁగానే కూర్చుండినవాఁ డట్లే కిరీటధారి కాకయే ద్వారముకడకు పరువిడి వచ్చెను. దాస దాసీజనములును, నౌకరులును, ద్వారపాలురును, ఇతరులును మహారాజిట్లు అభూతపూర్వవ్యగ్రతతోఁ బోవుచుండుటనుగాంచి యాశ్చర్య చకితులైరి. ద్వారముకడకు వచ్చి, మహారాజు అశ్రుపూర్ణములగు నేత్రములతో, మిక్కిలి అధీరతతో నేలమీఁదఁబడి మునిపుత్రునకు సాష్టాంగనమస్కారము కావించెను.

కృష్ణమృగచర్మమును గప్పుకొని, చేతిలో కుశముష్టిని, దండకమండులువులను ధరించి మునిశిష్యుఁడు సాక్షాచ్ఛరీరమును ధరించిన తపమున్నట్లు కనఁబడుచుండెను. రాజీవిధముగ భూమిపైఁబడుటనుగాంచి మునిశిష్యుఁ డాతనిని కఠినతతో లేవనెత్తి, వాని నాలింగనము కావించుకొని మిక్కిలి గంభీరముగ నిట్లనెను:– "రాజా! మాగురువగు శమీకమహాముని మీ కుశల మడిగినాఁడు. నీ కాశీర్వాదము బంపినాఁడు."

'ఆహా! ముని నాకుశలత నడిగినాఁడు. వెంటనే నా కాశీర్వాదములనుగూడ పంపినాఁడు' అను సంగతిని వినఁగానే మహారాజత్యంత అధీరతను జెంది యిట్లనెను:- "బ్రాహ్మణోత్తమా! నేనా మహామునికి చాల అపకారమును జేసినాను. నేనా తపోధనున కెంతటి యపకారమును జేసితినఁగా నాతఁడు నాకేమి శిక్ష విధించినప్పటికిని అది అల్పమే కాఁగలదు. ఇట్టిదుష్టత నన్ను దుష్టునకే అనుకూలము కావించినది. దీనికాతఁడు కుపితుఁడు కాకపోఁగా, నాకుశలమునడిగి, నాకాశీర్వాదములను బంపినాఁడు. ఈ కార్య మా తపోనిధియు, క్షమాసాగరుఁడగు మహాముని కనుకూపమైనదియే. మహాభాగా! నేనా సమాధినిష్ఠుడగు ముని ధ్యానసమాధికి విఘ్నము కలిగించి, ఆతనిమెడలో నెప్పుడు చచ్చినపామును వైచితినో ఆక్షణముననే నా కుశలము నాశమైపోయినది. ఇంక నాకు కుశలమెక్కడిది? సర్వత్ర అకుశలము అకుశలమే. అయితే యిందొక క్షీణకుశలరేఖ కలదు. అది మహాముని నా కాశీర్వాదములను బంపుటయే. నేనుచేసిన మహాపరాధమునకుఁగూడ ఆతఁడు నా సర్వస్వమును నాశముచేయలేదు."

అంత శిష్యుఁ డిట్లనెను:- "ఒక విషయము చాల చింతింపఁదగినది కలదు. దానికి మహాముని చాల దుఃఖించుచున్నాఁడు. ఆవిషయమును జెప్పుటకే నన్ను ముఖ్యముగఁ బంపియున్నారు. అదేమనఁగా:- మాగురుదేవున కొక కుమారుఁడు పరమతేజస్వి శృంగియను పేరఁ గలఁడు. ఋషికుమారుల వలన నీ వృత్తాంతమును వినఁగానే ఋషి పరోక్షమున మిమ్ముల నత్యంత దారుణముగ శపించినాఁడు."

రాజత్యంతోత్సాహముతో నిట్లడిగెను:-"బ్రాహ్మణ శ్రేష్ఠా! మునిపుత్రుండు నన్నేమని శపించెను? దానిని నేను వినందలంచుచున్నాను."

మునిశిష్యుం డిట్లనెను:-"ప్రభూ! మాగురుకుమారుండు కౌశికీనదీ జలముల స్పర్శించి నేటి కేడవదినమున నీవు తక్షక సర్పదష్టుండవు కాంగలవని భీషణ శాపము నొసంగెను. ఇదివిని ముని తన తనయుని పైం గనలి యాతనిని చాల మందలించెను."

మహారాజత్యంతానందమును బ్రకటించుచు శీఘ్రముగ నిట్లనెను:- "మంచిది. ఇదియా శాపము? తక్షకుండు నన్నొక్కనినే కాటువేయంగలడు. అదియు నీనాండు కాదు, ఏడవ దినమున. బ్రాహ్మణోత్తమా! ఇది శాపముకాదు, ముని తనయుని వరప్రదానము. నేను రాజకార్యములం దధికముగ నాసక్తుండనైతిని. జీవితమునకు ముఖ్యధ్యేయమగు శ్రీకృష్ణ చింతనమును మఱచితిని. ఋషికుమారుం డేడుదినములు గడువు నొసంగి నన్ను దానికి సన్నద్ధమగునట్లు చేసినాడు. ఇక నే నీ వ్యాపారము నంతను త్యజించి శ్రీకృష్ణ చరణాంభోజముల నాశ్రయించెదను."

శమీకముని శిష్యుం డిట్లనెను:- "రాజా! నా గురు విట్లు తెలిపిచ్చినారు. 'మీరు ధర్మాత్ములరు. నా పుత్రుని దోషమునకుండ ఏమియును లేదు. భవితవ్య మిట్లున్నదికదాయని నేను సమాధిద్వారా తెలిసికొంటిని. అదృష్టమును, దైవమును అనంగాం బ్రారబ్ధము నన్యథా చేయుట కెవరికిని శక్తి లేదు. అయినను మిమ్ములను సర్పము కాటువేసినను దుర్గతి

కలుగఁజాలదు. మీరు భగవానుని పరమధామమును బొందఁ గలరు. మహారాజా! నీకు కల్యాణము కలుగుఁగాక!' యనున్న గురుదేవులవారు త్వరగా తిరిగిరమ్మనిరి. నేనిక వెళ్లుచున్నాను."

మహారా జత్యంత వినీతభావముతో మునిశిష్యుని పాదములను బట్టుకొని, యాతనిని బూజించెను. మహామునియగు శమీకుని యొక్కయు, తేజస్వియగు నాతని కుమారుఁడగు శృంగియొక్కయు కుశలసమాచారమును దెలుపవలసినదని ప్రార్థించెను. ఈవిధముగ రాజసత్కృతుడై శమీకమహాముని శిష్యుడు తన యాశ్రమునకు వెడలి, సమస్తసమాచారమును గురుదేవునకు నివేదించెను.

ఇచ్చట పరీక్షిన్మహారాజు తిరిగివచ్చి యంతఃపురమునకు బోలేదు. ద్వారమున నిలిచియే తన పుత్రుఁడగు జనమేజయుని బిలిచి, వాని శిరస్సునఁ గిరీటమునుంచి, వృద్ధబ్రాహ్మణుల కాతని నొప్పఁజెప్పి, కాలినడకతో నాతఁడు గంగాతీరమునకుఁ బోయెను. మంత్రి పురోహితామాత్యులు చాల బలవంతము చేసిరి. అనేకవిధములగు గజ, తురగ, రథ, పాలంక్యాది వాహనము లున్నప్పటికిని, ఆ వాహనములను విసర్జించియే భగవతీ భాగీరథీతీరమునకుఁ బోవుటను గాంచి నగరములోని స్త్రీ పురుషులును, రాజ్యములోనివారందఱును, సమస్త వర్ణములవారును, ఆశ్రమములవారును రోదనము చేయుచు మహారాజు వెంట బయలుదేరిరి. ఆతఁ డెవరివైపును జూడకయు, నెవరివాక్యములను వినకయు, సమస్తవిషయములందు విరక్తి జెంది, నందనందనుఁడగు శ్యామసుందర పదారవిందములందే తన మనస్సును జోడించి సాంసారికసంబంధములన్నిటిని వీడెను.

ఈ విధముగ సాతఁ దేమియును దినకయుఁ, త్రాగకయు మహారాజు హస్తినాపుర సమీపమున నున్న గంగాతీరమున నొక వృక్షముక్రిందకు వెడలి కూర్చుండెను.

ఛప్పయ

సునో శిష్య ఆగమన నృపతి తహఁ తురతహిఁ ఆయే।
భూపనిరఖి భయభీత శిష్యనే వచన సునాయే॥
రాజన్ ఋషి సుత శాప దయో సో సబ సునలీజే।
సాత్ దినా మహఁ హోహి ముక్తికో కారజ కీజే॥
సునీ శాపకీ బాత్ నృప, సౌఁపి సుతహిఁ సబ రాజ ధన।
కృష్ణచరణ మహఁ చిత్తదే చలే గంగ తటముదిత మన॥

అర్థము.

మునిశిష్యులు వచ్చిన వర్తమానమును విని యవనీపతి వెంటనే వచ్చెను. భూపతి భయభీతుడై యుండుటను గాంచి శిష్యులిట్లనిరి:- ''రాజా! ఋషికుమారుఁడు శాప మొసంగెను. దానినంతయు వినుఁడు. నీవేడురోజులలో మరణింతువు కావున ముక్తిమార్గమును జూచుకొనుము.'' ఈ శాపవృత్తాంతమంత యును విని యవనీపతి తన రాజ్య, ధనాదుల నన్నిటిని తన సుతున కొప్పగించి, చిత్తములను శ్రీకృష్ణునం దాయత్తము కావించి మోదంబున గంగాతటంబున కరిగెను.



# గంగాతటమున పరీక్షిన్మహారాజు

## ౧౧

శ్లో॥ అథో విహాయేమాం మమ ముంచ లోకమ్,
విమర్శితో హేయతయా పురస్తాత్ ।
కృష్ణాంఘ్రి సేవామధిమన్యమాన,
ఉపావిశత్ ప్రాయమమర్త్య నద్యామ్॥
— శ్రీభాగ. ౧ స్కం. ౧౯ అ. ౫ శ్లో.

వ.........తక్షకవ్యాళ విషానల జ్వాలాజాలంబునం దనకు సప్తమదినంబున మరణంబని యెఱింగినవాఁడు గావున భూపాలుండు భూలోక స్వర్గలోక భోగంబులు హేయంబులని తలంచి రాజ్యంబు విసర్జించి నిరశనవ్రత దీక్షాచరణంబు సంకల్పించుకొని.

మ॥ తులసీ సంయుత దైత్యజిత్పద రజస్తోమంబుకంటెన్ మహో
జ్జ్వలమై దిక్పతి సంఘసంయుత జగత్సౌభాగ్య సంపాదియై
కలిదోషావలి నెల్లఁ బాపెడి వియద్గంగా ప్రవాహంబులో
పలికిం బోయి మరిష్యమాణుఁడగుచుం బ్రాయోపవేశంబునన్

క॥ చిత్తము గోవింద పదా
యత్తముఁ గావించి మానియై తనలో నే
తత్తరము లేక భూవర
సత్తముఁడు వసించె ముక్తసంగత్వమునన్.
— శ్రీమదాంధ్ర భాగవతము.

ఛప్పయ.

కమల బస్సై జల మాహిఁ కింతు నిరలేప రహేఁ నిత।
త్యోఁహి నృప సబ కరత రహేఁ కారజ రఖి హరి చిత॥
శాపిత సురసరి తీర చలే సుని సబ ఈ ధాయే।
ఋషి ముని త్యాగీ సంత విరాగీ తపసీ ఆయే॥
ముని న మాఁహి సురపతి లస్సై, శ్రీపృథు సోఁహే సత్రమహఁ।
త్యోఁ సంతని తేఁ ఘి రే నృప, అతిశయ శోభిత హోయఁ తహఁ॥

అర్థము.

తామరాకున నీరంటునట్లు నృపతి నిర్లేపుఁడై మనస్సంతయు మాధవునిపై నిలిపి సమస్తకార్యము లొనర్చుచుండెను. రాజు శపితుఁడై గంగాతీరమునకు వచ్చినాఁడను సంగతిని దెలిసికొని సమస్తఋషులు, మునులు, త్యాగులు, యోగులు, విరాగులు, సాధువులు, తపస్వులు వచ్చిరి. ఆతఁడప్పుడు మునుల మధ్యనున్న సురపతివలెను, సత్రయాగమునఁ బృథు చక్రవర్తివలెను నతిశయముగ శోభించెను.

---

ప్రజ్వలితాగ్ని బాగుగా మండిమండి, మంట తగ్గఁగానే దానిమీఁద నుసి పేరుకొనును. అప్పుడు లోపల అగ్ని వెలుఁగుచునే యుండును గాని, పైకి అది ఆరిపోయినట్లు తోఁచును. దానిని మరల నూదఁగానే ఆ యగ్నిపైనున్న నుసి లేచిపోయి, రాజవేయుటచే మరల నగ్ని ప్రజ్వలించును. అట్లే పరీక్షిన్మహారాజు విషయమునఁ గూడ వర్తించుచున్నది. పరీక్షిత్తు మొదటినుండియు వైరాగ్యవంతుఁడు. ఆతనికి సాంసారిక

భోగములు సుఖకరములుగఁ దోఁచుటలేదు. కా
బుద్ధిచే నాతఁడు రాజకార్యము లొనర్చుచుండు
నరపతులవలె సంసారాసక్తుఁడుగఁ గనఁబడుచుండె
డేడవదినమున తక్షకవ్యాళవిషానలమున మరణించ
తిని వినఁగానే, ప్రాత పాత్రకు చిలుముపట్టఁగా దాఁ
వేసి తోమిన నెట్లు మరల మెఱయునో అట్లే ఆతఁ
మును ప్రకాశించుచుండెను. ఆతని కిప్పుడు సంసా
నసారముగఁ దోఁచుచుండెను. బాగుగా నమలని
ర్యము రానేరాదు. వీణ చెవులను మెలిపెట్టి బి
విశుద్ధరాగ ముత్పన్నము కాదు. పేరుకొనిన నేతికి నె
గాని అది కరగదు. చందనమును బాగుగ నఱుగ
పూర్ణముగ సుగంధము నీయదు. సువర్ణమును
గాల్చినంతవఱకు అది ప్రకాశింపదు. రత్నమును న
గాని అది ఉజ్జ్వలముగఁ ప్రకాశింపదు. మృదంగమ
కొట్టి శ్రుతిచేసినఁగాని అది విశుద్ధ తాళ శబ్దము నీ
అదేవిధముగ నెవఁడైనఁ బెద్ద దెబ్బ తినినఁగాని అని
క్షణభంగురములగు విషయములందు సర్వదా
వైరాగ్యము కలుగదు.

ఇప్పుడిక మృత్యువాసన్నమైనదని తెలిసికొఁ
న్మహారాజా సమయమున సర్వస్వమును త్యాగమ
వియదాపగయగు గంగాశరణమును బొంది, దానితట
బోయి కూర్చుండెను. ఆహా! ఈ జగజ్జనని అందఱ
న్యామే. అందఱ కాశ్రయమొసంగునదియే. త్రివిక్ర
శ్రీహరి భక్తశ్రేష్ఠుఁడగు బలిని మోసముచేసినప్పుడు

పాదమున సప్తలోకములను గొల్వఁగల నాతని చరణారవిం
ములు బ్రహ్మలోకమును జేరెను. బ్రహ్మదేవుఁడా విశ్వః
దిత పాదపద్మములను భక్తితోఁ బూజించెను. అర్ఘ్య
పాద్యాచమనాదులను సమర్పించి, దానియందు లేతగానున
పచ్చని పూవవెన్నుల తులసీదళములను వేసెను. ఏ బృంద
దేని దర్శనముచే సమస్తపాపములు నాశనమగునో, దే
దివ్యగంధము సమస్త అశుభములను బోగొట్ట సమర్థమైనదో
ఏది వాసుదేవ భగవానునకుఁ బ్రియమైనదో, ఏది యాతః
అభిన్నహృదయమో, తనసౌభాగ్యమదమున నెవతె యాత
నెత్తిపైకెక్కునో, అట్టి తులసీదళములచే లోకపితామహుడఁ
బ్రహ్మ యాతని యరుణచరణములను గప్పివేయున
పూజించి, తన కమండులోదకముచే నాతని పాదములను గ
గెను. ఆదివ్య పాదోదకమే పతితపావనియు, త్రైలోక్యవం
తయు నగు గంగాస్రవంతి రూపమునఁ బ్రకటమై త్రిలోకవ
లందు వ్యాపించెను. అట్టి శ్రీకృష్ణచరణచ్యుత సలిలమహిః
నెవరు వర్ణింపఁగలుగుదురు? మొదట నాజలము బ్రహ్మాం
కటాహమును భేదించుకొని వచ్చినది. ఆపైన దానిని బ్రహ
తన కమండులువునందు ధరించెను. ఆమీఁదట దానిచే
త్రైలోక్యపూజితములగు ప్రభుపాదపద్మములు కడుగఁబడినవి
అంత హరిప్రియ నగు తులసీయొక్క పవిత్ర రేణువులందులో
గలిసినవి. అదియునుగాక ప్రభు పాదపద్మ పరమపరాగము
నాజలము సంసర్గము చెందినది. ఆ కారణమున సమస్తలో
పాలురు తాము పావనులగుట కా జలములందు మునిఁగి
క్షీరసముద్ర మథనమున హాలాహల ముత్పన్నముకాఁగా

దానిని శివుఁడు త్రాగుటచే నాయనకు వేడియెక్కువయ్యెను. ఆవేడిని బోగొట్టుకొనుటకా శివుని కింతకంటె వేఱుపాయము తోఁచలేదు. ఆతఁడు ప్రబలవేగముగల త్రిపథగామినియగు గంగను తనజటాజూటమందు ధరించెను. అందువలన నాతఁడు గంగాధరుఁడను ప్రసిద్ధినివడసెను. ఏ గంగ మూడునదులై మూఁడులోకములను బావనముగావించెనో అట్టి పరమ పవిత్రయు, జగజ్జననియునగు గంగను, తాను పవిత్రము కావలె ననుకొను నేమూర్ఖుఁడు సేవింపఁడు? మునులారా! మీరు గంగాజలమును సాధారణ జలమనుకొనకుఁడు. గంగను భగవద్విగ్రహమునకు వేఱుగఁదలఁపకుఁడు. శ్రీకృష్ణుఁడు, గంగ వీరిద్ద ఱభిన్నవిగ్రహులు. ఇది నాస్తికులకును, అశ్రద్ధాళువులకును జలరూపమునఁ గనఁబడును. వాస్తవముగ నిది బ్రహ్మద్రవము. అధికోష్ణముచే బంగారుకఱఁగి ద్రవమైనట్లును, వేడిమిచే వెన్నకఱఁగి నీరైనట్లును, పరాత్పరుఁడగు పరబ్రహ్మయొకానొక కారణమున జలమయ్యెను.

సూతుని యీవాక్యములను విని శౌనకుఁ డిట్లనియెను:- "మహాభాగుఁడవగు నోసూతా! నీవు చాల యద్భుత విషయమును జెప్పితివి. ఇప్పటివఱకు మేము గంగను విష్ణుపాదాబ్జ సంభూతయనియే తలఁచుచుంటిమి. ఇది కఱఁగిన బ్రహ్మవిగ్రహమని చెప్పుచున్నావు. ఇది యెట్లు? బ్రహ్మ జలరూపమున నేల ప్రవహించెను? మాయీసందేహమునకు సమాధానమొసంగి తర్వాత విషయమునకుఁ బోవలయును."

సూతుఁడు శౌనకుని యీప్రశ్నను విని గద్గదికుఁడై, కన్నుల నశ్రువులను గార్చుచుండెను. ఆతని హృదయము

నుండి గంగా యమునలు రెండును కన్నులద్వారా ప్రవహించుచున్నట్లుండెను. ఆతని శరీరమంతయు రోమాంచమయ్యెను. నయనాశ్రువులను దుడిచికొని, ఆచమించి సూతుండిట్లనెను:- "మహాభాగా! నీవు చాల మంచిప్రశ్న వేసితివి. ఈకథ మిక్కిలి రసమయమైనది. భగవద్గుణములందెంతటి సౌందర్యము కలదో మీరీ కథాశ్రవణముచేఁ దెలిసికొనఁగలుగుదురు. నేను చెప్పుకథలో భగవంతుని లోకైక్యవిమోహాన కథారసమహత్వ మెంతగలదో తెలియఁగలదు. మంచిది, ఇఁక మీరందఱు వినుఁడు.

ఒకానొక దినమున వైకుంఠధామములో భగవానుఁడు విరాజిల్లుచుండెను. గొప్పగొప్ప విష్ణుభక్తులును, పార్షదులును ఆతనికి పరిచర్యనుచేచుండిరి. చాలమంది ఋషులు, మునులు, సిద్ధులు, గంధర్వులు, దేవగణము భగవానుని సభలో నుండిరి. శంకరుఁడు, బ్రహ్మ, ఇతర ప్రధాన దేవతలు, లోకపాలురును అచ్చటఉండిరి. ఇంతలో వీణనువాయించుచు, హరిగుణగానము చేయుచు, ప్రాణిమాత్రులను తన వీణా ఝుంకారముచేఁ దన్మయులఁజేయుచు దేవర్షియగు నారదుఁడచ్చటకు వచ్చెను. నారదుని గాంచి సభాసదులందఱును బ్రహానందమును జెందిరి. అందఱు నాతని నభినందించిరి. ఆతఁడును బ్రహ్మవిష్ణు మహేశ్వరులు ముగ్గురకుఁ బ్రణామము కావించి, అందఱకును యథోచిత సత్కారములను గావించి భగవానుఁడు నియమించిన యాసనమునఁ గూర్చుండెను. ఇంతటి గొప్పసభను గాంచి నారదుఁడానందము చెందెను. అంతవఱకు గానము చేయుచుండిన గంధర్వులు తమ

గానము నాపి నారదుని పాడుమని బలవంతము చేసిరి. నారదుఁడు కొంచెముగ సంకోచించుటను గాంచి భగవానుఁడు నవ్వుచు నిట్లనెను:- "నారదా! కొంచెముగ పాడుము. నీవే తన్మయమగునట్లు నాగుణగానమును జేయఁగలవాఁడవు." భగవానుని ప్రశంసావాక్యములు వినునప్పటికి నారదుని యానందమునకు మేఱలేకపోయెను. హర్షముచే నారదుని హృదయము పొంగిపోయెను. హృదయ తంత్రులు తమంతటఁ దామే ఝుంకారము చేయ మొదలిడెను. సర్వబ్రహ్మవిభూషితయగు తనవీణను మీటి అత్యంతాహ్లాదముగ తన్మయుఁడై యాతఁడు పాడ మొదలిడెను. ఆ దినమున సభయంతయుఁ జిత్రలిఖిత ప్రతిమలవలె స్తబ్ధులగునట్లు సర్వము, రాగము బయలు వెడలెను. భగవానుఁడుకూడ స్తబ్ధుఁడయ్యెను. ఆతఁడు ప్రత్యంగమునఁ జేష్టలు తప్పియుండెను. ఆతని శ్రీవిగ్రహము కఱగిపోవునంతగ భగవంతుఁడు తన గుణశ్రవణమునకు హర్షముచే తల్లీనుఁడయ్యెను. ప్రక్కన గూర్చుండిన బ్రహ్మకు కొంచెము తెలివి కలదు ఆ కారణమున నా కఱగిన బ్రహ్మద్రవమును దన కమండులువులోనికిఁ గొంచెముగఁ బట్టుకొనెను. ఈ విధముగ హరి తన గుణ, యశఃకీర్తనమును వినుటచే ద్రవీభూతుఁడయ్యెను. తర్వాత కాలాంతరమున భగవత్పాదపద్మములు బ్రహ్మలోకమునకు రాఁగా ప్రేమవ్యగ్రతలో బ్రహ్మ సమస్తమును మఱచెను. అ కమండులువు జలముచే శీఘ్రముగ భగవచ్చరణారవిందములను ప్రక్షాళనము కావించెను. అక్కడనుండి యా సురాపగ మూఁడు నమలై ప్రవహించెను. ఒకటి పాతాళమున భోగవతీ యను

పేరఁ బ్రసిద్ధిఁ జెందెను. స్వర్గమున దేవసరితయనియు, భూమి యందు అలకనందయనియుఁ బ్రసిద్ధిచెందెను. దానిలోని ఒక ప్రవాహమును భగీరథుఁడు తెచ్చుటచే దానికి భాగీరథియను పేరు కలిగెను. జహ్నుమహర్షి దీనిని పుత్రికగా స్వీకరించెను గావున దీనికి జాహ్నవి యనియుఁ బేరు కలిగెను. కావున నీ గంగ జగద్వంద్యగను, పరమపావనిగను ప్రసిద్ధి వడసెను. సమస్తఋషులును, మునులును, పరమార్థ పథ పథికులును దీని నాశ్రయింతురు. అందఱు దీని శరణమునకుఁ బోవుదురు. చివరకు దీనినే పొంది ముక్తులగుదురు. పరీక్షిన్మహారాజుకూడ దీని తటముననే కూర్చుండి తన జీవితములోని చివర ఏడు రోజులు ఆహారపానీయములనువీడి గడుపనిశ్చయించుకొనెను.

పరీక్షిన్మహారాజు చక్రవర్తిగానున్నంతవరకు ఋషులు, మునులు కలిదోష కారణమున నీ ధరాధామమును వదలి పోలేదు. ఇచ్చట శరీరములతోడనే యుండెను. మహారాజు రాజ్యమును త్యజించినాఁడనియు, విప్రశాపముచే నేడు దిన ములలో మరణింపఁగలఁడనియు, విషధర నాగరాజగు తక్షకుఁ డాతనికి గాటు వేయుఁగలఁడనియు, సమస్తరాజ్యమున వ్యాపించెను. ధర్మాత్ముండగు పరీక్షిన్మహారాజు ఈప్రపంచమును వదలిపోఁగానే సర్వత్ర కలి సామ్రాజ్యము వ్యాపింపఁగలదు. అప్పు డాతఁడు తన యిష్టము వచ్చినట్లు అన్యాయము, పత్యాచార మొనరింపఁ గలఁడు ఈ సమయమున నేసాధనచే సాధుపురుషులు తమ కాలమును గడుపఁగలరు? అందఱు పాపులగుటచేఁ బృథ్వి ఒక దినమైనను నిలువఁ జాలదు. కలి కుకృత్యములచే ధర్మాత్ములు ఆశ్రయ మేమి

యును లేక భూమిమీద నుండజాలరు కావున నీయేడు దినములలో సమస్తఋషులును, మహర్షులును గలిసి యేదైన సరళ, సుగమ, సర్వోపరి, సర్వోత్కృష్టసాధనమును స్థిరము కావించి, దానిని సర్వసాధారణులకు నెఱుకపరుపవలయును - అని యిట్లు త్రికాలజ్ఞులగు మునులాలోచించుకొని, సమాధి ద్వారా సమస్తసమాచారమును దెలిసికొని, సమస్తదిక్కుల నుండి గుంపులు గుంపులుగ ఋషులు, మహర్షులు, హస్తినాపురసమీపమున ఆనందతటమను స్థానమునఁ బరీక్షిన్మహారాజు పయోపవాసవ్రతమును బట్టి కూర్చుండిన చోటకు వచ్చిరి. సాధువులు సదా సంసారసంతాప సంతప్త జీవులకు మేలుచేయవలయుననియే యీ లోకమున భ్రమణము చేయు చుందురు, అయితే మేము జగదుద్ధారము కొఱకును, విశ్వకల్యాణము కొఱకును దిరుగుచున్నామని చెప్పరు. అడిగినచో మేము తీర్థయాత్రలు చేయఁబోవుచున్నామని చెప్పుచుందురు. శౌనకా! సమస్త తీర్థస్వామియగు శ్రీహరిని దమ హృదయములలో నిల్పుకొనినవానిని తీర్థము లేమంత పవిత్రము చేయఁ గలవో నీవే యాలోచించుము. తీర్థయాత్రాది పుణ్యకార్యములతో వారికేమిపని? కాని వారిమిషతో తీర్థములను బవిత్రము చేయుచుఁ దిరుగుచుందురు. వారు స్నానముచేసి తీర్థములలోని పాపములను పోగొట్టుచుందురు. ఈ విధముగ మునిగణము కొందఱు గంగాస్నానమను మిషచేతను, కొందఱు హరిద్వారము, బదరీనారాయణాది తీర్థములకుఁ బోవలెనను మిషచేతను గంగాతటమునకు వచ్చిరి. చాలమంది ఒంటరిగానే వచ్చిరి. కొందఱు శిష్యప్రశిష్యులతోడను, పుత్రపౌత్రులతోడనువచ్చిరి.

కొందఱు కౌపీనధారులు. కొందఱు వల్కలధారులు. చాల మంది బోడులు. కొందఱు జడలు ధరించిరి. కొందఱు మౌనులు. కొందఱు దిగంబరులు. కొందఱే భక్తులు. కొందఱు ఫలాహారులు. కొందఱు క్షీరాహారులు. కొందఱు జలాహారులు. కొందఱు నిరాహారులు. కొందఱు వాయుభక్షణ చేసి జీవింతురు. కొందఱు జ్ఞాననిష్ఠులు. కొందఱు భక్తినిష్ఠ గల భాగవతులు. కొందరు తమ అగ్నిహోత్రమును దమ వెంటఁ గైకొని వచ్చిన కర్మనిష్ఠులు. ఈవిధముగ నానాదేశములనుండి వివిధాచార విచారములు, వివిధ వేషభూషలు, వివిధ రకములగు ఋషులు, మునులు, సాధువులు, సజ్జనులు అందఱు నా స్థానమునకు వచ్చి చేరుకొనిరి. వారిలోఁ బ్రధానులగువారి పేరు లివి:- అత్రి, వశిష్ఠుఁడు, చ్యవనుఁడు, శరద్వంతుఁడు, అరిష్ఠనేమి, భృగువు, అంగిరుఁడు, పరాశరుఁడు, విశ్వామిత్రుఁడు, పరశురాముఁడు, ఉతథ్యుఁడు, ఇంద్రప్రమదుఁడు, ఇధ్మవాహుఁడు, మేధాతిథి, దేవలుఁడు, ఆర్ష్టిషేణుఁడు, భరద్వాజుడు, గౌతముఁడు, పిప్పలాదుఁడు, మైత్రేయుఁడు, ఔర్వుఁడు, కవషుఁడు, అగస్త్యుఁడు, వ్యాసభగవానుఁడు, నారదుఁడు, అరుణుఁడు ఇంక ననేకులగు దేవర్షులు, రాజర్షులు, మహర్షులు, బ్రహ్మర్షులు, త్యాగులు, తపస్వులు, విరాగులగు మహాత్ములెందఱో అచ్చటికి చేరుకొనిరి.

మహాత్ములందఱు తన స్థానమునకు వచ్చుటను గాంచగానే మహారాజులవారి యానందమునకు మేర లేకుండెను. వీరందఱు జగద్వంద్యులు, మహాపురుషులు. అంత్యకాలమున

నాకు దర్శనమిచ్చుటకు వారు స్వయముగ విచ్చేసిరి. ఇది నాకెంతటి సౌభాగ్యకరమగు విషయము!

ఇట్లాలోచించుకొనఁగానే మహారాజు హృదయము గద్గదికమాయెను. ఆతని శరీరమంతయు రోమాంచమయ్యెను. చేతులు జోడించుకొని మహారాజులేచి ఋషులకును, మునులకును సత్కారమును గావించి, అర్ఘ్యపాద్యాదులతో వారి కందఱకును యథోచిత పూజలు కావించెను.''

ఛప్పయ

మాఘ మకర కే మధ్య మనుజ మాధవ జ్యోఁ ధావేఁ।
త్యోఁ సబ దిశి తేఁ సభీసంత గంగాతట ఆవేఁ॥
ఉఠే అర్ఘ్య దేఁ నృపతి యోగ్య ఆసనబైఠావేఁ।
చరణ ధూరి ధరి శీశ వినయ తేఁ వచన సునావేఁ॥
పాపకర్మ కరి క్రూర అతి, విప్ర శాప శాపిత భయో।
కింతు సంత దరసనని తేఁ, ధన్య ఆజ హౌఁ హ్వైగయో॥

అర్థము

మాఘ మకరమాసముల మధ్య మానవులు వేణీ మాధవునికడ కెట్లు పరువిడి వచ్చుచుందురో అట్లే సమస్త దిక్కులనుండియు సాధువులందఱును గంగాతటమునకుఁ బరువిడి వచ్చిరి. వారురాఁగానే వసుధాధిపతి యర్ఘ్యమిచ్చి యోగ్యాసనములమీఁదఁ గూర్చుండఁజేసి, చరణరజమును శిరమున ధరించి వినయవాక్కులతో నిట్లనెను:- ''మునులారా! నేనతి పాపకర్మను క్రూరుఁడనై యొనర్చి విప్రశాపమును బొందితిని; కాని నేఁడు సాధుదర్శనముచే ధన్యుఁడనైతిని.''

# పరీక్షిత్తుని పారమార్థిక ప్రశ్న

౮ ౨

శ్లో॥ తతశ్చ వః పృచ్ఛ్య మిమం విపృచ్ఛే,
విశ్రభ్య విప్రా ఇతికృత్యతాయామ్।
సర్వాత్మనా మ్రియమాణైశ్చ కృత్యమ్,
శుద్ధం చ తత్రామృశతాభియుక్తాః॥
—శ్రీభాగ. ౧స్కం. ౧౯ అ.౨౪శ్లో.

క॥ ఏడు దినంబుల ముక్తిం
గూడఁగ నేరీతి వచ్చు గురుసంసార
క్రీడన మేక్రియ నెడతెగుఁ
జూడుఁడు మాతండ్రులార శ్రుతివచనములన్॥

శా॥ ప్రాప్తానందులు బ్రహ్మబోధనకళా పారీణు లాత్మప్రభా
లుప్తాజ్ఞాన మహాంధకారులు దయాళుద్వ్యాభిరాముల్ మనో
గుప్తంబుల్ సకలార్థజాలములు మీకుం గానవచ్చుంగదా
సప్తాహంబుల ముక్తి కేగెడు గతిం జర్చించి భాషింపరే.
—శ్రీమదాంధ్రభాగవతము.

ఛ ప్ప య.

బారబార సిర నాఇ నృపతి బోలేయోఁ సబతేఁ।
కర్యో అకారజ కాజ చిత్త చంచల మమ తబతేఁ॥
మూర్తిమాన హైఁ వేద ఆప ఋష-ముని తనుధారీ।
దర్శన దేకేఁ సపది విపతి చింతా మమ టారీ॥
ముని ప్రేరిత అహి డస్సైభల, శుభ కర్తవ్య బతాఇ దేఁ।
భ్రమ భయ భేద మిటాఇ దేఁ కృష్ణకథా సునవాయి దేఁ॥

అ ర్థ ము

పరీక్షిన్మహారాజు వారందఱకును మాటిమాటికి నమస్కారములు చేయుచు నిట్లనెను:- 'నే నప్పుడు చంచల చిత్తుఁడ నగుటచే నకార్యము నొనర్చితిని. మీరు మూర్తిమంతములగు వేదములు, ఋషి - ముని తనువుల ధరించితిరి. మీరు నా కిప్పుడు దర్శన మొసంగి యాసన్న విపచ్చింతను బోఁగొట్టితిరి.

మునిప్రేరితమున సర్పము కాటువేయుఁగాక! నాకిప్పుడు శుభకర్తవ్యమును బోధింపుఁడు. నాయొక్క భ్రమ భయ ఖేదములను బోఁగొట్టుఁడు, శ్రీకృష్ణకథను వినిపింపుఁడు.'



మనయెడల హృదయపూర్వకమగు ప్రేమ యెవరి కున్నదో, కపటప్రేమ యెవరి కున్నదో ఆపత్సమయమున బయటపడును. సుఖసంపత్తులున్న సమయమున సహానుభూతిని జూపువారును, క్షేమను బ్రదర్శించువారును జాలమంది యుందురు. దుఃఖసమయమున వదలక, సుఖసమయమునకంటె దుఃఖసమయముననే మిక్కిలి ప్రేమను బ్రదర్శించువారే నిజమగు ప్రియులు. దుఃఖమున మానవుఁడు దీనుఁడగును. నల్దిశలను సహాయ సానుభూతుల కొఱకు చూచుచుండును. ఆసమయమున నాతనికి ధైర్యమును జెప్పి, రెండుతీపిమాటలు చెప్పి యాశ్వాసించువారమూల్యప్రియులు. దుఃఖితుఁ డిట్టి సమయమున సహాయకుని యెడల నత్యంత కృతజ్ఞతను బ్రకటించును.

పరీక్షిన్మహారాజిట్లు యోజించుకొనెను:- "నావలన ననుచితకార్యము జరిగినది. అకారణముగ నేను బ్రాహ్మణు నవమానించితిని. ఆకారణమున సమస్త బ్రాహ్మణులును, ఋషిమహర్షులును నన్ను నీచునిఁగ, ననార్యునిఁగ, బ్రాహ్మణ ద్వేషిగ భావించి త్యజింతురు. వారు నేఁజేసినపనికి నిందింతురు. నన్ను మాటిమాటికి ఛీ! ఛీ! యని నిందింపగలరు." అని తలఁచి యాతఁడేకాంతమున గంగాతటమునకుఁబోయి కూర్చుండెను; కాని చివరకు దీనికి విపరీతముగ జరిగెను. నల్దిశల నుండి గొప్పగొప్ప ఋషులు, మహర్షులు, తపస్వులు వచ్చి యాతనియెడల సానుభూతిని జూపించిరి. అప్పుడు మహారాజు హృదయము కరిగిపోయెను. దుఃఖముబికెను. ఆతఁడు కృతజ్ఞతాభారమున నణఁగిపోయెను. అందఱకును యథోచిత సత్కారములు కావించి చేతులుజోడించుకొని గద్గదకంఠముతోఁ బరీక్షిన్మహారాజిట్లనెను:- "మహర్షులారా! నన్నుఁ బ్రజలు రాజరాజేశ్వరుఁడు, చక్రవర్తి, మహారాజాధిరాజు, ఇంక నెన్నియోవిధములఁ బిలుచుఁగాక! ఆ శిష్టాచారసంబంధ సంబోధనలచే నాకిసుమంతైన నానందము గలుగుటలేదు. ఏల ననఁగా నాశ్రితులు, స్వార్థులు, సర్వదా అతిశయముగఁ బొగడుచుందురు; కాని నేఁడు నేను యథార్థముగ రాజులందరలో శ్రేష్ఠుఁడను. నిందితకార్యము నొనర్చిన యధముఁడనగు నామీఁదఁగూడ యింతటి కృపయుంచుటను స్మరించిన నాశరీరము పులకరించుచున్నది. మరణసమయమున నందఱు నొక్కసారిగా నాకు దేవదుర్లభమగు దర్శనమొసంగితిరి. నేను ధన్యుడనైతిని. కృతకృత్యుఁడనైతిని. నేఁడు నాసమస్త శోక,

మోహ, దుఃఖ, నిర్వేద, సంతాపములు నశించినవి. మును లారా! రాజులు చాలగర్వాలుగనుందురు. వారెవరిని లెక్క చేయరు. ఇవియునుగాక రాజై యవివేకియై సదసద్విచార శూన్యుఁడైన నింకఁజెప్పవలసిన దేమున్నది? "చిరుచేదుగల తిప్పతీగె వేఁపచెట్టెక్కిన నెట్లుండును?" అవివేకియగు రాజెల్లప్పుడు నధర్మప్రవృత్తుఁడగును. ఇప్పుడు చూడుఁడు. అవివేకము మూలముననే కదా నాద్వారా యిట్టి పాపకర్మజరిగి ముని తనయునిచే శాపగ్రస్తుఁడను గావలసివచ్చినది."

ఒకవృద్ధమహర్షి యిట్లనెను:- "రాజా! మేమును ఎవరో చెప్పుకొనుచుండఁగా గాలికబురు వింటిమి; కాని రాజా! మీరు యథార్థమును జెప్పుఁడు, శమీకకుమారుఁ డేల మీకు శాపమొసంగెను?"

మహారాజు మిగుల లజ్జితుఁడై యశ్రువులనురాల్చుచు నిట్లనెను:- "మహర్షులారా! మీకు సర్వజ్ఞులు. అన్నియుఁ దెలిసియే మీరు నామీఁద గృపయుంచి యిచ్చటికివచ్చితిరి. అయినను మీరు నామేలుకొఱకు నాపాపమును నాచేతనే చెప్పింపవలయునని చూచుచున్నారు. ఇది మీసాధుత్వమును దెలుపును. ఏలననఁగా పాపముగాని పుణ్యముగాని స్వయముగఁ జెప్పుకొనుటచే క్షీణించును. నేను వేటకై వనమునకు వెడలితిని. అచ్చటనొక మృగము వెంటఁబడి ఆకలిదప్పులచే వ్యాకులమును జెంది శమీకమహాముని యాశ్రమమునకు వెడలితిని. నేను చాలసారులు మునిని బిలిచితిని. అతఁడు సమాధి మగ్నుఁడై యుండెను. ఆసమయమున నాబుద్ధి భ్రష్టమయ్యెను. ఒక చచ్చినసర్పమును బరీక్షకొఱకు మెడలో వేసి విచారింప

కయే రాజధానికి తిరిగివచ్చితిని. తర్వాతఁ దేజస్వియగు నాతని కుమారుఁడు నన్ను శపించెను:- "ఈ చచ్చినపామే తక్షకుఁడై నేటి కేడవదినమున నీపామును వేసినవానిని గఱచుఁగాక!" అని యిట్లు శపించిన వృత్తాంతమును వినఁగానే నేను సర్వస్వమును త్యజించి యీ గంగాతటమునకు వచ్చితిని. ఇప్పుడు అధర్ముఁడనగు నాకాశ్రయము లేదు. భూదేవోత్తములారా! ఈ గంగమ్మ తల్లియు, మీరును నాకు రక్షకులు. మీయందఱ పాదములను నేను శరణు వేఁడుచున్నాను. మీరు నాపైఁ గృపనుజూపి నన్నుద్ధరింపుఁడు."

అంత నా మునులందఱు సహానుభూతిని జూపించుచు నిట్లనిరి:- "శాపము నొసంగి మునితనయుఁడు చాల చెడ్డపని చేసినాఁడు. ఇంతటి యల్పాపరాధమున కింతటి యనల్ప దండమును ధర్మాత్ముఁడగు రాజున కొసంగినాఁడు. ఇది యుచితము కాదు."

ఇది విని చాల శీఘ్రముగ పరీక్షిన్మహారాజిట్లనెను:- "లేదు, మహాత్ములారా! ఋషిపుత్రుఁడు నాకు చాల యుపకార మొనర్చినాఁడు. ఆతఁడిచ్చినది నాకు శాపము కాదు; వరదానము. ఎంతవఱకు నేను దేహగేహములందాసక్తి చెందియుండెడువాఁడనో, ఎంతవఱకీ రాజ్యరూపమగు పాపపంకమునఁ బడియుండెడువాఁడనో, భగవంతుని మఱచి యెంతవఱకు భోగములలోఁ బడియుండెడువాఁడనో, సాక్షాత్తుగ భగవానుఁడే ఆరూపమున నాకు శాపమొసంగి, నాకు వైరాగ్యోపదేశ మొసంగుటకు వచ్చినట్లున్నది. తామప్పుడే నశించితిమని సాంసారికులు మృత్యువునకు భయపడుదురు.

నేనిప్పుడు మిమ్ములను శరణువేఁడితిని. ఇప్పుడింక నాకు భయ మేమున్నది? మీరందరును గలిసి నాసంగతిని విచారించెదరు. నన్నధోగతికి పోకుండ రక్షింపఁగలరు. సంసార సాగరమున మునిఁగిన నన్నుఁ జేయిపట్టుకొని పైకిలాగి యుద్ధరింపఁగలరు."

మహారాజు పలికిన దీనతాపూర్ణమగు గంభీరవచనములను విని యావృద్ధమహర్షి యందఱితో నాలోచించెను. ఆతఁడందఱ నిట్లడిగెను:- "రాజును దక్షకుఁడు కాటువేయకుండునట్లు మీవద్ద నేమైన యంత్ర, మంత్రౌషధ ప్రయోగములున్న యెడలఁ జెప్పుఁడు."

అంత మహారాజిట్లనెను:- "మునులారా! నేను బ్రదుకఁ గోరుటలేదు. చాలకాలము బ్రదుకుటచే నీయధర్మపూర్ణమగుఁ గలికాలమున లాభమేమి కలదు? నేనిప్పుడు నా చిత్తవృత్తిని సమస్త విషయములనుండి ఉపసంహరించి వాసుదేవ భగవానుని చరణ కమలములందు లగ్నము చేసితిని. ఇప్పుడు నాకు శాపభయమును లేదు, కపట వేషధారియగుఁ దక్షకుని భయమును లేదు. మీరందరు నాకు నందనందనుని దివ్యసుందర సుమధుర కథలను వినిపింపుఁడు. మీరందఱును గలిసి ప్రభుప్రేమ రూపమగు పీయూషమును గ్రోలఁ జేయుఁడు. అనేకజన్మల వఱకు నాయనాది అనంత, అచ్యుతుని చరణ కమలములందు దృఢానురాగము కలుగునట్లు మీరంద రాశీర్వదింపవలయును. ఇంకను నే నేయోనిలో జన్మించినను ఇట్టి పాపము చేయకుండునట్లును, సర్వత్ర నా వాసుదేవుఁడే నిండి యున్నట్లు భావించి, అందఱితోడను, సమస్త జగత్తుతోడను నాకు మైత్రీభావ ముండునట్లును, నెవనిని నాశత్రువుగ నెంచ

కుండునట్లును, క్రోధము వహించి యెవరికి నపకార మొనర్ప కుండునట్లును ఆశీర్వదింపవలెను.''

పరీక్షిత్తుని యీ దృఢతను గాంచి ఋషులును, మునులును జకితులైరి. ఆతఁడు సర్వస్వమును ద్యజించి, పృథ్వీ శాసనభారమును దన పుత్రుఁడగు జనమేజయున కొప్పగించెను. ఆతఁ డుత్తరాభిముఖముగఁ గూర్చుండెను. ఆతని కుశాసనముయొక్క కుశాముఖములు దక్షిణముఖముగానుండక తూర్పుముఖములుగ నుండెను. పితృకార్యములలోఁ దప్ప శుభకార్యములం దెన్నఁడును గుశాముఖములు దక్షిణములుగ నుండరాదు. ఈ విధముగఁ బ్రాయోపవేశవ్రతములో దృఢముగఁ గూర్చుండిన నృపతిని గాంచి యాకాశమున విమానములమీఁదఁ గూర్చుండిన దేవగణము ఆతనిని బ్రశంసించుచుండెను. వారు ధర్మాత్ముఁడును, త్యాగియునగు రాజుమీఁద దేవదుందుభులను బ్రమోగించుచు పారిజాత పుష్పవృష్టిని గురిపించిరి. సమస్త ఋషులు, మునులు, త్యాగులు, తపస్వులు సాధువాదము లొనర్చి చక్రవర్తిని బ్రశంసించిరి. అంద ఱేక కంఠమున నిట్లనిరి;— ''రాజా! నీవు ధన్యుఁడవు. ఇట్టి వచనము నీ కనుకూలమైనదియే.''

ఈవిధముగ నందఱిద్వారా అనుమోదితుఁడై, సత్కృతుఁడైన తర్వాత నా వృద్ధముని అందఱితరపున నిట్లనెను:— ''రాజర్షి శ్రేష్ఠా! ధర్మరాజా! ఈ వచనములు నీ కనురూపములుగనే యున్నవి. ఏలననగా నీ జన్మము పాండవుల వంశములో జరిగినది. ఆ పాండవుల చిత్తవృత్తి పారమార్థికమైన సధర్మముపైపునకు బోదు. వా రెల్లప్పుడును శ్యామసుందర

చరణారవిందముల ననుసరింతురు. ఆతని పదచిహ్నముల నే పరమలక్ష్యముగ గ్రహించి ముందుకు పోవుచుందురు. భగవంతుఁ డెచ్చట కూర్చుండఁబెట్టిన నచ్చట కూర్చుండును. ఎక్కడికి వెళ్లుమనిన నక్కడకు వెళ్లుదురు. ఏ పనిని జేయవలదనునో ఆపనిని మఱచియైనఁ జేసెడువారు కారు. అందుకనియే వారు ప్రాతఃస్మరణీయులు, పుణ్యశ్లోకులైరి. భగవంతుఁడు స్వధామమునకుఁ జేరినాఁడను సంగతిని వారు వినఁగానే రాజ్య సింహాసనమును ద్యజించి ఉత్తరఖండమునకుఁ బోయిరి. వారికి ఉత్తరాధికారివి నీవు. నీవును నీ సర్వస్వమును ద్యజించి శ్రీకృష్ణచరణారవిందములం దేల మనస్సును లగ్నము చేయకుందువు?''

మునులయొక్క యీ సారగర్భిత వచనములను విని పరీక్షిన్మహారాజత్యంత నమ్రుఁడయ్యెను. ఆతఁడు మునులందఱకును శిరస్సాష్టాంగ నమస్కారము కావించెను. ఇప్పుడా మునులందఱు తమలోఁ దా మిట్లనుకొనిరి:- ''చూడుఁ డీ మహారా జెంతటి ధర్మాత్ముఁడో, ఎంతటి నమ్రుఁడో? పొరపాటున జరిగిన యొకానొక యపరాధమున కెంతటి దుఃఖితుఁ డగుచున్నాఁడో చూడుఁడు. ఆ మునిపుత్రుఁడు తన బాలత్వమునే బయటపెట్టెను. ఆతనితండ్రి అతఁడు చేసిన కార్యమును సమర్థింపలేదు సరికదా యింకను మిక్కిలిగఁ జీవాట్లుకూడ పెట్టెను. ఇప్పటికి అయినదేమో అయినది. రాజు మరణము నాఁటి మూలమున జరుగవలెనను విషయమును మేము యోగ దృష్టిచేఁ జూచి కనుగొంటిమి. ఈతఁడు పుట్టినప్పుడే యీ విషయమును జ్యోతిష్కులు చెప్పియుండిరి. ఇప్పుడు మనము

చేయవలసినపని యొకటి యున్నది. ఈ రాజర్షి తన శరీరమును వదలువఱకు మన మిచ్చటనే కూర్చుండవలయును. ఈ ధర్మాత్ము డగు రాజునకు దుర్గతి కలుగనీయరాదు. ఇట్టి ధర్మాత్ముఁడగు రాజునకు శాప మొసంగి, అపమృత్యువుపాలుచేసి నరకము నకుఁ బంపినారను నపకీర్తిని బ్రాహ్మణులకు రానీయఁగూడదు. ఇప్పుడు మనమందఱమును గలిసి యీతనికి ఉద్ధారముకలుగు నుపాయము నాలోచింతము.''

వృద్ధముని వాక్యములను విని సమస్తఋషులు మునులు హర్షముతో నిట్లనిరి:- ''సత్యము, సత్యము. మే మందఱ మేఁడుదినములవఱ కెచ్చటికినిఁ బోము. ఈ రాజర్షితో సాను భూతిని బ్రకటించుచు నిక్కడనే యుండెదము.''

మాయామోహమునకు దూరముగనుండు ఋషు లిట్లు సహానుభూతినిజూపించు వచనములు పలుకఁగా విని మహారాజు అధీరుఁడై కన్నుల బాష్పములను గార్చెను. త్యాగులు, విరాగులగు ఋషులయొక్క అమృతోపమానములును, పక్షు పాతశూన్యములును, గంభీరములును, ఛలకపటరహిత వచన ములను విని కృతజ్ఞతాభారముచే నతమస్తకుఁడై పరీక్షి న్మహారా జిట్లనెను:- ''మునులారా! నే నేశబ్దములతోఁ గృతజ్ఞతను బ్రకటింపఁగలను? నా మనోగతభావముల నేమి పలికి వ్యక్తీకరింపఁగలను? నేను మీవిషయమున నేమి చెప్పి నను అది న్యూనముగానే యుండును. అది మీకు సమ్మానము కాక యవమానముగానే యుండును. ఈ ప్రాకృతమానవుని వాక్కు ప్రాకృతవిషయములను మాత్రమే వ్యక్తము చేయఁ గలదు. ఈ లోకములోని పదార్థములనే వ్యక్తపఱుపఁగలదు.

మీ రీలోకములోని జీవులు కారు. మీరందఱు సత్యలోకము నుండి దిగివచ్చినవారు. మీరు భోగములకొఱకు భూమిపై నవతరింపలేదు. లోకానుగ్రహము నిమిత్తమై, కేవలము దయావశముననే మీరు మీ యీ మానుష దేహమును ధరించితిరి. పరోపకారము చేయుటే మీకు స్వభావము. దయ చూపింపక మీ రుండఁజాలరు. ఆ దయకు వశీభూతులరై మీరు యధముఁడను, నీచుఁడను నైన నామీఁద నహైతుక కృప చూపినారు. మీ కందఱకును గల జ్ఞానవిజ్ఞానములకు అంతులేదు. మీ యందఱ జ్ఞానము అగాధము. సాక్షాత్తుగ వేదము లనేకరూపములను ధరియించి యిక్కడికి వచ్చిన ట్లున్నది. మీకందఱకు నామీఁద నింత కృప యున్నప్పుడు నేను మిమ్ముల నొక ప్రశ్న నడుగఁదలఁచినాను. మీయందఱ ఆజ్ఞ యగునెడల నేను మిమ్ములను బ్రశ్నించెదను.''

ఇది విని యావృద్ధముని యిట్లనెను:- ''రాజా! నీవు నిర్భయముగ, నిస్సంకోచముగఁ బ్రశ్నింపవచ్చును. మేమందఱము మాకు తోఁచిన సమాధాన మొసంగెదము.''

మహారాజిట్లనెను:- ''మునులారా! నేనడుగఁదలఁచుకొనినది ఒకటి సామాన్యప్రశ్న, రెండవది విశేషప్రశ్న. మీరు సర్వశాస్త్రార్థ విశారదులు. మీరందఱును గలిసి చేసిన నిర్ణయము నాకేకాదు సమస్త ప్రాణికోటికి ఉపకరించునని నాపూర్ణ విశ్వాసము. నా సామాన్యప్రశ్న యేమనఁగా మీ రందఱును గలిసి సర్వశ్రేష్ఠమును, సుందరమును, సుగమము నగు సాధనమును సర్వజీవులకును, సర్వావస్థలందును సర్వదా చేయుటకు వీలైనదానిని జెప్పవలయును. దేని నొనర్చుటచే

ఆత్యంతిక కల్యాణము ప్రాప్తింపఁగలదు? ఇఁక నా రెండవ విశేషప్రశ్న యేమనఁగా మృత్యువాసన్నమైనవాఁ డేకర్మము నుఁ జేయవలయును?''

అంత నామును లిట్లనిరి:- "రాజా! సర్వదా శుభకర్మలే చేయవలయు ననియు, నశుభకర్మలు చేయరాదను సంగతి అందఱకును దెలిసినదే."

మహారాజు తన మాటమీఁదనే నిలిచి యిట్లనెను:- "సర్వశ్రేష్ఠమగు శుభకర్మ యేదియో నేను దెలియఁగోరుచున్నాను. శుభకర్మలకు నిశ్చిత సంఖ్యలేదు. ఒకానొక సమయములో శుభకర్మగా నున్నదియే దేశకాల పాత్రావస్థ భేదములను బట్టి అశుభకర్మగ నగును. ఒక్కొక్కకర్మ ఒకచోట విహితమైనది మఱియొక స్థానమున నవిహిత మగును. సర్వదా సర్వకాల సర్వావస్థలందు శుభముగ నుండు కర్మమును దెలిసికొనఁ గోరుచున్నాను. దాని నొసర్చుటచే నందఱకును సర్వదా సుఖము ప్రాప్తింపవలయును. యజ్ఞ, యాగ, జప, తప, తీర్థ, వ్రత, దాన, పూజార్చా, జ్ఞాన, ధ్యానము లన్నిటి కంటె శ్రేష్ఠముగ నుండవలయును. చాల వ్యవధి యుండుచో వీని నన్నిటిని చేయుచుఁ గాలయాపన చేయవలయును. కాని మృత్యువాసన్నమైనప్పుడు సమస్తమును వీడి దేనిని జేసినఁ బరమపదము ప్రాప్తించును? ఈ విషయమును మీరందఱును గలిసి విచారించి యుపదేశింపవలయును. ఈ ఋషిమండలములో నేనిర్ణయము జరుగునో అది అందఱకును మాన్యమగును."

మహారాజడిగిన గూఢప్రశ్నను విని ఋషులందఱును జకితులైరి. ఇప్పుడు వారు పరస్పరము ముఖ్య కర్తవ్యము విషయమున వాదవివాదములు చేసికొనుచుండిరి. కొందఱు 'జ్ఞానాదేవతు కైవల్య' మనుచుండిరి. కొందఱు 'కర్మణైవహి సంసిద్ధిః' అని కర్మయే ప్రధానమనుచుండిరి. కొందఱు 'భక్తి వశః పురుషః' అనుచు నుపాసనమే ప్రధాన మనుచుండిరి. కొందఱు దాన, ధర్మ, జప, యోగ, సమాధి, మంత్రాను ష్ఠానాదులు మంచివనుచుండిరి. అందఱును గలిసి యొక నిర్ణయమును జేయఁజాలరైరి. ఋషులలోను, మునులలోను ఇట్టి పరస్పర వాదవివాదము కలుగుటను గాంచి పరీక్షిన్మహా రాజు చేతులు జోడించి నిలుచుండి యిట్లనెను:- "మహర్షు లారా! దీనివలనఁ బ్రయోజనము లేదు. నేను సర్వోత్కృష్ట మగు నస్నతాసనము నొకదాని నేర్పఱతును. 'నేను నా సాధనముద్వారా రాజున కేడుదినములలో నవశ్యము ముక్తి కలుగునట్లొనర్చెదను' అని నిర్భీకుఁడై ప్రతిజ్ఞను జేయఁగల వాఁడీ సింహాసనమునఁ గూర్చుండవచ్చును. నేను సర్వవిధ ముల మీకు సేవకుఁడను. నేను నాచిత్తమును సాంసారిక విషయముల నుండి మఱలించితిని. మీరంద ఱేకగ్రీవముగ నన్నేది చేయుమనిన దానిని నేను విచారింపకయే చేసెదను. ఇప్పుడాలశ్యము చేయరాదు. ఇది వాదవివాదమునకుఁ గాని శాస్త్రార్థమునకుఁగాని సమయము కాదు. నాకిప్పుడు క్షణ మొక యుగముగ నున్నది. కావున మీరందఱును గలిసి నాకు సారతత్త్వమును జెప్పుఁడు. సర్వశ్రేష్ఠమగు సుగమ సాధనమును జెప్పుఁడు."

ఇట్లని మహారాజు గొప్ప దివ్యసింహాసనమునలంకరించి వ్యాసపీఠముగ నొనర్చెను. ఆ దివ్య సింహాసనమును గాంచి ఋషులు, మునులు ఒకరిముఖములు నొకరు చూచుకొనిరి. ఆమునులందఱు త్రికాలజ్ఞులు. ఆయాసనమున కధికారి యెవరో వారికి తెలియును. అందువలన నెవరు నాయుత్తమో త్తమాసనమునఁ గూర్చుండుటకు సాహసింప లేదు. ఇదిచూచి రాజు చాల చింతించెను. ఆతఁ డిట్లనుకొనెను:- "నా కుద్ధారము కలుగదాయేమి? ఋషులు మునులు నన్ను విప్రద్రోహి యని తిరస్కరించుట లేదు కదా?"

ఛప్పయ.

మునియో! మొకూఁ మహా మంత్ర దే పారలగావేఁ।
కృష్ణ చరణ మహఁ చిత్త లగే సో గైల బతావేఁ॥
విద్యా, సాధన శాస్త్ర సభీహైఁ న్యారే న్యారే।
జో జినకూఁ అనుకూల పరైఁ, తే తినకూఁ ప్యారే॥
సరల సుగమ సుందర సరస, సబ మిలి సుఠి సాధన కహైఁ।
కలియుగ కే నరజాహి గహి, భక్తి ముక్తి దోనోఁ లహైఁ॥

అర్థము.

పరీక్షిత్తు ఇట్లనెను:- "మునులారా! నాకు తరించు మంత్రమేదైనఁ జెప్పుఁడు. శ్రీకృష్ణచరణారవిందములందు మనస్సు లగ్నమగు నుపాయ మేదైననుండినఁ జెప్పుఁడు. విద్యా, సాధన, శాస్త్రాదులన్నియు వేఱువేఱుగఁ జెప్పుచున్నవి. ఎవరికేది అనుకూలమైన వారి కది యిష్టముగ నుండును.

మీరందఱును గలిసి విచారించి నాకు సరళ, సుగమ, సుందర, సరస, సాధనను గూర్చి చెప్పుఁడు. కలియుగములో మానవుఁడు దేనిని గ్రహించి భక్తిముక్తుల రెంటిని బొందఁ గలుగును?”



## మునిమండలికి శుకాగమనము

### ౧౩

శ్లో॥ తత్రాభవ ద్భగవాన్ వ్యాసపుత్రో
యదృచ్ఛయా గామటమానోఽనపేక్షః,
అలక్ష్యలింగో నిజలాభతుష్టో
వృతస్త్రీబాలై రవధూతవేషః॥
— శ్రీభాగ. ౧ స్కం. ౧౯ అ. ౨౫ శ్లో.

సీ. ప్రతి నిమేషముఁ బరబ్రహ్మంబు వీక్షించి
మదిఁ జొక్కి వెలుపల మఱచువాఁడు
కమలంబు మీఁది భృంగముల కైవడి మోము
పై నెఱసిన కేశపటలివాఁడు
గెఱవ్రాసి యీయ నంగీకరించిన భంగి
వసనంబుఁ గట్టక వచ్చువాఁడు
సంగి గాఁడని వెంటఁజాటు భూతములు నా
బాలుర హాస శబ్దములవాఁడు

గీ. మహిత పదజాను జంఘోరు మధ్యహస్త
బాహు వక్షోగళానన ఫాల కర్ణ
నాసికా గండ మస్తక నయన యుగళుఁ
డైన యవధూతమూర్తి వాఁడరుగుదెంచె.

— శ్రీమదాంధ్రభాగవతము.

ఛ ప్ప య

మధుర వచన నృప కహేం, మునికే మన మహాఁ బాయే।
తాహి ఛిన నిరపేక్ష వ్యాస సుత శుక తహాఁ ఆయే॥
తరుణ అరుణ కరచరణ కమల సమ నయన రంగీలే।
మనహర లోల కపోల అంగ సుకుమార గఁఠీలే॥
కంధ సింహ సమ విపుల ఉర, కారే కుంచిత కేశ అతి
మృదు మునకావన శ్యామ తను, మత్తగయంద సమానగతి॥

అ ర్థ ము.

పరీక్షిత్తు పలికిన మధురవచనములను వినునప్పటికి మునులందఱి మనస్సు సంతోషమును జెందెను. ఆక్షణము లోనే నిరపేక్షుఁడును వ్యాససుతుఁడు నగు శుకమహర్షి వచ్చెను. తరుణారుణముగఁ గరచరణము లుండెను. నయనములు నళినదళములవలె నుండెను. ఆతని కపోలము మనోహరముగను, అంగము లతిసుకుమారములుగ నుండెను. మృదుమందహాసము, శ్యామసుందర శరీరము, మత్తగజము నడచునటువంటి నడక కలిగియుండెను.

---

ఈ లోకములోని మానవులపై నాశపెట్టుకొనక భగవంతునిపై భారమువైచి, తన తను మన ప్రాణములను

ప్రభుపాదపద్మములం దర్పణచేయువారి మనోరథ మెన్నటికిని విఫలము కాదు. వాని మనస్సులో నేవాంఛ జనించిన, శ్యామ సుందరుఁడు వాని కల్యాణము కొఱకు దానిని సఫలము చేయును. మానవుఁడు విశ్వాసమును బోఁగొట్టుకొని యధీరుఁ డగునో అప్పుడు దుఃఖమును బొందును. చివరవఱకు విశ్వాస మును వీడక, సర్వాంతర్యామియగు ప్రభువు తప్పక యేదో రూపమున వచ్చి తన మనోరథమును దీర్చునని దృఢముగ నమ్మినచో వాని కార్యము లేదోవిధమున నెఱవేరితీరును. ఇట్టివాని విషయములో లతూనుభవములు కలవు. మానవు లసంభవము లనుకొనినవి సంభవములైనవి. దుష్కరములు సుకరములైనవి. ఇట్లే కాకున్నచో భగవంతునిపై విశ్వాస మనునదియే యుండదు.

పరీక్షిన్మహారాజు వేసిన పారమార్థికప్రశ్నకు ముని మండలినుండి నిశ్చితసమాధానము రాకపోవునప్పటికి, ఆతఁడు కొంచెముగఁ జింతించెను. తన కెట్లు ఉద్ధారము కలుగునా యనియే యాతనికి పట్టుకొనెను, ఇట్లనుకొనుచుండఁగనే ఉత్తరదిశగా కొంచెముగ గోల వినఁబడెను. అందఱదృష్టి ఆ దిక్కున కాకర్షింపఁబడెను. చాలమంది బాలకులు, స్త్రీలు చుట్టుకొనియుండఁగాఁ బరమహంసశిరోమణియగు శుకమహర్షి తన యానందములోఁ దాను మునిగి వచ్చుచుండెను.

సూతుఁ డిట్లనెను:– "మునులారా! పరీక్షిన్మహారాజు ప్రాయోపవేశవ్రతమును బూనినపుడు ఆ సంగతి సర్వత్ర వ్యాపించుటచే దైవయోగమున నేను నచ్చుటకుఁ దిరుగుచు వచ్చితిని. సమస్త ఋషులు, మునులు గంగాతటమునకుఁ

బోవుటను గాంచి, కుతూహలవశమున నేనుగూడ వారి వెంట వెళ్లితిని. ఈ దృశ్యమునంతను నేను స్వయముగ నా కన్నులారఁ గాంచితిని. నా గురుదేవుఁడగు శుకమహర్షి దర్శనము మొట్టమొదటిసారిగ నేనక్కడనే చేసితిని. నేనా సౌందర్య సాకారవిగ్రహమును గాంచి నా నేత్రములను సఫలమొనర్చు కుంటిని. ఆహా! ఆతని యనుపమసౌందర్యము సాకారవిగ్రహమును ధరించి వచ్చుటను గాంచి నా నేత్రములు సఫలములైనవి. ఆహా! ఆతని యనుపమకాంతి యెట్టిది? ఆతని యనింద్య నిరవద్య సౌందర్య మెట్టిది? మత్తగజేంద్ర గమనమున నడుచు యాతని మందగమన మెట్టిది? ఆతఁ డీ సంసారము విషయమున నెంతయో నిరపేక్షుఁడుగఁ గనఁబడెను. లోకములో, గుగూపులయ్యును నానావిధ పరిమళ తైలముల నలఁది, బహుమూల్యములగు వస్త్రాభూషణములను ధరించిన నా యలంకారములవలనఁ గొంచెముగ నాకర్షకముగఁ గనఁబడువారు కలరు; కాని స్వాభావికముగ సుందరముగ నుండువాఁ డేస్థితిలో నున్నప్పటికిని వానిలో సౌందర్యము కనఁబడును. వాని సౌందర్యము వస్త్రాభూషణములచే వృద్ధి కాదు; కాని వాని శరీరముపై నుండుటచే నా వస్త్రాభూషణములకు సౌందర్యము లభించును. వాని శరీరముపై బూడిద నలఁదినను ఆ కారణమున వానికి అనుపమ శోభ కలుగును. స్వాభావికమనోహరతకు శృంగారాలంకారము లవసరము లేవు.

పంచపాండవులలో సహదేవుఁ డందఱికంటె నందగాఁడు. ఆతఁ డందగాఁ డగుటకు దేవతలలో దివ్యసుందరులని పొగడ్తను గనిన అశ్వనీకుమారుల యంశమునఁ బుట్టుట

యొకటియు, నాతని తల్లి మద్రదేశ స్త్రీయగుటచే, సాధారణముగ నచ్చటి స్త్రీలు గౌరవర్ణముగ నుందురు; అట్టియామెకు పుట్టుటచే నీయన అద్వితీయ సుందరుడుగ నెన్నఁబడినాఁడు. ఆతఁడొక గ్రామమునుండి మఱియొక గ్రామమునకు వెళ్లు చుండినప్పుడు యుక్తవయస్సు వచ్చిన బాలికలు, స్త్రీలు ఆతని సౌందర్యమును గాంచుచుఁ గ్రోసులకొలఁది దూరము వెళ్లుచుండెడి వారఁట. అందువలన వనవాససమయమునఁ దన్నెవరును గుర్తింపకుండుటకు తనస్వాభావిక సౌందర్యమును జూడకుండునట్లు దేహమునిండ దుమ్మును బూసికొనెడు వాఁడఁట. మునులారా! నేను పాండునందనుఁడగు సహదేవుని గాంచితిని. ఆతఁ డతిసుందరుఁడు. కాని నా గురుదేవుఁడగు వ్యాసనందనునిముందు లోకములోని సౌందర్యమునంతను దుచ్ఛముగ నెంచుచున్నాను. అనుపమ లావణ్య మాధుర్యములు శ్యామసుందర శ్రీవిగ్రహమందే కలవు. తర్వాత పరమహంస పరివ్రాడ్చక్రవర్తియు, వ్యాసనందనుఁడగు శ్రీ శుకమహర్షి శ్రీవిగ్రహమందే కలవు. వీరిద్దరి సౌందర్య మాధుర్యములందు నాకు భేద మేమాత్రమును లేదు. ఒక్కటే రకమగు కాంతి, ఒక్కటే తేజస్సు, అదే శరీరము, అదే వయస్సు, అదే వైఖరి, అదే నడక, అదే వయ్యారము, అదియే మందహాసము. అన్నిటిలో సామ్యమే. భేదమేమనఁగా నాతఁ డెల్లప్పుడు నలంకారము చేసుకొనియుండును. ఇఁక నీతఁడో యవధూతయై, మొండిమొలతో, తల విఱియఁబోసికొని బాలోన్మత్త పిశాచమువలె నిటునటు నకారణముగఁ దిరుగుచుండును. ఈ స్వాభావికతాకారణమున నీతనిసౌందర్య

మింకను నిర్మలముగను, స్వచ్ఛముగను, మనోహరముగను నుండెను.

తల వెండ్రుకలు నల్లగ నుంగరములు తిరిగి, అంత పెద్దవి కాకుండ, అంత చిన్నవి కాకుండ నుండిన మిక్కిలి శ్రేష్ఠములుగ నెన్నుచుందురు. వాటిని నానావిధములగు సుందర సుగంధిత గుణకర పదార్థములచేఁ గడిగి, వివిధములగు గాఢ సువాసన గల తైలముచే నలఁది, జాగ్రత్తగ దువ్వెనతోఁ జిక్కుఁదీసి, వివిధ విధముల నలంకరించి, దానిమీఁదఁ జిత్రవిచిత్రములగు బుష్పములచే నలంకరించినచో నవి చిత్తాకర్షకముగను, నయనానందదాయకముగను గనఁబడును; కాని మా గురుదేవుని వెండ్రుకల కివి యేమియును లేవు. ఎప్పుడును గడుగక పోవుటచే నవి చిన్నచిన్న జడలయ్యెను. దువ్వఁబడక విటియఁ బడి యుండెను. దుమ్ము మిక్కిలిగ నుండెను: ఆతఁడు తల నాడించిన చందనశాఖకు వ్రేలాడిన నాగుబాములట్లు జడలు వ్రేలాడుచుండును. తమాల వృక్షశాఖాద్వయమువలె నాతని యందమైన నెగుభుజములుండెను. ఆతని వక్షస్థలము విశాలము. స్తనములు నలుపు. ధూళిధూసరితమగుటచే విశాల కృష్ణవర్ణశిలాఫలకముపై శ్వేత చిత్రాసనమును గప్పినట్లుండెను. ఉదరమునఁ ద్రివళీ శోభించుచుండెను. గంభీరమగు నాభి శ్రావణ భాద్రపదములలో గంగాప్రవాహములోని సుడి వలె గుండ్రముగ నుండెను. దశదిశలే ఆతనికి బహుమూల్యములగు వస్త్రములు. ధూళితప్ప శరీరముమీఁద నొక వస్త్రమైన లేదు. కదళీ స్తంభములవలె నాతనికి లావుపాటి జంఘలు, మెలితిరిగిన కండరములు, సుందర సుకోమల అరుణచరణము

లుండెను. ఆతని ఒక్కొక్క అంగము సుందరాతిసుందరముగ నుండెను. ఆతని సౌందర్యమున కీ ప్రాపంచిక సౌందర్యమునకుఁ బోల్కియే లేదు. ఆతని రూపమునుజూచి సౌందర్యముకూడ సిగ్గుపడుచుండును. ఆతఁ డుస్మత్తస్థితిలో నూగుచు, నాత్మానందమున నిమగ్నుఁడై వచ్చుచుండెను. ఆతని యద్భుత సౌందర్య మాధుర్యముల కాకర్షింపఁబడి చాలమంది గ్రామీణులగు స్త్రీలు, పిల్లలు వెనువెంట వచ్చుచుండిరి. బాలు రాతనిని బిచ్చివాఁడనుకొనుచుండిరి. కొంద ఱాతనిపై దుమ్మును జల్లుచుండిరి. రాళ్ళు విసరుచుండిరి. అందులోఁ గొంచెము పెద్ద బాలురు అట్లు చేయవలదని చిన్నపిల్లలను గసరుచుండిరి. పిల్లలందఱు 'యయ్ పిచ్చివాఁడురోయ్, గీఁగీఁ' యని యఱచుచు నందఱు నవ్వుచుండిరి. శుకమహర్షి కూడ వారినవ్వులో నవ్వు కలిపి నవ్వుచుండెను. ఒక్కొక్కప్పుడు వెళ్ళుచు వెళ్ళుచు నిలువఁబడుచుండును. ఒక్కొక్కప్పుడు బాలకులవైపు చూచి మరల బయలుదేరుచుండును. ఈ విధముగ నద్భుతక్రీడ నొనర్చుచు, గురువునకు గురువగు నా యారాధ్య దేవుఁడగు శ్రీకృష్ణద్వైపాయన తనయుఁడగు శుకుఁ డా మునిమండలి సమీపమునకు వచ్చెను. అందఱదృష్టి అటే మరలెను. మొట్టమొదట నాతని నెవరును గుర్తింపఁజాలకపోయిరి. ఆతఁడు దగ్గఱకు రాఁగానే, ఆతని నెఱిఁగినవారు లక్షణములను గనిపెట్టి గుర్తించిరి. యౌవనముచే నుప్పొంగియున్న కారణమున శ్యామవర్ణముగల నాతని శరీరము సానపెట్టని నీలమణివలె ధూళిధూసరితమై అత్యంత తేజస్సుతోఁ గనఁబడెను. ఆతనిని జూడఁగానే సమస్త ఋషులు మునులు తమతమ

యాసనములనుండి యాతని నాదరించుటకై లేచి నిలుచుండిరి. ఆతఁడు సభలో నెవరివైపును జూడలేదు. ఆతని తండ్రియగు వ్యాసభగవానుఁడును, తాతయగు బరాశరుఁడు నచ్చటనే యుండిరి. తాతకు తాతయగు వశిష్ఠుఁడు సభ నలంకరించి సభకు శోభ నొనగూర్చుచుండెను. ఎవరిని జూడక ఆతఁడు సరిగా నా యున్నతసింహాసనము మీఁదకు బోయి కూర్చుండెను. ఒక దిగంబర యువక మునికుమారుఁడు, గొప్పగొప్ప వయోవృద్ధులగు మునులమధ్య నే యనుమానమును లేకయే ఉన్నతాసనమున గూర్చుండిన నందఱకు నది విరుద్ధముగఁ దోఁచియుండవలసినది, కాని యచ్చట నెవరికి నాతని యీ వ్యవహారము విపరీతముగఁ దోఁపలేదు. ఒకానొక నిష్కపట, అమాయకపు శిశువు తనంతటఁ దాను చక్రవర్తి వడిలోనికిఁ బోయి కూర్చుండిన, నందఱును గౌతుకవశమున నవ్వి, వానిని ప్రేమించినట్లు, ఋషులందఱు నాతనిని సమ్మానించిరి. ఆతని తేజము ముందు వారి తేజము హీనమయ్యెను. ఋషుల యొక్కయు, మునులయొక్కయు శిష్యులు, పుత్రులు వారిలో వారు గుసగుసలాడుకొనిరి.

ఒకానొకఁడిట్లనెను:- "ఈతడెవరు? ఈతఁడు మిక్కిలి మనోహరుఁడు. ఈతనికి ప్రపంచభావమే లేదు. ఆహా! ఎట్టి దర్శనీయమూర్తి?"

ఇంకొకఁడిట్లనెను:- "నీకు తెలియదా యేమి? వ్యాసభగవానుని తనయుఁడగు శ్రీ శుకుఁడు. తోడనే త్యాగియు, విరాగియు. ఈతనికి

రముకూడ లేదు. తల్లి కడుపునఁ బుట్టినపుడే ఈతఁడరణ్యము లకుఁ బోయెను.''

అంత నింకొకఁ డాశ్చర్యముతో నిట్లనెను:- "ఈతఁ డేనా పరమహంస చూడామణియగు శుకదేవుఁడు? ఈతని త్యాగవైరాగ్యములను గూర్చి మేము చాల దినములనుండి కథాప్రసంగములలో వినుచుంటిమి. ధన్యుఁడను! నేఁడీతని దర్శనమైనది.'' ఈవిధముగ శ్రీశుకుడు రాఁగానే సభలో నొక విధమగు నానందాశ్చర్యములు ఆటుపోటు సమయములందు సముద్రమునఁ దరంగము లుబికిన ట్లుబుకుచుండెను.

ఛప్పయ.

ధూరి భర్యో తను దృష్టి ఇష్ట చరనని మహఁ లాగీ।
రతి పతి సమ అతి సుఘర దేహ కీ సుధి బుధి త్యాగీ॥
వేష దిగంబర కేశ ఖులే సంగ బాలక భాగేఁ।
నిరఖి నారి సౌందర్య చలీఁ సబ కారజ త్యాగేఁ॥
ఋషి-ముని నిరఖే వ్యాససుత, జాని సబని ఆదర దయో।
బైఠే పూజిత పీఠపై, నృప మన అతి ఆనంద భయో॥

అర్థము.

శరీర మంతటను ధూళి నిండియుండెను. దృష్టి తన పాదములందే యుండెను. అపర మన్మథునివలె సుందర దేహము కలిగియుండియు శరీరస్పృహ లేకుండెను. దిగంబర [illegible]ముతోఁ గేశములను విరియవేసుకొని యుండెను. బాలకు [illegible]వెంటఁబడుచుండిరి. ఆతని సౌందర్యమును అతివలు [illegible]కార్యములను వదలి బయలుదేరిరి.

వ్యాససుతుని ఋషులు, మునులు చూచి గుర్తించి అందఱు నాదరించిరి. ఆతఁడు పూజాపీఠమునఁ బోయి కూర్చుండునప్పటికి మహారాజుకు మిక్కిలి ఆనందముకలిగెను.



## శుకునితోఁ బారమార్థికప్రశ్న

### ౧౪

శ్లో॥ స విష్ణురాతోఽతిథయ ఆగతాథ
తస్మై సపర్యాం శిరసా జహార।
తతో నివృత్తా హ్యబుధాః స్త్రియోఽర్భకా
మహాసనే సోప విశ్య పూజితః॥

—శ్రీభాగ. ౧ స్కం. ౧౯ అ. ౨౯ శ్లో.

ఆ. వెఱ్ఱితనము మాని విజ్ఞాన మూర్తియై
బ్రహ్మభావమునను బర్యటింప
వెఱ్ఱియంచు శుకుని వెంట నేతెంతురు
వెలఁదు లర్భకులును వెఱ్ఱులగుచు.

— శ్రీమదాంధ్రభాగవతము

ఛప్పయ.

విధివత్ పూజా కరీ నృపతి యోఁ బచన ఉచారే।
దీయే దర్శన దేవ! దురిత సబ హారే హమారే॥
జినకో సుమిరన కరత రాగయుత హోహిఁ విరాగీ।
తినకో దరసన పాహిఁ భాగ్యశాలీ బడ భాగీ॥

అహో, ఆజ ద్విజ ద్రోహ కరి కేఁ హూఁ హాఁ పావన భయో
అతిథి ఆఇ శ్రీశుక భయే, నింద్య కృతారథ హ్వై గయో॥

అర్థము.

పరీక్షిన్మహారాజు విధ్యుక్తముగ శుకుని బూజించి యిట్లు పలికెను:- "దేవా! మీరు దర్శనమొసంగితిరి. నా పాపము లన్నిటినిఁ బరిహారమొనర్చితిరి. ఎవరిని స్మరించుటచే నాబోటి రాగయుక్తులకు విరాగము కలుగునో అట్టి మీ దర్శనము లభించినది. నేనెంతయో భాగ్యశాలిని, అదృష్టవంతుడను. నేను ద్విజద్రోహముచేసి మీదర్శనమున పావనుఁడనైతిని. శ్రీ శుకుఁ డతిథియగుటచే నింద్యుఁడనగు నేను కృతార్థుఁడనైతిని."



గురువునకును భగవంతునకును భేదమేమియును లేదు. భగవంతుఁడెట్లు సర్వవ్యాపకుఁడో గురుతత్త్వముకూడ అట్లే సర్వవ్యాపకము, ఆఁకలి లేక యితరుల బలవంతమునఁ దినిన యన్నమున యథార్థమగు రుచియు లభింపదు సరిగదా, యది శుద్ధ రసమై శరీరపోషకమే కాదు. ఇంతే కాదు, ఆఁకలి లేక అనిచ్ఛాపూర్వకముగఁ దినిన యన్నము దూషిత ఆమముగనై విషమువలె హానికరమగును. కఱకుటాఁకలి వేసినప్పుడు లభించిన స్వాదిష్టమగు భోజనమును గాంచిన నానందముగ నుండును. తినునప్పుడు హృదయము ప్రసన్నమగును. లోపల శుద్ధరసముగఁ దయారు కాఁగలదు. తుష్టి, పుష్టి, క్షుధా నివృత్తి ప్రతిగ్రాసమునకు లభించుచుండును. ఇట్లే హృదయ

మునఁ బరమార్థ జిజ్ఞాస ప్రబలముగ నున్నప్పుడు సర్వాంత ర్యామియగు గురువు స్వయముగ నధికారియని గ్రహించి యాతని ముందు ప్రత్యక్షమై సమస్త సంశయములను సంఛి న్నముగావించును. యోగ్యుఁడగు గురువు అపాత్రున కుపదేశ మొసంగఁడు; ఏలననగా రాగిపాత్రలోఁబోసిన పెరుగువలెను, బూడిదలోఁ జేసిన హోమము వలెను, చేదుసొరకాయ కూరలో వేసిన నేయి, రుచిగలపదార్థములు వ్యర్థములై పోవునట్లు అపాత్రున కొసంగిన యుపదేశము వ్యర్థమగును.

పరీక్షిన్మహారాజు తన కేడు దినములలో మృత్యువు కలదని విని విషయ విరక్తుఁడయెను ఆతఁడు రాజ్య, పరివార, ధన ధాన్య దారా పుత్రాదులను ద్యజించెను. శ్రీకృష్ణుని యందే తన చిత్తమును జేర్చెను. సర్వశ్రేష్ఠమగు సాధన యేది యను జిజ్ఞాసకై మునులందఱుఁజుట్టుకొనఁగా గంగాతట మునఁగూర్చుండెను. ఆతనికంటె నుత్తమ అధికారి యింకెవఁ డుండఁగలఁడు? అందుకనియే సర్వసంగ పరిత్యక్తుఁడును, నిరపేక్షుఁడును, పరమత్యాగియు, విరాగియునగు శుకమహర్షి కూడ ఆతని ప్రబల జిజ్ఞాస కాకర్షింపఁబడి పిలువఁబడకయే ఆతని దగ్గఱకు వచ్చెను. ఇంతకు పూర్వమే పరమసాధ్య తత్త్వమును గూర్చి మునులకు వాదవివాదములు జరిగెను. అదివిని పరీక్షిత్తు కొంచెముగ నిరాశ చెందెను. అది యిప్పుడు శుకాగమనమున ఆశారూపమునఁ బరిణమించెను. వ్యాస తనయుఁడగు శుకుఁడు తనంతట తాను వచ్చి యున్న తాసన మునఁ గూర్చుండగాఁ మహారాజు ఆనందమునకు మేఱ లేకుం డెను. పరుగెత్తుకొనిపోయి యాతఁడు పరమహంస శిరోమణి

యగు శుకమహర్షి చరణకమలములమీఁదఁబడి సాష్టాంగనమస్కారము కావించెను. ఆతని చరణరజమును శిరస్సున ధరించెను. శుద్ధోదకముచే ధూళిధూసరితములగు నాతని యరుణ చరణకమలములను బాగుగా తోమి కడిగెను. అర్ఘ్య, ఆచమనీయ, ధూప, దీప, నైవేద్య, పుష్ప ఫలముల సమర్పించి నాతనిని విధ్యుక్తముగఁ బూజించెను. సుందర సుగంధిత సురుచిర కమలహారమును ఆతనిమెడలో వేసెను. శుకమహర్షి రాజుచేసిన పూజను శాస్త్రవిధిచే స్వీకరించెను. రాజుచే బూజింపఁబడి, యున్నతాసనమున కమలమాలను ధరించి బలి యజ్ఞమున ఋషుల మధ్యనున్న వామనునివలెను, ముని మండలి మధ్య బ్రహ్మపుత్రుఁడగు సనత్కుమారుఁడు కథాకథనమునకుఁ గూర్చుండినట్లును, తారలమధ్య శరశ్చంద్రుని వలెను బరీక్షిత్పరిషత్తులో మునులమధ్య పరమహంస శిరోమణి యగు శ్రీ శుకుఁడు శోభించుచుండెను.

శుకదేవుని వెంటఁబడి వచ్చుచున్న గ్రామ్యస్త్రీలును, బాలకులును ఈ పిచ్చివానిని చక్రవర్తియగు పరీక్షిత్తు విధ్యుక్తముగఁ బూజించుటను, ఆతనికి సాష్టాంగనమస్కారము చేయుటను గాంచి భయపడి యచ్చటనుండి పారిపోయిరి. సమస్త ఋషులు, మునులు తమతమ యాసనములందు గూర్చుండిరి. సభయంతటను శాంతముగ నుండెను. అందఱు మౌనముగ నుండిరి. వాయువుకూడ మందగతిని వీచుచుండెను. ప్రకృతి స్తబ్ధతను భంగముచేయుచుఁ బరీక్షిన్మహారాజు శ్రీ శుకుని సమీపమునకు వచ్చి పునఃప్రణామము కావించి, చేతులు రెండును జోడించి, గద్గదకంఠముతో నిట్లనెను.

మహారాజు తన కడకు వచ్చిన యద్వితీయ యతిథికి స్వాగతము చెప్పి యిట్లనెను:- "బ్రాహ్మణోత్తమా! మీ యహైతుకకృపను గూర్చి వర్ణించుటకు నాకు శక్తి చాలదు. మీరు కృపాసముద్రులు. జీవులను గరుణించుటయు, వారినిఁ గుపథమునుండి తొలఁగించి సత్పథమునఁ బెట్టుట మీకు స్వాభావ ధర్మము. మీరు చేయు ప్రతికార్యమును లోకకల్యాణము కొఱకే యగుచుండును. కావున మీ విషయమునఁ జేయు నదియుఁ బ్రశంసించునదియు నంతయు వ్యర్థమే కాఁగలదు. నేఁడు నేను నా యదృష్టమునకు విఱ్ఱవీగుచున్నాను. నేఁడు మీ దర్శనమైనది, యెంత సౌభాగ్యశాలినోకదా! స్వామీ! నే నిప్పుడు నామమాత్రమునకు క్షత్రియుఁడను. ఎవరిని దుఃఖమునుండి రక్షింపఁజాలను. పైగా సాధుబ్రాహ్మణులను దుఃఖపెట్టుచున్నాను. ఇట్లు చేయుచున్నప్పటికిని మీరు నా యవగుణములపై ధ్యానమే యుంచలేదు. అతిథిరూపమున వచ్చి నన్నుఁ బరమపావనునిఁ గావించితిరి.

యోగశాస్త్రాచార్యుల మతము ననుసరించి యోగేశ్వరులను స్మరించినచో యోగవిఘ్నములన్నియు నాశనమగును. మిమ్ములను స్మరించిననే సమస్తదురితములు దూరమగుచుండ, మిమ్ములను దర్శించుటచేతను, పాదస్పర్శ చేయుటచేతను, మీ సాంగత్యమున సంభాషించుటచేతను, మీ పాదసేవ చేయుటచేతను, మీ పాదములు కడుగుట చేతను, మీకు ఆసన భోజనాదుల నొసంగి సేవించుటచేతను గలుగు భాగ్యము విషయమునఁ జెప్పవలసిన దేమున్నది? దేవతలకుఁగూడ దుర్లభమగు సౌభాగ్యము నేఁడు నాకు లభిం

చినది. నా పాప మెట్లు నశించునా యను చింతలో నేనుంటిని. కాని మీరు వచ్చుటచే నేను నిశ్చింతుఁడనైతిని. దైత్యుల భయమున దేవతలందఱును పారిపోవునప్పుడు విష్ణువు గదను ధరించి రణక్షేత్రమునకు రాఁగానే దేవతలు నిర్భయులైన ట్లును, దైత్యులందఱును భగవానుని జూచి భయపడి పాఱి పోయినట్లును నా పాప తాప సంతాపములు మీ సన్నిధి మాత్రముననే నాశనమైనవి. వివశములై పోయినవి.''

మహారాజు పలికిన వినీతవచనములను విని శ్రీశుకుఁ డాతని నభినందించి యిట్లనెను:— ''రాజా! నీవు గొప్ప ధర్మాత్ముఁడవు. సాధుసేవకుఁడవు. నీ పుణ్యప్రభావముననే యిందఱు ఋషులు, మునులు మాటలో నిచ్చట సమావేశమైరి.''

అత్యంత దీనతాభావముతో మహారా జిట్లనెను:— ''ప్రభూ! ధర్మాత్ముఁడనే యైయుండిన నాకు విప్రశాప మేల రావలెను? నా బుద్ధి అధర్మకార్యములో ప్రవృత్తమైన దేల? మీవంటి సాధుపురుషుల సత్సంగము లభింపఁగల పుణ్య మేమియు నేను జేసియుండలేదు. ఇది నా పుణ్యముగఁ దోఁచుటలేదు. నా పూర్వజుల పుణ్యమువలననే నాకీ యదృ ష్టము లభించిన దనుకొనుచున్నాను. నా పితామహులపై శ్యామసుందరునకు మిక్కిలి యనుగ్రహము కలదు. ఆతఁడు వారికి తన మేనత్తకుమారులని సమస్తకార్యములను జేయు చుండెడువాఁడు. సర్వదా వారి హితముకొఱకే పాటుపడు చుండెడువాఁడు. ఆ సంబంధమువలననే పాండవుల సౌహార్ద మును స్మరించియే వారి యానందముకొఱకు నన్ననుగ్రహిం

చెను. నామీఁదఁ గల కృపవలననే మిమ్ములను సాక్షాత్కా-
రింపఁజేసెను. ఎల్లప్పుడు వనములలోనుండు మీయొక్క- దర్శ
నము నాకు మరణకాలమున నెట్లు లభింపఁగలదు? మీగతి
యవ్యక్తము. మీరు సిద్ధులు. ఇచ్ఛానుసారముగ రూపమును
ధరింపఁగలరు. ఎక్కడికి వెళ్లవలెననిన నచ్చటకు క్షణములో
వెళ్లఁగలరు. తమ స్వప్రయోజకత్వమున మిమ్ము లభింపఁజేసి
కొనవలయుననిన మీరు వారికి దొరకరు. ఇట్టి సిద్ధమహాపురు
షుల దర్శనము సంసారపంకమునఁ బడిన మాబోటి విషయా
సక్తులగు ప్రాకృత ప్రాణుల కసంభవము. నాదొక ప్రశ్న
కలదు. నేనా ప్రశ్ననే యీ మహర్షులందఱ నడుగుచుంటిని.
ఇంతలోనే దైవికముగ మీరుకూడ వేంచేసితిరి. ఆజ్ఞ యగు
నెడల నడిగెదను.''

శుకుఁడిట్లనెను:- ''రాజా! నేను నీ ప్రశ్నలకు ప్రత్యు
త్తర మిచ్చుటకే వచ్చితిని. నీ వడుగఁదలఁచిన దేదియో
నిస్సంకోచముగ నడుగుము.''

చేతులు జోడించి వినీతభావముతో పరీక్షిన్మహారా
జిట్లనెను:- ''ప్రభూ! నే నడుగఁదలఁచిన దిది. మానవుఁడు
సమస్తమును వీడి చేయవలసిన దేమున్నది? ముఖ్యముగ
మరణాసన్నమైనవాఁ డేమి చేయవలసియుండును? ఇప్పుడే
చావబోవుచున్నానని తెలిసికొనినవాఁడు ముఖ్యముగ నేమి
చేయవలసియున్నది? ఈ సంగతి నాకు ముందుగాఁ జెప్పవలసి
యుండును. అట్టివాఁడు దేనిని వినవలయును? ఏ మంత్రమును
జపింపవలయును? ఎవని భజనము చేయవలసియుండును?
మరణాసన్నునకు మరల జనన మరణములు కలుగకుండునట్లు

మీ రమోఘ రామబాణమువంటి ఔషధమును జెప్పవల యును. దానిమూలమున నెనుబదినాలుగులక్షల యోనులలో బడకుండ భగవద్ధామమును బొందగలిగి యుండవలయును. ఔషధముతోఁగూడ దాని పథ్యమునుగూడ చెప్పవలయును. ఏలననఁగాఁ బథ్యములేనిది ఔషధము చేయవలసిన రీతిగా పని చేయఁజాలదు. కావునఁ గర్తవ్యముతోఁ బాటుగా నేయే కార్యములను వదలవలయునో కూడ చెప్పవలయును.''

'నీ ప్రశ్న చాల గూఢమైనది. దానికి జవాబిచ్చుటకు చాలకాలము పట్టగలదు. నేనంతవఱకిచ్చట నుండవీలులే'దని మీరనవచ్చును. దీనబంధూ! మీరు గృహస్థుల యిండ్లలో నధికకాలము నిలువరనియు, గోదోహన కాలము మాత్రమే అదృష్టశాలియగు గృహస్థుని యింటిలో భిక్షా మిషతో నిలుచుందువని నాకు తెలియును. అదియు భిక్షాలోభమునఁగాదు. ప్రపంచములోని సమస్తైశ్వర్యము మీ చరణకమలములందు దొరలుచుండును. మీకు భిక్ష యెందులకు? మీరు సంసార పంక మగ్నులగు దీన హీన సాధన విహీనులగు గృహస్థుల యిండ్లలోఁ గృపతో మీ దర్శనముచే వారినిఁ గృతార్థులఁ గావించుటకు వారి యిండ్ల కప్పుడప్పుడు వచ్చుచుందురు. ఇట్లయ్యును మీరు కృపాసముద్రులు. దయానిధానులు. మీరు నా సంశయముల నవశ్యము ఛేదింపఁగలుగుదురు. మీ రేమదినము లిచ్చటనుండి నన్నవశ్య ముద్ధరింపఁగలుగుదురు. స్వామీ! ఇప్పుడు నేను మిమ్ములను శరణు వేఁడుచున్నాను. నా సంశయములన్నిటికిని సమాధానము చెప్పుటకు మీరు సమర్థులరు. మీరు సర్వజ్ఞులు. త్రికాల దర్శులు. మీకు

తెలియనివిషయమే లేదు'' అని రాజు శ్రద్ధాభక్తిపూర్వకముగ మరల శుకమహర్షికి సాష్టాంగనమస్కారము కావించెను.

సూతుఁ డిప్పుడు శౌనకాది మునులతో నిట్లనెను:- ఋషులారా! రాజు పలికిన మధుమయ భాషణములను వినియు, నాతని పరమ మధుర, స్నిగ్ధ వినమ్ర వాక్కులను వినియు వ్యాసనందనుఁడగు శ్రీశుకమహర్షి మిక్కిలిప్రసన్నుఁ డయ్యెను. సర్వవిషయ జ్ఞాతయు, సర్వధర్మజ్ఞాతయు నగు శుకుఁడు మహారాజడిగిన ప్రశ్నలకుఁ బ్రత్యుత్తర మీయ నుద్యుక్తుఁ డయ్యెను.

మునులారా! నేను మీకు పరీక్షిన్మహారాజుయొక్క పరమపావనభక్తి నభివృద్ధి జెందించు నుత్తరచరిత్రను జెప్పితిని. ఇప్పుడు భాగవతకథకు వక్త శ్రోత లిద్దరొకచోఁ జేరిరి. నా యీ 'భాగవతకథకు' భూమిక సమాప్తమైనది. దీని తర్వాత పరీక్షిచ్ఛుక సంవాదము ప్రారంభము కాఁగలదు. పరమహంస శిరోమణియు, నాగురుదేవుఁడు నగు శ్రీశుకుఁడు పరమభాగవతుఁడగు పరీక్షిన్మహారాజు ప్రశ్నల కెట్లు ప్రత్యుత్తర మిచ్చినదియు మీసమ్ముఖమున వర్ణించెదను. మీరందఱును దత్తచిత్తులరై తత్పరతతో శ్రవణము చేయవలయును.

ఛప్పయ.

ప్రభో! పరమ పురుషార్థ కృపాకరి మోహి బతా ఓ।
మరణ శీల కస తరహిఁ తురత తాకూఁ సమఝా ఓ॥
సునే సుధాసమ బైఁన నీర నైఁనని మహఁ ఆయో।
బోలే శుక – నృప ధన్య జగత తేఁ చిత్త హటాయో॥

నృపవర! సబచింతా తజపహు,మనమోహనమహాఁమనధరహు।
కహూఁ భాగవత తత్వ అబ, దత చిత్త హ్వైకేఁ సునహు॥

అర్థము.

"స్వామీ! నాకు పరమ పురుషార్థ మేమియో కృపతోఁ జెప్పుఁడు. మరణాసన్నుఁడగు వాఁడు తక్షణము తరింపవలెననిన నేమార్గమునఁ దరింప వలయును?" అని సుధాసమవాక్కులను బాష్పనేత్రములతోఁ బరీక్షిత్తు పలుకఁగా శుకుఁడిట్లనెను:- "రాజా! నీవు ప్రాపంచికవిషయములనుండి చిత్తమును దొలిఁగించితివి. కావున నీవు ధన్యుఁడవు. రాజా! నీవు చింతనంతను వీడుము. మనస్సును జగన్మోహనునిపై నిలుపుము. నేను నీకు భాగవతతత్త్వమును జెప్పెదను. నీవు దత్తచిత్తుఁడవై హృదయపూర్వకముగ వినుము."

భూమికా భాగము సమాప్తము.



# పరీక్షిన్మహారాజు పశ్నకు ప్రత్యుత్తరము

## రాగ

శ్లో॥ వరీయానేష తే ప్రశ్నః కృతే లోకహితో నృప,
ఆత్మవిత్సమ్మతః పుంసాం శ్రోతవ్యాదిషు యః పరః॥
తస్మాద్భారత సర్వాత్మా భగవాన్ హరిరీశ్వరః,
శ్రోతవ్యః కీర్తితవ్యశ్చ స్మర్తవ్యశ్చేచ్ఛతా భయమ్॥
— శ్రీభాగ. ౨ స్కం. ౧ అ. ౧, ౫ శ్లో.

సీ. క్షితిప నీప్రశ్నంబు శ్రేష్ఠతమంబగు
నాత్మవిదుల్ మెత్తు రఖిల శుభద
మాకర్ణ నీయంబు లయుత సంఖ్యలు గల
వందు ముఖ్యంబిది యధికతరము
గృహముల లోపల గృహమేధులగు నరు
లాత్మతత్త్వము లేశమైన నెఱుఁగ
రంగనా రతుల నిద్రాసక్తిఁ జను రాత్రి
పోవుఁ గుటుంబార్థ బుద్ధి నహము

గీ. పశు కళత్ర పుత్ర బాంధవ దేహాది
సంఘమెల్లఁ దమకు సత్యమనుచుఁ
గాఁపురములు సేసి కడపటఁ జత్తురు
కనియుఁ గాన రంతకాల సరణి.

క. కావున సర్వాత్ముండు మ
హావిభవుఁడు విష్ణుఁ డీశుఁ డాకర్ణింపన్
సేవింపను వర్ణింపను
భావింపను భావ్యుఁ డభవ భాజికి నధిపా.

—శ్రీమదాంధ్రభాగవతము.

ఛప్పయ.

భరతవంశ అవతంస! ప్రశ్న అతి ఉత్తమ కీన్హోఁ।
మునిమండల కే మధ్య మోహి ఆదర బహు దీన్హోఁ॥
భూప! మూఢజన విషయ భోగ మహఁ సమయ బితావేఁ।
ప్రభుపద ప్రేమ న కరహిఁ అంత మహఁ పుని పఛితావేఁ॥

నృపవర! నరతను నావ దృఢ, కృష్ణకథా పతవారఁ హై।
కేశవకూఁ కేవట కరహి, సో భగసాగర పార హై॥

అర్థము.

భరతవంశావతంసా! నీవు వేసిన ప్రశ్న అత్యుత్తమమైనది. నీవు మునిసమూహాము మధ్యమున నన్ను మిక్కిలి ఆదరించితివి. రాజా! మూఢులు వారి కాలమునంతను విషయ భోగములందే గడిపెదరు. వారు భగవత్పాద పద్మములను సేవింపక చివరకుఁ జాల పశ్చాత్తాపము చెందెదరు.

రాజోత్తమా! నరతనువే దృఢమగు నావ. కృష్ణకథ చుక్కాని. నారాయణుని నావికునిగావించి సంసార సాగరమును దరింపవచ్చును.

---

ప్రపంచమందంతటను విషమ సామ్రాజ్యమే. 'ముండే ముండే మతిర్భిన్నా' అను న్యాయానుసారముగా సాధారణముగ రెండు మనస్సులు కలువనే కలువవు. సంబంధులలోఁ గాని, ప్రియులలోఁగాని కొంచెమో గొప్పయో మతభేదముండితీరును, భార్యాభర్తలకును, తండ్రికొడుకులకును, అన్నదమ్ములకును బుద్ధివైషమ్యముచేఁ గలహద్వేషములు, తగవులాటలు కలుగుచుండుట చూచుచునేయున్నాము. కాని తన మనస్సున కనురూపమగు మనస్సు లభించెనా ఆ మనస్సా యితరమనస్సుతో నీరక్షీరన్యాయముగఁ గలియును. అట్టివారిద్దరు మిక్కిలి అదృష్టవంతులు. ఒకఁడు తన్నుఁ దాను సమర్పించుకొనుట యనఁగాఁ దన సత్తాను బోఁగొట్టుకొనుటయే.

ద్వైతమున్నంతవఱకు ప్రేమ లేదు. భిన్నత్వమును బోఁగొట్టు కొని, తన వృత్తుల నన్నిటిని ప్రేమాస్పదునియందు గలిపిన రెండు మనస్సులును గలిసి రెట్టింపగుటయే కాదు, వాని శక్తి యత్యధిక మగును. ఒకటి ఒకటి కలిసి పదునొకండగును. తన చేష్టల నన్నిటిని తన యన్న చేష్టలలోఁ గలిపినవాఁడే ధన్యుఁడు. పాండవులలో భీమాదులగు నల్వురకంటె దీనికి ఉదాహరణ మెవరుండఁగలరు? లక్ష్మణుఁడుకూడ యీ విష యములో ననుపమోదాహరణము. వనవాస సమయమున శ్రీరామచంద్రుఁడు పంచవటికిఁ బోయినప్పుడు లక్ష్మణునితో నిట్లనెను:- "సౌమిత్రీ! నీవు నీ కిష్టమున్నచోటు నొకదానిని వెదకి ఒక కుటీరమును నిర్మించుము." ఇదివినఁగానే లక్ష్మణుఁ డత్యంత భయపడెను. ఆతఁడు గడగడ వణఁకెను. ముఖము మ్లానమయ్యెను. ఆతఁడు దుఃఖముతో నిట్లనెను:- "రఘు నందనా! నా కిష్టమనున దెక్కడిది? నేను నా సర్వస్వమును నీచరణకమలములందు సమర్పించితిని. మీ రిట్టి కఠోరవచన మును బలుకుటకు నే నేమి యపరాధమును గావించితిని? "రాఘవా! నేను పరాధీనుఁడను. అనంత కాలమువఱకు నేను మీకధీనుఁడ నైతిని. నాకు స్వేచ్ఛఅనునది లేనేలేదు. మీరాజ్ఞాపించిన చోటఁ గుటీరమును నిర్మించెదను."

శ్లో॥ పరవానస్మి కాకుత్స్థ త్వయి వర్షశతం స్థితే,
స్వయం తు రుచిరే దేశే క్రియతా మితి మాం వద॥

— వాల్మీకి. ఆరణ్య. ౧౫ సర్గ. ౭ శ్లో.

(అర్థము పైనఁ గలదు.)

రాముఁడు సాధారణస్వభావముచేఁ జెప్పెను. లక్ష్మణుఁ డిట్లు పలుకఁగానే రాముఁడు నిరుత్తరుఁ డయ్యెను. ఆతనికిఁ బ్రత్యుత్తర మీయుటలేదు. అసలు దీనికి ప్రత్యుత్తరము లేనే లేదు. రాముఁ డా సమయమున వెల్లి యిట్లనెను:- "ఇది చక్కని స్థానము. ఇచ్చట కుటీరమును నిర్మించుము." ఇట్టి స్థితిలో మతభేద మేలకలుగునో యోచింపుఁడు? ఇదేవిధముగఁ బత్ని పతిచరణములందు తన సర్వస్వమును సమర్పించుచోఁ గలహ మెన్నటికినిరాదు. ద్రౌపది, సీత, సావిత్రి, దమయంతి మొదలగువారు దీని కుదాహరణములు. శిష్యుఁడు తన గురువున కాత్మసమర్పణము చేయునెడల నాతఁడు జనన మరణరూపమగు సంసారబంధమునుండి విడివడి సర్వోత్కృష్ట పదవి కధికారియగును. పరీక్షిన్మహారాజు దీనినే చేసెను. ఆతఁడు తన సర్వస్వమును శ్రీశుకుని పాదపద్మములకు సమర్పించెను. కావుననే ఆతఁడు పుణ్యశ్లోకుఁడుగను, పరమ భాగవతుఁడుగను, ప్రాతఃస్మరణీయుఁడుగను, మునులకుఁగూడ వందనీయుఁడయ్యెను. బీజము తన స్వరూపమును బోఁగొట్టుకొని మట్టిలోఁ గలిసినగాని యంకురించి, పుష్పించి ఫలింపదు.

పరీక్షిన్మహారాజు యథార్థమగు జిజ్ఞాసువు. యథార్థమగు జిజ్ఞాసువునకే నిజమగు గురువు లభించును. ఏదియో శిష్యునకు ధర్మమును బూర్తిచేయుటకని గురువై చెవిలో నేదియో ఊదవలెనని కోరిన వానికట్టి గురువే వ్యావహారిక వృత్తికలవాఁడే దొరకుచుండును. అన్నిటికి భావముఖ్యము. భగవానుఁడైనను నెవఁడే భావముతో భజించిన వానికట్టి దర్శనమే యొసంగుచుండును. శుకుఁడు సర్వజ్ఞుఁడు. ఆతఁడు

రాజు భావమును గ్రహించి, యున్మత్తావస్థలో నుండియు నుప దేశింప వచ్చెను. ఆతఁడు కనఁబడఁగానే పరీక్షిన్మహారాజు కూడ ఆ రెండు ప్రశ్నల నడిగెను. ఆ ప్రశ్నలివి:- ౧. సమస్త ప్రాణికోటికి సర్వోత్కృష్టమగు కర్తవ్యమేమి? ౨. మృత్యు వాసన్నమైనవాఁ డేమి చేయవలెను ? శుకుఁడు రాజును, రాజడిగిన ప్రశ్నను అభినందించెను. ఆతఁ డిట్లనెను:—

"రాజా! ఈ ప్రశ్నను నీవు లోకహితముకొఱకు అడిగితివి. అనఁగా నీ వెప్పుడు నీసర్వస్వమును శ్రీవాసుదేవుని చరణము లందును, గురుదేవుని చరణములందును సమర్పించితివో అప్పుడే నీవు కృతార్థుఁడ వైతివి. నీకు కర్తవ్యకర్మయును లేదు, అడుగవలసిన ప్రశ్నయును లేదు. ఇట్లు కృతకృత్యుఁ డైనవాఁడు కూడ జప, తప, మంత్రానుష్ఠాన, ప్రశ్న సంభాషణాది శుభకర్మల నొనర్చునెడల నది తనకొఱకు గాక లోకకల్యాణము కొఱకగును. ఇప్పుడు నీవడిగిన ప్రశ్న అడుగ వలసిన, వినవలసిన, విచారణ చేయవలసిన ప్రశ్నలన్నిటిలో సర్వశ్రేష్ఠమైనది. ఆత్మజ్ఞానులుకూడ దీనినిఁ బ్రశంసించెదరు"

ఇట్లని శ్రీశుకమహర్షి మొట్టమొదటి ప్రశ్నయగు "ప్రాణులకు సర్వకాలముల యందు సర్వోత్కృష్ట కర్తవ్య మేమి ?" యను ప్రశ్నకు సమాధాన మొసంగెను.

శ్రీశుకుఁ డిట్లనియె:- "రాజా! విషయ వాసనలను విడి పరతత్త్వ జిజ్ఞాసువులైనవారు వినవలసినవిషయ మొక్క టియే కలదు. విషయాసక్తులై మాయాజాలములోఁ జిక్కు కొనిన గృహస్థులు వినుటకుఁ జాల విషయములు గలవు. వాటికి లెక్కయే లేదు. పుట్టినది మొదలు వారు శరీర సుఖ

ముసే కోరుచుందురు. తల్లిదండ్రులు వారిని గొట్టుచుందురు. వారు హితవచనములు పలుకుచుండిన, వారు వాటిని వినక ఆటపాటల విషయము వినఁగోరుచుందురు. వారి చేష్ట లిట్లుండును:–'నేనే వేళ వానితోఁ బోరాడెదను; ఆటలో జయింతును; తోడివారినిగూడి దూరముగాఁ దోటలలోనికి ఆడఁబోవుదును; తోటలోని పండిన పండ్లను బాగుగాఁ దిందును; చింతకాయలు కోసి తెచ్చి పచ్చడిచేయించవలెను; గోధుమ, సెనగపిండి కలిపిన రొట్టెలపై మీగడ వేసికొని లొట్టలు వేసికొని తినవలెను; అమ్మ చూడకయే పెరుగుమీఁద మీఁగడతీసి పూసి, పైనఁ గొంచెము పంచదార వేసికొని రుచులూరఁదిందును; కాని బడికిమాత్రము పోఁగూడదు; ఒకవేళ మానాయన బడికేలపోలేదని యడిగినఁ దలనొప్పియని చెప్పెదను; పంతులెప్పుడు కొట్టుచుండును, వీఁడు చచ్చిన బాగుండు ననుకొనును; ఇఁక వచ్చు నుపాధ్యాయుఁడు కొట్టనివాఁడుగ వచ్చిన బాగుండును.' అని యీ విధముగ ఆటపాటలందాసక్తిగల పలుకులు బాల్యకాలమున వినఁగోరుచుందురు.

కొంచెము పెద్దవారుకాఁగానే యింతలోఁ దల్లిదండ్రులు పెండ్లిముచ్చట్లు చెప్పుకొనుచుందురు. ఆ మాటలు చెవిని సోఁకఁగానే హృదయముప్పొంగుచుండును. మాటిమాటికి కావార్తలే విన బుద్ధిపుట్టుచుండును. పెండ్లికుఁతురు నల్లనిదా, ఎఱ్ఱనిదా? యని విచారించుచుండును. ఇఁక వానితో జగడ మాడునది వచ్చెనా యింక నంతయుఁ బేడయు బెల్లమే. వచ్చిన పిల్ల మంచి చక్కనిది, లజ్జావతి, మనోనుకూలయై సమస్తకార్యములను జక్కపెట్టునదైన జీవితము సుఖమయ

మగును. ఆ యౌవనకాలమున సర్వదా ఆ పిల్లను గూర్చిన వివిధవిషయములను వినఁ గోరిక కలుగుచుండును.

పెండ్లాము కాపురమునకు రాఁగానే ఇఁక గృహచింత. ధన మెట్లు లభించును? అందఱికంటె నెట్లు భాగ్యవంతుఁడ నగుదును? అను చింత పట్టుకొనును. తనకు ధనము వచ్చిన సంగతియుఁ, దనకు వృత్తి లభించినసంగతియుఁ, దనకు భూమి లభించిన విషయము, వ్యాపారములో లాభమువచ్చిన వృత్తాంతమున్ను, నౌకరి ఖాయమైనదనియు — ఇట్టి విషయములు వినుటకు చెవులు కొఱుకుకొనుచుండును. ఇంతలో భార్యాభర్తలకుఁ బుత్రాపేక్ష కలుగును. పుత్రుఁడు కలుగుటకై జ్యోతిష్కునకు జన్మపత్రికను జూపించును. మంత్రజ్ఞులచే భూతప్రేత పిశాచములను బూజింపఁజేయును. రక్షరేకులు వేయించుకొనును. సంతానమునకై మందులు సేవించును. ఎట్లో పుత్రుడు పుట్టును. పుత్రజననవార్త వినుట, ధనైశ్వర్యప్రాప్తి విషయములనే విన బుద్ధి కలుగును.

మగపిల్లలు పుట్టినఁ జదివింపవలెనను చింతయు, ఆడపిల్లలు కలిగినఁ బెండ్లి పేరంటముల చింత కలుగుచుండును. పిల్లకు పెండ్లియీడు రాఁగానే యెక్కడ మంచిపిల్లవాఁడున్నాఁడని తెలిసిన నక్కడకు పరుగెత్తుకొని పోవలసినదే. ఒక సంబంధము బాగుండలేదనిన, నింకొకటి మంచిదనును. ఆ సమయమున వధూవరుల యీడుజోడులు మొదలగునవి యెన్నుటలోనే కాలము గడిచిపోవుచుండును. ఆ వార్తలలోనే ఆనందము కల్గుచుండును. మగపిల్లలయొక్కయు, నాడపిల్లలయొక్కయు పెండ్లిండ్లు కాఁగానే వారి భరణపోషణ చింత

కలుగును. 'ఇవ్వేళ యింటిలో నా వస్తువు లేదు ఈ వస్తువు లేదనియు; బియ్యము దొఱకుట లేదు, బండి విఱిగిపోయినది, ఎద్దు ముసలిదై నది; గుఱ్ఱము వీఁపుమీఁద గాయము పడినది; పెద్దదూడ పాఱిపోయినది; పొలములో మిడుతలదండు పడినది; బావిలో నీరు లేదు; అంట్లుతోముటకు పనిచేయు దాసి రాలేదు; జీతగాఁడు నౌకరి వదలిపెట్టి పోయినాఁడు; మంచినౌకరు దొఱకనే లేదు. లోకమంతయు స్వార్థపరమైనది. ధర్మకర్మములు లుప్తమైనవి. ఫలానివాఁడు నాకీయవలసిన బాకి ఈయనే యీయఁడు. ఈ పెద్దమనుష్యుఁడు యమదూత వంశములోని వానివలె నున్నాఁడు. ఎప్పుడు చూచినను జిఱచిరలాడు చుండును. వెళ్లు, నావద్ద రూపాయలు లేవని చెప్పుము. అవసరమైన దావా చేసుకొను మనును. ఆ మిత్రుఁ డెట్టివాఁడో చూడుఁడు? సమయమునకు మోసము చేసినాఁడు. మూఁడు రోజులనుండి చిన్నపిల్ల తిండి తిననే లేదు. ఈముసలి ముండాకొడు కెప్పుడును ఖహా ఖహా మని దగ్గుచుండును. చావనైనఁ జావఁడు. రోజున కిన్ని మందు లెక్కడనుండి తెచ్చి చచ్చేది? ఇంతటి గొప్ప యింటివాఁడు, పలుకరింపనైనఁ బలుకరింపఁడు. ఎవరైన దగ్గఱకుఁ బోయెనా ముఖము త్రిప్పుకొనును. సహానుభూతి యను మాటయే వానికి లేదు.' అని ఇట్లనుకొను చుండును.

భార్య యిట్లనును:- 'పిల్లకు సారె పెట్టవలెను అది ఒక యింటిదైనది. ప్రతిదినము సారెలు, చీరెలు, అన్నములు కూరలు పెట్టవలసి యున్నది. డబ్బు ఎక్కడ పుట్టుచున్నదో తెలియకున్నది. ఇవ్వేళ వారికి చాపులు

పెట్టవలెను. అచ్చటికి చీరెలు పంపవలెను. నామాట వినవే వినదు. "దానము విత్తము ననుసరించి చేయవలెను." ఇంటిలో నెలుకలు కుంది తినిన నిష్టమేకాని దానధర్మములు తోచనే తోచవు. ఈపండితులు పురోహితులుకూడ మాయాజాలురు. నేడు వ్యతీపాతము; ఇవ్వేళ సంక్రాంతి; నేడు సోమవతి. అని యిట్లు మూడువందల అఱువది దినములు ఏదో పర్వాదులు వ్రతములే. ఎంతవఱకని దానధర్మములు చేయుట? ఎవడైనను జచ్చుగాక బ్రదుకుగాక ఇవన్నియు గావలసినవే. పిల్లలకు పాలులేవు. వారికి క్షీరాన్నములు చేయవలెను. అనిన నాస్తికులందురు గాని ఈ కథకులు, పౌరాణికులు తలతోక లేకుండ మాట్లాడుచుందురు. ఇట్టి కథలు నాకిష్టముండవు. అక్కడ నృత్యగానము లెట్లుజరిగినవి! ఉపన్యాసకుడెట్టి ఉపన్యాసము నిచ్చినాడు! నవ్వి నవ్వి పొట్ట పగిలిపోయినది.'

కాబట్టి రాజా! ఈ సంసారు లీ చక్రములో నెల్లప్పుడును బడిపోవుచుందురు. నాకొక్క విషయమును జెప్పెదను, వీరందఱు రోజుకు లక్షలు, కోట్లకొలది మాటలు మాట్లాడుచుందురు, వినుచుందురు. ఆలోచించుచుందురు. వీరికి రాత్రి సమయము విషయోపభోగము లందును; నిద్రయందును గడుచుచుండును. పగలంతయు నది తెమ్ము, ఇది తెమ్ము. దానినిమ్ము, దీనిని దీసికొనుము. ఇవ్వేళ ఇన్నిరూపాయలు వచ్చినవి, ఇన్నిఖర్చైనవి. నేడు పిల్లవాని వివాహము, రేపు పిల్లపెండ్లి. ఎల్లుండి మనుమని జాతకర్మ, ఎల్లుండి నామకరణము. ఇంకెవరిదో చూడాకర్మ, అని యిట్టి విషయవ్యాపార

ములలోనే వీరికి కాలము గడుచుచుండును. కాని ఈ మూర్ఖులకు ప్రతిరోజును జనులు చచ్చుచుందురనియుఁ, దమయింటిలో నిల్లెందఱో పుట్టి చచ్చిరనియు నొకానొక దినమునఁ దాము కూడ చావఁగలరనియు వారికి తెలియదు. ఏ దారాపుత్రాదులందు తమకెంతటి మమకారము కలదో అట్టివారిని ఒకానొక దినమున వదలివేసి తాము వెళ్ళవలసియుండు ననియు, లేక తమముందే వీరు వెళ్ళిపోవలసియుండుననియు వారికిఁ దెలియదు. నానాఉపాయములచే సంపాదించిన ధన మొక్క గవ్వైన వెంటరాదు. ఈ ధన మెవరి దగ్గఱనుండి వచ్చినదో వారిదగ్గఱ నుండకపోఁగా నిఁక మనదగ్గ ఱేల యుండును? ఏ దేహము నింత మమకారముతోఁ బెంచితిమో, దేనిని బలియఁజేయుట కెన్నియో పాపము లొనర్చితిమో చివరకది యిచ్చటనే పడిపోవును; లేదా బూడిదై పోవును; లేక పురుగులు పడును; లేదా పశు పక్ష్యాదులు తినఁగాఁ జివరకు మలముగా మారిపోవును. కావున రాజా! అభయపదమును గోరువాఁడును, సాంసారిక భయము లన్నిటినుండి నిర్భయుఁడు కాఁగోరిన వాఁడును అన్నిటిని వదలి సర్వదా, సర్వత్ర సర్వేశ్వరుఁడగు శ్యామసుందర దివ్యనామగుణములను శ్రవణ కీర్తన స్మరణములు కావింపవలయును.

విశ్వమందు సమస్తమనీషులును, జ్ఞానులును, ధ్యానులును, విరక్తులును, శాస్త్రకారులును మనుష్యజీవనమున కంత్యకాలమున భగవత్స్మరణయే పరమపురుషార్థమని నొక్కి వక్కాణించియున్నారు. స్వధర్మాచరణము కావించినను జివరకు భగవత్స్మృతి లేకపోయెనా అదియంతయు

దంభమే కాఁగలదు. యోగసాధనముచే నంత్యకాలమున యోగేశ్వరుని స్మరింపజాలక పోయెనా, ఆయోగము కపట యోగమే కాఁగలదు. సాంఖ్యశాస్త్రమును నిరంతరము విచారించి నప్పటికిని చివరకు బ్రహ్మ సాక్షాత్కారము కాక పోయెనా, అదియొక వ్యసనము కాఁగలదు. కావున గోవింద గుణగానమున రమించుటయే మానవమాత్రుని ముఖ్య కర్తవ్యము.''

అంత రాజిట్లుప్రశ్నించెను:-''ప్రభూ! త్రిగుణాతీతులై, విధినిషేధాదిమర్యాదలు లేని జ్ఞానులుకూడ శ్రవణము, భగవన్నామ కీర్తనాదులు చేయవలసిన ఆవశ్యకతకలదా ?''

అంత శుకదేవుఁ డిట్లనెను:_ ''త్రిగుణాతీతులగు వారును, కర్తవ్యాకర్తవ్య విధినిషేధాదులు లేనివారును ఇట్టివి చేయవలయునని యెట్లు చెప్పఁగలము ? కాని, సాధారణముగ నిట్టి జ్ఞానులు, విరక్తులు, స్థితప్రజ్ఞులు నగువారు హరి గుణ గానమును, కృష్ణకథా కీర్తనమును నిరంతరము చేయు చుందురు. కర్తవ్యబుద్ధిచేఁ గాదు. వారు త్రిగుణాతీతులైనను స్వభావవశమున వానిలో నిమగ్నులగునంతటి మాధుర్యము గల్గునట్టివి భగవంతుని గుణములు. వాటిని వదలిన నిఁకఁ జేయఁగలిగిన దేమున్నది ?

కం. ధీరులు నిరపేక్షులు నా
త్మారాములునైన మునులు హరిభజనము ని
ష్కారణము సేయుచుందురు
నారాయణుఁ డట్టివాఁడు నవ్యచరిత్రా.

— శ్రీమదాంధ్రభాగవతము.

ఏదియును జేయక శరీర మొక్క నిమిషమైన నిలువఁ జాలదు. కావున నేనిప్పుడు నీకు శ్రీమద్భాగవత కథను వినిపించెదను.''

అంతఁ బరీక్షిన్మహారా జిట్లనెను:- ''స్వామీ! మీరు వినిపింతుననిన శ్రీమద్భాగవత సంహిత, అష్టాదశపురాణముల వంటి యొక పురాణమా లేక వీటికంటె విశేషత యేమైనఁ గలదా? మీ రీ సాత్వత సంహిత నెప్పుడు వింటిరి? ఎక్కడ వింటిరి? ఎవనివలన వింటిరి?''

పరీక్షిన్మహారాజు ప్రశ్నను విని శ్రీశుకుఁ డిట్లు ప్రత్యుత్తర మొసంగెను:- ''రాజా! ఈ భాగవతశాస్త్రము కేవలము పురాణమే కాదు. వేదములవలె నిది మాననీయమైనదియు, నాదరణీయమైనదియునై యున్నది. ద్వాపరాంతమున గంధమాదన పర్వతముమీఁద నేను నాతండ్రియగు వేదవ్యాసుని ఆశ్రమమున వారిద్వారానే సర్వశ్రేష్ఠమగు నీసంహితను చాల పరిశ్రమచేసి చదివితిని.''

ఇది విని పరీక్షిన్మహారాజు చేతులు జోడించుకొని వినయభావముతో నిట్లడిగెను:- ''ప్రభూ! మీరు పుట్టుకతోడనే త్యాగులు, విరాగులనియు, నుపనయన సంస్కారము జరుపఁబడకమునుపే, పుట్టఁగానే అరణ్యములకుఁబోయి యుంటిరనియు, మీరెల్లప్పుడు నిర్గుణపరబ్రహ్మనిష్ఠయందే యుందురనియు వినియుంటిమి. అట్టి మీరింత గొప్ప భక్తిశాస్త్ర గ్రంథమును జదువవలసిన యవసర మేలకలిగెను? మీ రే విధివాక్య ప్రేరితులై దీనిని జదువుటయందు ప్రవృత్తులరైతిరి? దయయుంచి నా యీ శంకకు సమాధాన మీయవలయును.''

ఇది విని శుకమహర్షి నవ్వి యిట్లనెను:- "రాజా! నేను విధినిషేధముల కతీతుఁడను. నే నే విధివాక్యమునకు నధీనుఁడనై దీనిని జదువలేదు. నేను నిర్గుణబ్రహ్మలో విలీనుఁడనై యుండుననుటయును సత్యమే. నేనును వివశుఁడనై భగవల్లీలలయం దాకర్షింపఁబడుటకు వానిలో నంతటి మాధుర్యము కలదు. మా తండ్రియగు వ్యాసమహర్షి యొక్క శిష్యుల ముఖతః భగవంతుని యనుపమ సౌందర్య, మాధుర్యమును విని, యాతని యహైతుక మహిమను శ్రవణము కావించి, నా మనస్సు స్వతః ఈ లీలలు వినుటకును, బఠించుటకు నాకర్షింపఁబడి, చదువకుండ లేకపోయితిని. చదివి నేనానందసాగరమున మగ్నుఁడనై అటునిటు దిరుగుచుందును. నేఁ డవసరమును గ్రహించి స్వతః నీ సమీపమునకు వచ్చియుంటిని. ఆ భాగవత శాస్త్రమునే నేఁడు నీకు వినిపించెదను. ఏలననఁగా నీవే నాకు ఉత్తమాధికారివిగాఁ గనఁబడితివి. నీవు పరమ పురుషార్థ దీక్షను గైకొనఁగోరుచుంటివి. నీలో సామర్థ్యమున్నది. శ్రవణముచేయుటకు ఉత్కటాభిలాషకూడ కలదు. ఎవరీకథను శ్రద్ధతో వినెదరో, విని భక్తిపూర్వకముగ దీనిని మననము చేయుదురో, వాని కతి శీఘ్రకాలముననే వాసుదేవ భగవానుని చరణారవిందములందు అహైతుక, అనన్యప్రేమ భక్తి కలుగుననియు, వాని మతి మదనమోహనుని మాధురిలో మునుగఁగలదనియు నేను దృఢముగాఁ బ్రతిజ్ఞాపూర్వకముగఁ జెప్పఁగలను.

ఎవరీ యిహలోక పరలోకభోగములందు వైరాగ్యము చెందియుండిరో, అభయపదమును గోరు యోగులుకూడ

భగవన్నామ సంకీర్తనము చేయవలయునని నేను అనుభవ పూర్వకముగ దృఢముగఁ జెప్పఁగలను. నిరంతరము భగవత్కథాశ్రవణము సేయుటయు, సదా మనో వాక్కులతో భగవన్నామ కీర్తనము గావించుటయు, ఈ రెంటికిని మించిన శ్రేష్ఠకార్యము, ఉత్తమోత్తమ సాధనము లేదు. రాజా! ఇదియే పరమ పురుషార్థము. ఇదియే అంతిమ సాధ్యము. ఇదియే చరమ స్థితి. తనమనస్సును గథాకీర్తనములందు లగ్నము కావించినవాఁడు ధన్యుఁడైనట్లే; కృతార్థుఁడైనట్లే; వానికిఁ గర్తవ్యశేషమింక లేదు. ఇదియే సర్వమానవులకు సర్వదా సర్వోత్కృష్ట కర్తవ్యము.''

సూతుఁడు శౌనకాదిమునులతో నిట్లనెను;- ఋషులారా! ఈవిధముగ నాగురుదేవుఁడు పరీక్షిన్మహారాజుతో దృఢముగాఁ జెప్పి యూరకుండెను. రాజత్యంత విస్మయముతో నాతని శ్రీముఖమును జూచుచుండెను. ఇప్పుడాతని ప్రశ్నలో రెండవభాగమగు 'మృత్యువత్యంత సన్నికటమైనప్పుడు అట్టి వానికిఁ గర్తవ్యమేమి' యనుప్రశ్నకు సమాధానమును విన వలెనను గుతూహలము కలిగెను.

ఛప్పయ.

హై ప్రపంచ బహు విషయ భోగ మహఁ ఫఁసే నరానకూఁ।
హరి లీలా తేఁ సుఖద ఔర అవలంబ నహిన కూఁ॥
ఆశ్రిత అతి భయో రూప హరి లీలా సుని కేఁ।
భూల్యో నిర్గున బ్రహ్మ సగున కే గునకూఁ గుని కేఁ॥
భవ్య భాగవత భూపవర! తుమహిఁ సునావహుఁ సరస అతి।
సునత శ్యామ పదకమల మహఁ, హోఁహి తురంత అనన్యమతి॥

అర్థము.

ప్రపంచము బహువిధములగు విషయభోగములతోఁ గూడినది. అవి నరుని మోహపెట్టి ముంచివేయును. హరి లీలలు సుఖకరములు. మనస్సునకు వేఱొక యవలంబనము లేదు. హరిలీలలను వినఁగానే నామనస్సు మిక్కిలి ఆకర్షింపఁ బడినది. సగుణబ్రహ్మ గుణగణములను వినఁగానే నిర్గుణ మును మఱచితిని.

ఓ రాజా! నీకు మిక్కిలి సరసముగ భవ్యభాగవత మును వినిపించెదను. శ్యామసుందర చరణారవింద మహిమను విని నీవనన్యమనస్కుఁడవు వెంటనే కాఁగలవు.



# సమయసన్న్యాసతకు ఖట్వాంగరాజర్షి దృష్టాంతము

౧౬

శ్లో॥ ఖట్వాంగో నామ రాజర్షి ర్జ్ఞాత్వేయత్తా మిహాయుషః।
ముహూర్తా త్సర్వ ముత్సృజ్య గతవానభయం హరిమ్॥
తవాప్యేతర్హి కౌరవ్య సప్తాహం జీవితావధిః।
ఉపకల్పయ తత్సర్వం తావద్యత్సాంపరాయికమ్॥

— శ్రీభాగ. ౨ స్క. ౧ అ. ౧౩, ౧౪ శ్లో.

"కం. గోవింద నామకీర్తనఁ
గావించి భయంబు దక్కి ఖట్వాంగ ధరి
త్రీవిభుఁడు సూర గొనియెను
గైవల్యముఁ దొల్లి రెండు గడియలలోనన్.

వ. వినుము. నీకు నేఁడుదినంబులకుంగాని జీవితాంతంబు గాదు. తావత్కాలంబునకుం బారలౌకిక సాధనభూతంబగు పరమ కల్యాణంబు సంపాదింపవచ్చు.'' —శ్రీమదాంధ్రభాగవతము

ఛప్పయ.

అల్పకాల కీ కభూ ఆప చింతా నహీఁ కరిహైఁ।
సాత దివస తో బహుత కథా సుని ఛిన మహఁ తరిహైఁ॥
ఏక ముహూర్తహి మాఁహి తరే ఖట్వాంగ విరాగీ।
శేష ఆయు సప్తాహ ఆప తో సరబసు త్యాగీ॥
అంతకాల కూఁ నికట లఖి, గేహ దేహ మమతా తజహీఁ।
తే ధ్రువ పావహిఁ పరమ పద, జే సబ తజి ప్రభుపద భజహిఁ॥

అర్థము.

పరీక్షిన్నరేంద్రా! అల్పకాలమే వ్యవధి కలదని నీవు చింతింపవలసిన పనిలేదు. ఈ యేడుదినములలో ననేకములగు కథలను విని భవసాగరమును దాఁటఁగలవు. ఒక్క ముహూర్తములో వైరాగ్యముచే భగవంతుని భజించి ఖట్వాంగుఁడు తరించెను. నీ కేడుదినము లాయువు కలదుగదా! నీవు సర్వస్వమును త్యజించి, అంత్యకాలము సమీపించినదని తెలిసికొని దేహ గేహములందు మమత్వమును వీడి, ప్రభువును భజించి ధ్రువమగు పరమపదమును బొందఁగలవు.

---

చెప్పిన విషయములను అందఱు వినుచునేయుందురు; కాని వాటిపై విశ్వాసము కలుగుటచేతనే అవి సిద్ధింపఁగలవు.

మంత్రమందును, అనుష్ఠానమందును, ఔషధమందును, శుభ కర్మలందును భావనయే ప్రధానముగ నెన్నఁబడుచున్నది. తన సాధనయందు పూర్ణవిశ్వాసము కలవాఁడే యితరులకుఁ గల్యాణము కావింపఁగలఁడు. తాను తన సాధనయందు విశ్వాసముంచక, దాని నాచరింపక, యితరులకు దానిని జేయ వలసినదని చెప్పువాని యుపదేశములవలన నేమియుఁ బ్రయో జన ముండఁజాలదు. అది అరణ్యరోదనమువలె, యంత్రములోఁ బాడిన పాటవలె ప్రభావహీనమై పోవును. శుకున కాతని సాధనముపై విశ్వాసము కలదు. ఈ భాగవత శాస్త్రమును వినువానికిఁ దప్పక ముక్తి కలుగునని ఆతనికి దృఢవిశ్వాసము కలదు. కావున నాతఁడు పరీక్షిన్మహారాజు తగిన యధికారి యని తెలిసికొని స్వయముగనే తాను వినిపించుటకుఁ బూనుకొని ప్రస్తావించెను. పరీక్షిన్మహారా జిట్లనుకొనెను:- "ఈతఁడేదో కథను జెప్పుచుండ నేనా కథలో మునిఁగి యుంటినా, ఇంకేవిధమగు నుచ్చ పరమార్థసాధనమును జేయ లేక పోవుదును. అట్టియెడ నాకు ముక్తికలుగుట సందేహామే కాఁగలదు. వ్యవధియూ చాల తక్కువగా నున్నది. ఈతఁడు నన్ను భాగవతము వినుమనుచున్నాఁడు" అని యిట్లుయోచించు కొని యిట్లనెను:- "ప్రభూ! కాలవ్యవధి చాల తక్కువగా నున్న సంగతిని గాంచి నాకు సర్వోత్తమమగు నుపదేశము నొసంగుఁడు. ఇంతకు ఉన్నగడువు ఏఁడుదినములు. ఏడు దినములలో నేజీవియైన మృత్యువును బొందవచ్చును. కాని నాకు యథార్థముగ సరిగా నేఁడు దినములు మాత్రమే ఆయుస్సు కలదు."

ఈ వాక్యములను విని శుకుఁడు నవ్వి యిట్లనెను:- "రాజా! ప్రపంచములో విషయాసక్తులగువారు చిరకాలము జీవించుచుందురు. వారు బ్రదికినఁ బ్రయోజన మేమికలదు ? రోజులు ఏడ్పులు పెడబొబ్బలతో గడచిపోయెను. ఎంతయో శుద్ధాన్నజలములను మలమూత్రములుగ నొనర్చినాఁడు. కుక్క, పందివలె సంతానము నెంతయోకని, వారినిఁ బోషింపను లేకున్నాఁడు. దినమంతయు సత్యాసత్యములను బలుకుచు లోకులను మోసగించి, పొట్టపోసికొనుచుండును. రాత్రులందు దుప్పటి ముసుఁగు పెట్టుకొని పరుండును. పడుచువాఁడయ్యెను, ముసలితనము వచ్చెను, చచ్చిపోయెను. చెట్టయినను చిరకాలము బ్రదుకును. కాకిని ఎవఁడైనఁ జంపువఱకు చావనే చావదని వింటిమి. లేచినది మొదలుకొని దానికి క్రుళ్లు మీఁదనే దృష్టి. ఒంటి కంటితో నంతయుఁ జూడఁగలదు. ఎవని జీవితమునకు సాధన భజనము లేదో, కథాకీర్తనాదులు లేవో, రాత్రింబవళ్లేవఁడు ఉదరసేవ, విషయభజనము చేయుచుండునో, అట్టివాఁడు పదిసంవత్సరములు బ్రదికినను, నూఱు సంవత్సరములు బ్రదికినను ఆహార నిద్రా భయ మైథునాదులందే వారికి కాలము గడిచిపోవును. కాని మానుషదేహమును ధరించిన వానికి యథార్థముగు కర్తవ్యమేమో తెలిసికొని, విషయభోగములు అనిత్యములు, నాశవంతములు, క్షణభంగురములనియు, సంసారమున ముంచునవి యనియుఁ దెలిసికొని, వాటిని బరిత్యజించి శ్రీహరి చరణారవిందములందు చిత్తమును లగ్నముకావించినవాని జీవిత మొక్కముహూర్తమైనను జాలును. ఆ కొలఁది కాలములోనే వారు తమ

కల్యాణమును గావించుకొనఁగల్గుదురు. ఈవిషయమునుగూర్చి మీకు నేనత్యంత సుందరమగు నుపాఖ్యానమును వినిపించెదను. మీరు దీనిని సావధానులరై వినుఁడు.

సూర్యవంశమున ఖట్వాంగుఁడను ప్రతాపవంతుఁడగు రాజర్షి యుండెను. ఆతఁడు గొప్ప శూరుఁడును, వీరుఁడును, దాతయు, యశస్వియు, ధర్మపరాయణుఁ డగు నవనీపతి. ఆ సమయమున నాతనితో సమానుఁడగు ధనుర్ధరుఁడును, బలియు నా సమయమున నెవ్వఁడును లేకుండెను. ఒక సమయమున దైత్యదానవులు దేవతలపై దండెత్తిరి. దేవతలపక్షము నిర్బలమయ్యెను. దైత్యపక్షము ప్రబలమయ్యెను. అప్పుడు దేవతలు చాల చింతఁజెంది మర్త్యలోకమునకు వచ్చి, తమ పక్షమున దైత్యులతో యుద్ధము చేయవలసినదని ఖట్వాంగ మహారాజును ప్రార్థించిరి. రాజెల్లప్పుడు యుద్ధమునం దుత్సాహము చెందియుండెను. ఆతఁడు వెంటనే ధనుర్బాణములను ధరించి, దివ్యరథారూఢుఁడై దేవతలతోఁగూడి సమరస్థలమునకుఁ బోయెను. అచ్చటికిపోయి దైత్యుల గుండె లదరునట్లు ఘనఘోరయుద్ధమును గావించెను. ఖట్వాంగుని బాణప్రహారములచే దైత్యదానవులెల్లరు వ్యథితులై రణరంగమును వీడి దశదిశలకుఁ బారిపోయిరి. యుద్ధమునుమాని పారిపోవు శత్రువులను వెంటాడుట ధర్మవిరుద్ధమని గ్రహించి రాజు వారి నుపేక్షించెను. దేవతలకు విజయము లభించెను. అంత దేవతలందఱును, దేవేంద్రుఁడును ఖట్వాంగమహర్షిపైఁ బ్రసన్నులై ఆతనిని బ్రశంసించుచు నిట్లనిరి:- "రాజా! నీకు సాటియగు శూరవరుఁ డీలోకమున లేఁడు. నీవు మమ్ముల నీ ఘోరసంక

టమునుండి రక్షించితివి. మేము నీయెడల నత్యంత ప్రసన్నుల మైతిమి. కావున నీవు మమ్ములను నీ యిష్టమువచ్చిన వరమును గోరుము.''

ఖట్వాంగమహారా జిట్లనెను:- ''దేవతలారా! మీ రందఱు దేవలోకములో నివసించుచు దివ్యభోగము లనుభవించు పరమ పుణ్యాత్ములకు. యజ్ఞయాగాది సమస్త శుభకర్మలు మీ ప్రసన్నతకొఱకే చేయఁబడుచుండును. అట్టి మీరు నాయెడల బ్రసన్నులరైతిరి. ఇంతకంటె నాకుఁ గావలసిన వరమేమున్నది? మీయందఱు ప్రసన్నులైన నాకదియే చాలును.''

అంత దేవతలు బలవంతము చేయుచు నిట్లనిరి:- ''కాదు మహారాజా! ఏదైనఁ గోరితీరవలయును. మేమునీకుఁ బ్రత్యుపకారము అవశ్యము చేయదలచినాము.''

దేవతలింతగా బలవంతపెట్టుటను గాంచి మహారాజు చాలసేపు ఆలోచించి వారితో నిట్లనెను:- ''దేవతలారా! దేవేంద్రా! నా యాయువింకెంత కాలము కలదో ముందుగాఁ దెలిసికొనఁ గోరుచున్నాను. నాయాయుశ్శేషమును దెలిసికొనియే నేను మిమ్ముల నేదైన నడుగఁబూనుకొన్నాను.''

ఇది విని పురందరుఁ డిట్లనియె:-''రాజా! నీయాయువు సమాప్తమైనది. ఇంకొక ముహూర్తకాలమే నీకింక ఆయువు కలదు.''

ఇది వినఁగానే రాజర్షియగు ఖట్వాంగుఁడు సావధానుఁ డయ్యెను. అతఁ డిట్లనెను:- ''దేవతలారా! నేనిప్పు డడుగ

వలసిన దేదియును లేదు. నేను ఇహపరలోకములలోని భోగముల నన్నిటిని దుచ్ఛముగఁ దలపోయుచున్నాను. నే నిప్పుడు విషయములలో దిగఁబడను. ఇంద్రియ సుఖములను యాచింపను. మరల తిరిగి రానట్టిదియు, దుఃఖాభావము కలిగినట్టియు నగు భగవంతుని పరమధామమును బొందఁ గోరుచున్నాను.'' ఇట్లని మహారాజు భగవద్ధ్యానమందు నిమగ్నుఁడై, ఒక్క ముహూర్తములోనే సమస్త విషయ భోగాభిలాషను మానసికముగాఁ ద్యజించి శ్రీహరియొక్క నిర్భయపదమును బొందెను. కావున రాజా! నీకింక నేఁడు దినము లవధి కలదు. ఈ యేఁడు దినములలో నీవు ఉద్ధరింపఁ బడు నుపాయమును జూచుకొనుము. ఈలోగానే పరమపద ప్రాప్తికి అధికారివి కమ్ము.''

శుకుఁడు పలికిన ఇట్టి సాంత్వనాపూర్ణమగు వాక్కులను విని పరీక్షిన్మహారా జిట్లడిగెను:- ''బ్రాహ్మణోత్తమా! మీరు సంక్షేపముగ సర్వసాధారణులకు సర్వకాల సర్వావస్థలయందును భగవన్నామ గుణకీర్తనము చేయవలసినదని యుపదేశించితిరి. అత్యంత సమీపములో మృత్యువాసన్నమైనపుడు, అట్టివాఁడేమి చేయవలయునో వినఁగోరుచున్నాను. వాఁడు చేయవలసిన దానిని విస్తారపూర్వకముగ వర్ణింపుఁడు.''

పరీక్షిన్మహారాజు అడిగిన ప్రశ్నను విని శ్రీశుకమహర్షి యిట్లు పలికెను:- ''రాజా! తనకు మృత్యు వాసన్నమైనదని తెలిసికొనినవాఁడు, మునుముందుగా వాఁడు వాని శరీర మోహమును, శరీరమునకు సంబంధించిన దారా ధన కనక వస్తువాహన క్షేత్రాదు లన్నిటియందు మోహమును ద్యజింప

వలయును. వైరాగ్యమను ఖడ్గముతో దృఢమగు మోహ జాలమును ముక్కలు ముక్కలుగా గోయవలయును. అన్నిటి మోహమును వీడి, సంబంధుల మమకారమును బోనడచి యింటినుండి బయలుదేఱివచ్చి, ఏదైనఁ బుణ్యతీర్థమందుగాని, గంగాది పుణ్యనదీ తీరములందుఁగాని ఆసనము వేసికొని కూర్చుండ వలయును ''

ఇది విని పరీక్షిన్మహారా జిట్లనెను:- ''బ్రాహ్మ ణోత్తమా! ఇంటిలోనే ఉండి భగవంతునియందు చిత్తమును లగ్నము చేసిన నేమి హాని ?''

శుకుఁ డిట్లనెను:- ''హాని యేమియును లేదు. భగవ ద్ధ్యాన మెక్కడచేసినను శ్రేయస్కరమే. కాని యెల్లప్పుడును గన్నులయెదుట సంబంధులును, బరివారమును ఉండుటచే స్వభావానుసారముగ మోహము కలుగుచునే యుండును. ఒకవేళ మరణసమయమునఁ బొరపాటునచేనైనఁ బరివారము నందు చిత్తము లగ్నమయ్యెనా, మరల వారిలోనికి వచ్చి పుట్టవలసినదే. ''అంతే యా మతిః సా గతిః'' అంత్య కాలమున మతియెంతయో గతియు నంతే. ఈ పరివారమును వివశతాపూర్వకముగా నెప్పటికైన వదలవలసియుండ, స్వేచ్ఛతో మొట్టమొదటనే, మృత్యువాసన్నము కాక పూర్వమే, వీరి నేల పరిత్యజింపఁ గూడదు? అట్లు పరిత్య జించుటయే యుత్తమమగు కార్యము. పుణ్యక్షేత్రములలో స్వభావముచేతనే శుభసంస్కారములుండును. అనంతకాలము నుండియు నసంఖ్యాకులగువారు వాటియెడల విశుద్ధభావనకలిగి యుండుటచేతను, అచ్చటి వాయుమండలము సత్సంస్కారము

లచే విశుద్ధమగును. గొప్పగొప్ప వారందఱు అంత్యకాలమునఁ బ్రయాగాది పుణ్యక్షేత్రములను, గంగా మొదలగు పుణ్య పావన స్రవంతుల నాశ్రయించిరి. చూడుము, నీవుకూడ నీ సమస్త రాజ్యవైభవమును బరిత్యజించి అంత్యకాలమునకు గంగాతీరమునఁ గూర్చుంటివి. నీకెవరు నిట్లు చేయుమని చెప్ప లేదుగదా! నీపూర్వు లెట్లు చేసిరో నీవును వారి ననుసరించితివి.

మంచిది, గృహమునువీడి పుణ్యతీర్థమునకు రాఁగానే అచ్చట విధ్యుక్తముగ స్నానము కావించి, శాస్త్రములలోఁ జెప్పఁబడినట్లు కుశాసనమునుబఱచి, దానిపై కృష్ణమృగచర్మ మును, దానిపై వస్త్రమునుబఱచవలయును. మృగచర్మముపై వస్త్రమును పఱచనంతవఱకది కూర్చుండ యోగ్యమైనది కాదు. ఈవిధముగ నాసనమునుబఱచి, దానిపై సిద్ధాసనము, పద్మాసనము, స్వస్తికాసనము వీనిలో నేయాసనముపైనైనఁ గూర్చుండవలెను. తర్వాతఁ బ్రణవము లేక యింకొక భగవ న్నామమును గాని జపము చేయవలయును. ప్రాణవాయువును స్వాధీనములోఁ బెట్టుకొన వలెను; కాని యా అక్షరబ్రహ్మను విస్మరింపఁగూడదు.'' ఇట్లు చెప్పి, రాజడడుగఁగా శ్రీశుకుఁడు ధ్యానవిధిని జెప్పెను.

సూతుఁడిట్లనెను:- ''మునులారా! ఇఁక నేను కథా భాగమును వర్ణింపఁబోవుచున్నాను. శ్రీశుకుఁడు పరీక్షిన్మహా రాజ సమ్ముఖమునఁ జేసిన ప్రభావోత్పాదకమగు సజీవ ధ్యాన వర్ణనమును నేను ప్రసంగానుసారముగ మీా సమ్ముఖమున వినిపించెదను. ఈ సమయమున మీారీ కథాప్రవాహమును బోసింపుఁడు.''

శౌనకుఁడిట్లనెను:– "సూతా! మీయిష్టమువచ్చినట్లు చేయుఁడు. మేమందఱమును వినుటకు మీముందు కూర్చుండి యున్నాము. మీకెట్లు ఉచితముగఁ దోఁచిన నట్లు వినిపింపుఁడు."

సూతుఁ డిట్లనెను:– "మునులారా! ముందుగా కథాభాగమును జెప్పి, తర్వాత ధ్యాన, భక్తి విషయములను జెప్పుటే సమంజసమని తోఁచుటచే అట్లు చేసెదను."

ఇట్లు చెప్పి, సూతుఁడు తర్వాతప్రసంగము చెప్పుటకుద్యుక్తుఁడుకాఁగానే శౌనకుఁ డేదియో చెప్పబోఁగా సూతుఁ డాగెను.

ఛప్పయ.

జీవన ధన బిను జీవన జీవన నహీఁ కహావే।
భక్తి హీన నర మృతక సరిస హైవ్వో కాల బితావే॥
ఖావేఁ సోవేఁ లడేఁ వృద్ధ బని యమపుర జావేఁ।
బార బార తే జనమి జగత మేఁ జావేఁ ఆవేఁ॥
కోటి కల్పకో కాలహూా, భక్తి బినా బేకార హై।
ఛిన భరి హరి హియ మేఁ బసై సోహి సమయ సుఖసార హై॥

అర్థము.

జీవనధనము లేక జీవనము జీవనమని చెప్పఁదగదు. భక్తిహీనుఁడగు నరుఁడు మృతునివలెఁ గాలమును గడుపుచుండును. వానికి తినుట, నిద్రించుట, పోరాడుట చివరకు ముసలివై యమసదనమునకుఁ బోవుట పనులు. అతఁడు మాటిమాటికిఁ బుట్టుచుఁ జచ్చుచుండును.

కోటికల్పములు జీవించినను భక్తి వినా వాని జన్మ వృథా కాఁగలదు. ఒక్క క్షణకాలము హరి హృదయమున నుండినను ఆ సమయము సుఖసారమైనది.



# భాగవత కథనుగూర్చి పునీత ప్రశ్న

## ౧౨

శ్లో॥ అథాభిధేహ్యంగ మనోఽనుకూలమ్
ప్రభాషసే భాగవత ప్రధానః।
యదాహ వైయాసకిరాత్మ విద్యా
విశారదో నృపతిం సాధుపృష్టః॥

—శ్రీభాగ. ౨ స్కం. ౩ అ. ౨౫ శ్లో.

క. వరతాత్పర్యముతో నిటు
భరతాన్వయ విభుఁడు శుకుని పలుకులు విని స
త్వరతాయుతుఁడై శ్రేయ
స్కరతామతి నేమి యడిగె గణుతింపఁగ దే.

క. ఒప్పెడె హరికథ లెయ్యవి
సెప్పెడినో యనుచు మాకుఁ జిత్తోత్కంఠల్
గుప్పలు గొనుచున్నవి రుచు
లుప్పతిలన్ నీమనోహరోక్తులు వినఁగన్.

—శ్రీమదాంధ్రభాగవతము.

ఛప్పయ.

సూత! సునా ఓ సుఖద పరీక్షిత్ శుక ప్రశ్నోత్తర।
జహాఁ సంత జన మిలహిఁ తహాఁ సంబాద హోయ వర॥
గంగ యమున మిలి హరేఁ మహాపాతక హూ భారీ।
తైసే హీ శుక విష్ణురాత వార్తా అఘహారీ॥
కేవల కృష్ణకథా సదా, శ్రవనని కూఁ శ్రవనీయ హైఁ,
కరేఁ కృష్ణ కైంకర్య కూఁ, తే హీ కర కమనీయ హైఁ॥

అర్థము.

శౌనకుఁడిట్లనెను:- సూతా! పరీక్షిచ్ఛుక ప్రశ్నోత్తర సంవాదమును వినిపింపుము. సాధువు లెచ్చట సమావేశ మగుదురో అచ్చట యుత్తమ సంవాదము జరుగుచుండును. గంగాయమునలు కలిసి ఘోరాతిఘోర పాతకములను హరించి నట్లు, శుక పరీక్షిద్రాజ సంవాదము మహాపాతక నాశనకరము కాఁగలదు.

కేవలము కృష్ణకథలే శ్రవణములకు శ్రవణీయమైనవి. శ్రీకృష్ణకైంకర్య మొనర్చిన కరములే నిజమగు కరములగును.



ఎవని కేవస్తువునం దత్యంత ప్రీతియుండునో వానికి దానినెంత యనుభవించినను దృప్తికలుగదు. అట్లుకాకున్నచో మాదకవస్తు సేవనము చేయు వ్యసనముకలవాఁడా దేవస్తువు నింత వ్యగ్రతతో నేల సేవించును? ఎవని కే శాకము, ఏభక్ష్యము, ఏ చేదుపదార్థమో - ఏపదార్థమం దత్యంత ప్రీతియుండునో, వాఁడది నిత్యము తినుచుండును. అట్లు తినుచున్నను వానికి

దానియందు కోరిక యుండనే యుండును. అట్లు కాకున్న వృద్ధాప్యమున సమస్తేంద్రియములు శిథిలము లగుటచే నందఱు విరాగులు కావలసియుండును. కాని అట్లు జరుగుట లేదు. పదార్థములను భోగించు సామర్థ్యము లేకున్నను జివరవఱకు దానియందు తృష్ణ యుండనే యుండును. ఒక్కసారి ఒక్కవస్తువుయొక్క రుచినిఁ జూచిన మీఁదట, దాని రుచిలో మునిఁగినవాఁడు, మరల దాని ప్రసంగము వచ్చి నప్పుడు శరీరమున నొకవిధమగు బులకరింపుకలిగి మరల దాని ననుభవింప నిచ్ఛవొడమును. అనిత్యము, అసుఖము, క్షణ భంగురములగు పదార్థములందే యిట్టి ఆసక్తి కలుగు చుండఁగా నిత్య, శాశ్వతములగు శ్రీహరి లీలా, కర్మ, గుణ ములలోఁగల అత్యంత మాధుర్యమును, అపూర్వరసమును ఒక్కసారి చవిచూచినవాఁడు మరల వాని నెట్లు వదలఁగలఁడు? అచ్యుతుని యమల, విమల, నిర్మల కథలను వినుట కభ్యాస పడినవాఁడు సాంసారిక మాదక ద్రవ్యసేవకులవలె సదా శ్రీకృష్ణకథా సుధారసమునుగ్రోల వ్యగ్రుఁడై యుండును. శ్రీకృష్ణకథాశ్రవణము చేయని దినము వానికి వ్యర్థదివసముగఁ దోఁచును. పదార్థమదియే యైనప్పటికిని నిత్యతృష్ణా వాసనా కారణమున దానియందు నిత్యనూతనస్వాదు కలిగినట్లు శ్రీకృష్ణకథలు నవియే యైనప్పటికిని వినినకొలఁది నిత్యనూతనములై భక్తుల కతృప్తిగనే యుండును. అవే అవతారములు. ఆచరిత్రలే, ఆలీలలే అన్నియు వేదపురాణేతిహాస ధర్మశాస్త్రాదులలో మరల మరల వచ్చుచునే యున్నను ఎందులకోగాని భగవద్భక్తులు వానినెంత వినినను దృప్తి

చెందరు. ఇందువలననే శ్రీ శుకమహర్షి మునుముందుగాఁ బరీక్షిన్మహారాజుకు సర్వకాలములందును, సమస్తమానవులకును గర్తవ్యకార్య మేమియో వచించెను. తర్వాతఁ జావఁ బోవువాఁడు వైరాగ్యమును ధరించి యేవిధముగ గృహత్యాగమును గావించి తీర్థక్షేత్రమునకు వెళ్లి, అచ్చట యెట్లుండవలసినదియు నిరూపించెను. తర్వాత భగవద్ధ్యాన విధానమును, విరాడ్రూపవర్ణనమును గావించెను. ఆపిమ్మట సద్యోముక్తి క్రమముక్తినిగూర్చి చెప్పెను. ఆమీఁదట భిన్న భిన్నములగు కోరికలచే భిన్నభిన్న దేవతల నెట్లుపాసింపవలసినదియు వర్ణించుచు, భగవద్భక్తి ప్రాధాన్యతనుజెప్పి చిట్టచివర కిట్లుచెప్పెను:- " ఏ కృష్ణకథా శ్రవణముచే సత్త్వ, రజ, స్తమోగుణములచే నుత్పన్నమైన అనంతతరంగములు స్వతః శాంతించిపోవునో, వాటిని శ్రవణము చేయుటచే నధ్యాత్మప్రసాదోపలబ్ధి కలిగి మానవుఁడు గుణాతీతుఁడగును; మఱియుఁ గైవల్య మోక్షమును భగవద్భక్తియు సిద్ధించును. కమనీయములగు నాకృష్ణకథలు శ్రద్ధాభక్తులతోవినని క్రూరుఁ డెవఁడుండును ? "

ఇదివిని శౌనకుఁడిట్లడిగెను:- "మహాభాగా! సూతా! శుకుఁడిట్లు చెప్పఁగాఁ బరీక్షిన్మహారా జేమని ప్రశ్నించెనో త్వరగా చెప్పుము. దానికి శుకుఁ డెట్టి ప్రత్యుత్తర మొసంగెను? వారిద్దరకును జరిగిన సంభాషణమును నీవు మాకు ఆనుపూర్వికముగఁ జెప్పవలయును. వా రిద్దరి సంవాదమును వినవలెనని మాకిద్దరికిని మిక్కిలి కుతూహలముగ నున్నది. నీ వాలస్యము చేయరాదు. మా యుత్సుకత నింకను బెంపవలదు."

సూతుఁడిట్లనెను:- "మునిశ్రేష్ఠులారా! మీ యుత్సుకతకు ఆనందమును ఆశ్చర్యమును గలుగుచున్నది. నేను చెప్పునది మీకు ప్రియముగా నుండుటచే నానందమును, మీకు నేను చెప్పినది వినకయే వారిద్దరకును జరిగిన సంవాదము పరమోత్తమ మైనదని పలుకుటచే నాశ్చర్యమును గలుగుచున్నది."

ఇది విని శౌనకుఁడు నవ్వి యిట్లనెను:- "సూతా! నీవింకేమైనఁ జెప్పినఁ జెప్పవచ్చునుగాని యీ పొరపాటు వాక్యములు నోటఁబలుకరాదు. కస్తూరి కలదని చెప్పనక్కఱలేదు. గుణవంతులు దాని వాసననుబట్టియే తెలిసికొనఁ గలుగుదురు. కర్పూర సుగంధమే దాని యస్తిత్వమును గూర్చి చెప్పును. చెఱకు రసమును దీయుటను గాంచి, దానిని రుచి చూడకయే దాని రసము తీపిదని గ్రహింపఁ గలుగుదురు. అట్లే సజ్జనులు సమావేశమైనపుడు నిశ్చయముగ భాగవతీయ కథలే జరుగుచుండును. సజ్జనుల నోట ఇంకొక విషయము రానేరాదు. ద్రాక్షతీఁగెకు ద్రాక్షపండ్లే ఫలించునట్లును, గోస్తనములందు పాలే పిండఁబడినట్లును, గంగలో మునిఁగిన నెట్టిపాపికైనను పాపములు నశించినట్లును, భగవన్నామము నెప్పుడైనను, నెట్టిస్థితిలోనైన, నెట్లు పలికినను గల్యాణమే లభించునుగాని అకల్యాణ మెన్నటికిని గలుగదు. వీని యన్నిటికి నిది నైసర్గిక స్వభావ మెట్లో అట్లే భక్తులకు, భగవంతునకుఁ గల సంబంధమునుగూర్చి చర్చించుటయే సజ్జనులకు నైసర్గికస్వభావము. మేము పరీక్షిన్మహారాజును గూడ చూచితిమి. శుకదేవుని గూర్చి మీతండ్రివలనను, ఇతరఋషులవలనను వినియుంటిమి,

మేమెప్పుడు హస్తినాపురము వెళ్లినను యుధిష్ఠిర మహారాజు వెంటనే పరీక్షిత్తును బిలిపించి మాకుఁ బ్రణామము చేయించుచుండెడువాఁడు. అప్పుడాతఁడు చాల చిన్న పిల్లవాఁడు. ఆతఁడు చిన్నవాఁడై యుండ నాటలలోఁగూడ శ్రీకృష్ణలీలల ననుసరించుటను గాంచితిమి. జిహ్వాతో భగవన్నామ కీర్తనమును జేయుచుండెడువాఁడు. చాలమంది బాలురను బ్రోవుచేసి, కొందఱను గోపకులఁగాను, గొందఱను గోవులఁగను, తాను కృష్ణుఁడుగనై గోవులఁ గాచుచుఁ బ్రోవును. ఒక్కొక్కప్పుడు గోవర్ధనధారణలీల ననుకరించును. మఱొకప్పుడు వనభోజనపు టాటలాడుచుండును. ఈవిధముగ నాటలలోనే యాతఁడు శ్రీకృష్ణలీలల ననుకరించుచు, తన తోడి బాలకులచే ననుకరింపఁ జేయుచుండును. ఇఁక శుకుని గూర్చి చెప్పవలసినదియే లేదు. ఆతఁడు పుట్టఁగానే వనములకుఁ బోయెను. ఆతని త్యాగవైరాగ్యములను గూర్చి వినినచో మాకు సిగ్గగుచుండును. మేమిట్లనుకొనుచుందుము:— మేము మునులమని చెప్పుకొనుచుఁ బ్రపంచమునకు బంధింపఁబడితిమి. ఆతఁడుకూడ వంశావతంసుఁడును పరమహంస శిరోమణియు నగు ముని తనయుఁడే. ఆతనికి గోఁచియైన లేదు. పండినచెట్టు క్రింద మఱునాఁడు మరల పరుండఁడు. ఇట్టి పరమభాగవతులిరువురు సమావేశమైనచోట అవశ్యము హరికథారూపమగు పాపహారియగు గంగాస్రవంతి ప్రవహించితీరవలయును. మేమా కథను వినుట కమితోత్సాహముతో నున్నాము.''

సూతుఁడు వినమ్రతతో నిట్లనెను:- ''మునులారా! మీరు మాటిమాటికి శ్రీకృష్ణకథను గూర్చియే ప్రశ్నించు

చున్నారేల? దీనికొఱకై యింత పట్టుదల యేల? ఏదైన సామాజికప్రశ్న నడుగరాదా? రాజనైతికచర్చ చేయుఁడు. లేదా సరస సాహిత్య లక్షణ యుక్తమగు విషయములను, నింక నచ్చటచ్చటి విషయముల నడుగుడు. మాటిమాటి కిది యేనా? మీకు ఒకేవిషయమును వినుటచే విసుగు జనించుట లేదా?''

అంత నాశ్చర్యచకితుఁడై శౌనకుఁడిట్లనెను:-''సూతా! నీవు మమ్ములను బరీక్షించుచుంటివా యేమి? మేమా పనియే చేయఁదలఁచిన నిల్లు వాఁకిలి వదలి యీ నైమిశారణ్యమునకు రానేల? జీవనసార్థక్యము ఆయీ వ్యర్థవిషయిక చర్చలలోనే కలుగుచో రాజర్షులు, మహర్షు లందఱు విషయవిముఖులై యేకాంతములో దపస్సేల చేయుదురు? జీవనసార్థకత శ్రీకృష్ణ కథాశ్రవణములోనే కలదు. ఎవఁడు ఉత్తమశ్లోకుని గుణవర్ణన ములోఁ దనకాలమును గడుపునో వాని యాయువే సార్థక మైనది. మిగిలినవా రూరక దినములను గడుపుచున్నారు.

సీ॥ వాసుదేవశ్లోక వార్త లాలించుచుఁ
గాలఁ మే పుణ్యుండు గడుపుచుండు
నతని యాయువుఁదక్క నన్యుల యాయువు
సుదయాస్తమయముల నుఱుగ కరుఁడు
వంచించి కొనిపోవు వాఁడది యెఱుఁగక
జీవింతుఁ బెక్కేండ్లు సిద్ధమనుచు
నంగనాపుత్ర గేహారామ విత్తాది
సంసార హేతుక సంగసుఖముఁ

గీ. దగిలి వర్తింపఁ గాలంబు తఱియెఱింగి
దండధర కింకరులు వచ్చి తాడనములు
సేసి కొనిపోవఁ బుణ్యంబు సేయనైతిఁ
బాపరతినైతి నని బిట్టు పలవరించు.

— శ్రీమదాంధ్రభాగవతము.

కావున కాలమును సార్థకము కావించుకొనుటకై మానవుఁడు సర్వదా శ్రీకృష్ణచరిత్రకు సంబంధించిన ప్రశ్నలనే వేయును.''

సూతుఁడు వినమ్రుఁడై యిట్లనెను:- ''బ్రాహ్మణోత్తములారా! నేను మిమ్ముల నేమి పరీక్షింపఁగలుగుదును? ఈ నెపమున మీనోటఁ గొంచెముగఁ గథామాహాత్మ్యమును వినఁగలుగుదునను నెపమున నిట్లు ప్రశ్నించుచున్నాను. మీరు నా యశిష్టతకు క్షమింపుఁడు. మానవజీవితము తన ఆయుష్కాలమును భగవత్కథా కీర్తనాదులందు గడపిననే సార్థకమగుననియు, నెనిమిదిజాములు ఆహార నిద్రాదులందే గడపువారు చివరకుఁ జింతింపవలసియుండుననియు. వారికి ఆంతరిక శాంతి కలుగదనియుఁ దెలిసికొంటిని.''

శౌనకుఁడు శీఘ్రముగ నిట్లనెను:- ''లేదు సూతా! అశిష్టతావ్యవహార మేమియును లేదు. జీవితమని దేని ననఁ గలమో నీవే యోచింపుము. పుట్టుట, పెరుగుట, తనవంటి సంతానమును గనుట, సుఖదుఃఖము లనుభవించుట, క్షీణించుట, చివరకు చచ్చుట యిదియేనా జీవితము? ఇదియే జీవితమగునెడల నివియన్నియు వృక్షములకుఁ గూడ కలవు కదా! వృక్షములు పుట్టును, పెరుగును, తనవంటి వృక్షము

లనేకములగువాటినిఁ దన బీజములచే నుత్పన్నముకావించును. సుఖదుఃఖములను బొందును, ముసలివగుచుండును, జివరకు చచ్చుచుండును. మానవజీవితమునుబొందియు నిట్టివాటియందే మునిఁగి తేలుచుండి భగవచ్చింతనయందు చిత్తమర్పింపకున్న చో వానికి, వృక్షమునకు భేదమేమి?''

కొంచెము సేపాలోచించి సూతుఁడిట్లనెను:-''స్వామీ! భేదమేమియును గోచరించుటలేదు. నాకు స్వార్థపరులకంటె నీ వృక్షములే శ్రేష్ఠములుగఁ గనఁబడుచున్నవి. వీటి ఆకులు, పూలు, కాయలు ప్రయోజనపడుచున్నవి. ఎండిపోయిన తర్వాత కట్ట అనేక వస్తువులుగఁ జేయఁబడుచున్నది. పట్ట, చేవ, బొగ్గు వీనిలో వ్యర్థముగఁ బోవునదొకటియును లేదు. ఇవన్నియు జీవుల కుపకారకములే. మానవుఁడుచచ్చిన, వాని చర్మము దేనికిని బనికిరాదు. అది బూడిదైన నగును, క్రుళ్లి యైన పోవును. మానవుఁడు శ్వాసించుచున్నట్లు కనఁబడు చున్నాఁడు. చెట్లట్లు కనఁబడుట లేదు. ఇదియే భేదము.''

అంత శౌనకుఁ డిట్లనెను:- ''లేదు, లేదు సూతా! వృక్షములుకూడ శ్వాసించును. మనకు పూర్వము నుండియు నుద్భిజ, అండజ, స్వేదజ, జరాయుజములను నాలుగురకముల జీవులనుగూర్చి చెప్పఁబడి యున్నది. ఉద్భిజములును జీవములే. ఇవి భూమినుండి పొడుచుకొని బయటకు వచ్చుచుండును. ఇవి వృక్షములు. వీటి శ్వాస అవ్యక్తముగ నుండును. ఇవి శ్వాసించిన మానవులకు వినఁబడదు. శ్వాసించుటే జీవనము కాదు. అట్లయిన కమ్మరివాని తిత్తి శ్వాసించుచునే యుండును.''

ఇది విని సూతుఁడు నవ్వి యిట్లనెను:- "స్వామీ! కొలిమితిత్తి యితరుని సాహాయ్యమున శ్వాసించును. అది తిండి తినదు, నీరు త్రాగదు. ఎక్కడికిని కదలఁ జాలదు. అది నిర్జీవవస్తువు."

శౌనకుఁ డిట్లనెను:- "ఇదియే నేను చెప్పఁబోవుచున్నాను. సజీవమేది? భగవత్కథా విహీనమైన దంతయు నిర్జీవమే. ఇఁక నితరునివలన శ్వాసించు విషయమున్నది. మనకుమాత్ర మేమి స్వాతంత్ర్యము కలదు? నేఁడీ ప్రాణవాయువు లేచిపోయెనా శరీర మట్లు పడియుండవలసినదే. ఇఁక శ్వాసించు టెక్కడ? మనమును బరాధీనులమే. ఇఁకఁ దిండి విషయము కలదు. పంది, కుక్క తినుటలేదా యేమి? మల మూత్ర త్యాగము చేయుటలేదాయేమి? వీటికి పిల్లలు పుట్టుట లేదా? తినుట, త్రాగుటే జీవనమగుచో వీనికి మానవులకు భేదమెక్కడ?"

సూతుఁ డిట్లనెను:- "అయితే, కాని పశువులు గడ్డి, గాదము వంటి తుచ్ఛపదార్థములను దినును. మానవుఁడు మంచి మంచి వస్తువులను దినును."

శౌనకుఁ డిట్లనెను:- "మంచి యని నీవు దేనినందువు? ఎవని కేది యిష్టమో అది మంచిది. చాలమందికి మాంసమును జూడఁగానే డోకు వచ్చును. చాలమంది మాంసమునకు మించిన స్వాదిష్టమగు పదార్థము లేదందురు. ఒకని కింపుగ నున్నది, యింకొకనికి కంపు. ఎవని కేవస్తువునందు మిక్కిలి యిష్టమో వానికది రుచిగఁ దోఁచును. కుక్క, పంది, కాకి మొదలగు వాటికి మలము స్వాదిష్టముగఁ దోఁచ

వచ్చును. అందుకనియే ప్రాతఃకాలమున నవి మిక్కిలి ప్రీతితోఁ దినుచుండును. దానికొఱకు పందులు పోట్లాడుకొను చుండును. వానిలోఁ దల్లి ముందుగపోయి తిని పిల్లల కంద నీయదు. నిజముగ రుచి యీపదార్థములలో లేదు. నిజమగు స్వాదము రసభరితమును, సుఖకరమును, మాధుర్యపూర్ణ ములు నగు మనోహర శ్రీకృష్ణ కథలలోఁ గలదు. దాని రుచిని జూచినవానికి సాంసారిక పదార్థముల స్వాదమంతయుఁ దుచ్ఛముగఁ దోచును. కథాకీర్తనలకు విముఖుఁడై గృహ ప్రపంచములందు ఎనిమిది జాములు నిమగ్నుఁడై యుండు వాఁడు కడుపునిండ తెగ దిని, మట్టిని, పంచదారను, మల మును, మలయజమునుగూడ వీఁపుమీఁద వేసికొనిపోవు గాడిద వంటివాఁడు. లేదా మంచి తియ్యని వనస్పతి ఫల మూల పత్రములను వదలి కంటకయుక్తమగు వృక్షములను దిను నొంటెవంటి వాఁడైనఁ గావలెను.



సూతుఁ డిట్లనెను:- "స్వామీ! కృష్ణకథను వినునది చెవులేకదా! ఇతరములగు నింద్రియము లెట్లు సార్థకములు కాఁగలవు?"



అంత శౌనకుఁ డిట్లనెను:- "సూతా! వినుము.



సీ. విష్ణుకీర్తనముల వినని కర్ణంబులు
గొండల బిలములు కువలయేశ!
చక్రి పద్యంబులఁ జదువని జిహ్వలు
గప్పల జిహ్వలు కౌరవేంద్ర!

శ్రీమనోనాథు వీక్షింపని కన్నులు
కేకి పింఛాక్షులు కీర్తిదయిత!
కమలాక్షుపూజకుఁ గాని హస్తంబులు
శవము హస్తంబు సత్యవచన!
ఆ. హరిపద తులసీ దళామోదరతి లేని
ముక్కు పందిముక్కు మునిచరిత్ర!
గరుడగమను భజన గతి లేని పదములు
పాదపముల పాదపటల మనఘ!

సీ. నారాయణుని దివ్య నామాక్షరములపై
గరఁగని మనములు కఠినశిలలు
మురవైరి కథలకు ముదితాశ్రుకోమాంచ
మిళితమైయుండని మేను మొద్దు
చక్రికి మ్రొక్కని జడుని యాదల నున్న
కనక కిరీటంబు గట్టిమోపు
మాధవార్పితముగా ధనని మానవు సిరి
వనదుర్గ చంద్రికా వైభవంబు
ఆ. కైటభారి భజన గలిగి యుండనివాఁడు
గాలిలోన నుండి కదలు శవము
కమలనాభుపదముఁ గననివాని బ్రదుకు
పసిఁడికాయలోని ప్రాణిబ్రదుకు."

— శ్రీమదాంధ్రభాగవతము.

కృష్ణకథలువినని కర్ణములు వ్యర్థఛిద్రములు. పాములు ఎలుకలు, ముంగిసలు నివసించు బిలములవంటివి. శ్రీకృష్ణ

కథాశ్రవణము చేసిన చెవులే చెవులు. జిహ్వయొక్క సార్థకత వ్యర్థబకవాదములో లేదు. భగవన్నామ సంకీర్తనమే దానికి ముఖ్యమును ప్రధానమునగు కర్తవ్యము, శ్రీకృష్ణ నామ గుణకీర్తనము చేయని జిహ్వ బెకబెక, టర్ టర్ అని పలుకు కప్పనాలుక వంటిది.

పెద్దతలయుండి, దానిపై గుంచితకేశములుండి, సువర్ణ కిరీటముండిన లాభములేదు. ఇంతమాత్రముచేతనే అది శోభాయమానమగు సుందరశిరస్సుగ నెన్నబడదు. సాధువులను, వైష్ణవులను జూచుటతోడనే స్వాభావికముగ వంగుచు, భగవన్మందిర పాంశువులలోఁ బొరలాడి, భగవన్మూర్తినిఁ జూడఁగానే నమ్రమగు శిరస్సే శిరస్సు.

ఇట్లే చేతులు సుందరములుగాను, బలముగాను సుందర శంఖ చక్ర చిహ్నితములై, అత్తరువులు మొదలగు వాటిని రాచుకొని అందముగ మృదువుగఁ చేసికొని, కంకణాంగదాది సువర్ణాభూషణాదులచే మండితమై యుండియు నవి భగవత్పూజాదికార్యము లొనర్పకుండెనా, భగవంతునకు పుష్పములు కోయకుండెనా, భగవన్మందిర మార్జనము చేయకుండెనా వాటిని మృతశరీరహస్తములని గ్రహింపవలయును. ఇంకను శవము హస్తములైనను తాఁబేళ్లు నీటిలోఁ దిను నప్పుడైనను గదలుచుండును. సూతా! అట్టి హస్తములు వ్యర్థములు. శ్యామసుందరునకు సేవాసామాగ్రిని బ్రోవు చేయుటలోనే హస్తములకు సార్థకత కలదు.

ఏ నేత్రములు నిత్యము నవనీతచోరుఁడగు నందనందనుని శ్రీవిగ్రహదర్శనము చేయవో, ఏ నేత్రములు భగవానుని

దివ్య వయ్యారవిగ్రహమును గాంచి ప్రేమాశ్రువులనుగార్చవో, ఏవి భగవంతుని సుందర శృంగారమును గాంచి సంతృప్తిని జెందవో అవి బొమ్మలో వ్రాయఁబడిన కన్నులే; లేదా గవ్వ కన్నులైనఁ గావలెను, నెమిలికన్నులైన గావలయును.

ఏపాదములు భగవన్మందిరములకు దర్శనము చేయఁ బోవో, తీర్థయాత్రలకు వెడలవో, మహాపురుషులను, సాధు మహాత్ములను జూడనేగవో, అవి చెట్టుబోదెలవంటివి. ఏ యంగములు భగవత్పూజలోఁ బాల్గొనినవో అవి జీవించిన యంగములు, లేకున్న మృతకశరీరముయొక్క అంగముల వంటివేయని తెలిసికొనవలయును. శిరస్సున భగవంతుని చరణరజము, నిర్మాల్యహారము, పాదతులసి, భగవదర్పితమగు చందనము మొదలగువాటిని ధరించిన నా శిరస్సునకు సార్థకత కలదు. ఇట్లే నాసిక భగవత్పాదతులసి నాఘ్రాణించి యానం దించిన నది యథార్థమగు ఘ్రాణము; లేకున్న దానిని కమ్మరి వాని కొలిమి గొట్టమని భావింపవలయును.

సూతా! చంద్రకాంతమణి శిలవలె స్వచ్ఛమై, నిర్మలమై, దోషరహితమైనదియే పొగడఁదగిన హృదయము. ఆశిలకు చంద్రకిరణ సంసర్గము కలిగెనా అది చెమ్మగిలి ద్రవించును. అట్లే శ్రీకృష్ణచంద్రుని చారుచరిత్రలను వినఁగానే గద్గదికమై, కరిగి కన్నుల నీరుగాంచెనా ఆ హృదయమే మెన్నఁదగినది. అట్లు కాకున్నచో శుష్కము, నీరసము, విసుగుచే శూన్యమైనదనవలెను. లేదా లోహసారమగు నుక్కుగుండనవలెను. ఎవరి హృదయము కోమలమును, సరసమును, ద్రవించునదియును, విలవిలలాడునదియు, లజ్జావంతి

వలె ముడుచుకొనునదియు, నవనీతమువలె స్నిగ్ధమైనదియు, మైనమువలె మెత్తనిదియు, గంగవలె స్వచ్ఛమైనదియు నగునో అట్టి సహృదయ సరళహృదయముగల భక్తుల పాదార విందములకు నా పునఃపునః ప్రణామములు. సూతా! ఇంక నిప్పుడు మాకు శుక పరీక్షిన్నరేంద్రుల సంవాదమును విని పింపుము.''

ఇట్లని శౌనకుఁడూరకుండెను. శౌనకుఁడూరకొనఁగానే సూతుఁడిట్లనెను:- ''మహాభాగా! శౌనకా! మీనోట యిట్టి భగవద్భక్తివర్ధకములగు మాటలను వినఁగానే నాచిత్తమత్యంతము ప్రసన్నమయ్యెను. యథార్థమునకు మానవాంగము లున్నందుకు సార్థకత భగవత్సేవా సంబధము వలననే కలదు. మీరు త్రికాలజ్ఞులు. యోగప్రభావముచే సమస్తము నెఱిఁగియు, లోకకల్యాణార్థము నన్నడుగుచున్నారు. కావున నేను మీకు వినిపించు నభిప్రాయముతోఁగాక, నావాక్కును సార్థకమొనర్చుటకై భగవచ్చరిత్రలను వర్ణించెదను. పరీక్షిత్తు ఏమి అడిగినదియు, శ్రీశుకుఁ డేమని ప్రత్యుత్తరమిచ్చినదియు నీభాగవత కథకు సంబంధించినంతవఱకు మీకు చెప్పెదను. మీరందఱు సావధానపూర్వకముగ వినుఁడు.''

ఛప్పయ.

పాయో పుణ్య శరీర మనుష చ్యోఁ పాప బటోరే।
అరే, అమృత మహఁ అధమ వ్యర్థ చ్యోఁ విషకూఁ ఘోరే॥
పత్నీ, పశు, పరివార పుత్ర ధన సంగ న జావేఁ।
మలి మలి ధోవే దేహ అంత మహఁ గీదడ ఖావేఁ॥

కాహే భూల్యో బావరే, మేలా జగ కో ద్వై దివస।
కృష్ణ కృష్ణ రటి కృష్ణ జపి, కృష్ణ కథా సుని అహారనిస॥

అర్థము.

పూర్వజన్మ పుణ్యముచే మానవ శరీరమును బొంది పాపములుచేయుట – అమృతముండఁగా వ్యర్థమగు ఘోరవిషమును గ్రహించినట్లుండును. దారా, పుత్ర, ధన, పశు, పరివార సంగమునకుఁ బోవలదు. ఆదరముతో నలిచి తోముకొనుచున్న దేహమును జివరకు నక్కలు పీకుకొని తినును. ఏల నీ విషయమును మఱచెదరు? ఈ లోకానందము రెండునాళ్ళ ముచ్చట. కృష్ణకృష్ణయని పలుకుచుండుము. కృష్ణమంత్రమును జపించుము. అహర్నిశలు కృష్ణకథాశ్రవణము చేయుము.



# కథారంభము

శ్లో॥ యత్కీర్తనం యత్స్మరణం యదీక్షణమ్,
యద్వందనం యచ్ఛ్రవణం యదర్హణమ్।
లోకస్య సద్యో విధునోతి కల్మషమ్,
తస్మై సుభద్రశ్రవసే నమోనమః॥

— శ్రీభాగ. ౨ స్కం. ౪ అ. ౧౫ శ్లో.

ఉ. ఏ విభు వందనార్చనము లే విభు చింతయు నామకీర్తనం
బే విభు లీల లద్భుతము లెప్పుడు సంశ్రవణంబుసేయ దో
షావలిఁ బాసి లోకము శుభాయతవృత్తి జెలంగునండ్రు నే
నా విభు నాశ్రయించెద నఘౌఘ నివర్తను భద్రకీర్తనున్.

— శ్రీమదాంధ్ర భాగవతము.

ఛ ప్ప య.

జినకో వందన, శ్రవన, కీరతన, సుమిరన దరశన।
పూజన అరచన నామగాన కరి నరహాఁ పావన॥
సంజీవని రుజ హారే మృతనికూఁ సుధా జియావే।
హారే దీప జ్యోఁ తిమిర, తూల తృన అగ్ని జరావే॥
త్యోఁ హీం అఘ కీ రాశి కూఁ, జినకో నాసే నామ హై।
తిన ప్రభు కే పద పద్మ మహఁ, పుని పుని ప్రణ్యప్రనామ హై॥

అ ర్థ ము.

ఎవ్వనికి వందన మొనర్చియు, తత్కథాశ్రవణము కావించియు, కీర్తనము కావించియు, స్మరించియు, దర్శించియుఁ, బూజించియు, నర్చించియు, నామగాన మొనర్చియు మానవుఁడు పావనుఁడగుచున్నాఁడో – సంజీవని రుజను హరించినట్లును, మృతుని అమృతము బ్రదికించినట్లును, దీపము తిమిరమును హరించినట్లును, దూదిని, తృణము నగ్ని కాల్చిన ట్లెవని నామము పాపరాశిని నశింపఁజేయుచున్నదో అట్టి ప్రభుపాదపద్మములకు మాటిమాటికి ప్రణామము లొనర్చుచున్నాను.

———

పరమార్థ చింతనము చేయ మొదలిడఁగానే నామ రూపాత్మకమగు జగత్తు మన సమ్ముఖమునకు వచ్చినిలుచును. నానారూపములలో భాసించు నీ మెఱుఁగు, ప్రకాశము, మోహాత్మక సంసారమేది? దీని నెవఁడు నిర్మించెను? ఏల నిర్మించెను? ఈ ప్రశ్నలు నేర్చుకోనఁదగినవి కాదు, స్వతః ఉత్పన్నమగునవి సాధారణముగా మునులందఱును విశ్వోత్పత్తి స్థితి ప్రళయముల సంబంధమున విచారించిరి. ఈ విచారణ ఆవశ్యకము కూడాను. మనకు ప్రతియణువునందును నీ సంసారము చొరఁబడి యున్నది. దీని యథార్థస్వరూపము తెలియనంతవఱకు ఇది మనస్సులోనుండి యెట్లు పోఁగలదు? హృదయములో సంసార మున్నంతవఱకు శ్యామసుందరుఁ డచ్చట యెట్లుండఁ గలఁడు? ఈ సంగతిని దెలిసికొనియే పరీక్షిన్నరేంద్రుఁడు మునుముందుగా నీప్రశ్నను శుకమహర్షి నడిగెను. శౌనకాది మహర్షులుకూడ సూతుని ముందుగా నిదే విధమునఁ బ్రశ్నించిరి. ఇది విని సూతుఁడు కథారంభము చేయఁబోవుచున్నాఁడు.

సూతుఁ డిట్లనెను:– "మునులారా! వ్యాసనందనుఁ డగు శుకమహర్షి పరీక్షిన్మహారాజు నాశ్వాసించి మాటి మాటికి శ్రీకృష్ణుఁడే పరాత్పర తత్త్వమని చెప్పఁగా విని పరీక్షిత్తు తన చిత్తమును సర్వాంతర్యామియగు వాసుదేవ భగవానుని పాదారవిందములందు లగ్నము కావించెను. ఆతఁడు దారా పుత్ర గృహారామ క్షేత్ర విత్త పశు బంధు బాంధవాదులను, సప్తద్వీపవతియగు ఏకచ్ఛత్ర పృథ్వీరాజ్య మును మునుముందుగానే పరిత్యజించెను. కాని వీనియందు

గల మమతయు, నేను క్షత్రియుఁడను, నేను రాజును అను శరీరాహంకారాదులనుగూడ అతఁడు పరిత్యజించెను. ఇప్పు డాతఁ డహంకార మమకార శూన్యుఁడై ధర్మార్థకామము లను త్రివర్గములను, దత్సాధకములగు వైదిక లౌకిక కర్మ లనుగూడ పరిత్యజించి కేవలము శ్రీకృష్ణకథాశ్రవణమునందే దత్తచిత్తుఁడై యీవిషయమునే శ్రీశుకమహర్షినడుగుచుండెను.

పరీక్షిన్నరేంద్రుఁ డిట్లనెను:— "ప్రభూ! మీరు కృపాసాగరులు, అనుగ్రహ భాండారులు, దయానిధులు. మీ రేదిచెప్పినను అది నాకు సుఖకరముగనే యుండును. మిక్కిలి ఆఁకలిచెందిన వానికి శీతకాలములో వేడివేడిహల్వా ప్రియముగ నెట్లుండునో, (అనఁగా నా హల్వాలోనుండి నేయి క్రక్కుచుండవలయును, వివిధములగు జీడిపప్పు, కిస్‌మిస్, బాదాముపప్పు దానిలో వేసియుండవలయును; ఉష్ణముగుటచే పొగ రేగుచుండవలెను; ఇట్టి హల్వా గ్రాసము ఆకలిగొన్న వానికి సుఖకరముగ నుండును.) అట్లే సర్వజ్ఞా! మీరు పలుకు ఒక్కొక్క వాక్కు నా యజ్ఞానమును బోఁగొట్టు చున్నది. సూర్యుఁ డుదయింపకముందే ఆతని ప్రకాశముచే సమస్తాంధకారము పటాపంచలగునట్లు కథాకథనమునకుఁ బూర్వమే, మీయాశ్వాసమువలన నా శోకసంతాపము లన్నియు దూరమైనవి. నీట మునిఁగిన వాని సమీపమునకు నౌక తనకుఁ దాఁ రాఁగా, ఇంకను దానిపైకి యెక్కకున్నను దానికి వ్రేలాడు త్రాడు పట్టుకొనిన నెట్లు వాని జీవిత మాశా న్వితమగునో అట్లే తమ దర్శనమాత్రముచేతనే నాకు దుర్గతిభయము దూరమైపోయినది.

దొంగలపాల పడినవారికి వినఁబడునట్లు దూరము నుండి యెవరో "ఇదిగో, మేము వచ్చుచున్నాము, భయపడవల"దని కేకవేయఁగా నాకేకలు విని చోరులు పారిపోయినట్లును, ఆభయపడిన వ్యక్తి నిర్భయుఁడైనట్లును నేనును ఖట్వాంగుని విషయమును విని నిర్భయుఁడ నగుచున్నాను. కావున నోప్రభూ! మీరు నాశంకకు సమాధాన మీయవలెను. నాప్రశ్నలకు యథార్థమగుఁ బ్రత్యుత్తర మీయవలెను.

స్వామీ! ఇప్పుడు నా కీవిషయము చెప్పవలయును. ఈ జగత్తు ఏమి? గొప్పగొప్ప బ్రహ్మాదిదేవతలును, లోకపాలురును, మనువు, ప్రజాపతులును ఏసంసారమునుగూర్చి యథార్థముగఁ దెలిసికొనలేక పోయిరో అట్టె దానియొక్క రచన భగవానుఁడు తనమాయచే నెట్లు విలాసముగ రచించెను? ఉత్పత్తి కావించి దీని నెట్లు పాలించుచున్నాఁడు? ఎట్లు ఁరల నాశము జేయుచున్నాఁడు? ఏయే శక్తి నాశ్రయముగ గహించి లీలగ, ప్రయాసలేకయే, నవ్వుచు నవ్వుచు నీ నానారూపమగు చిత్రవిచిత్రమగు ప్రపంచమును రచించెనో దానినిగూడ తెలుపవలయును. అవతారము లెట్లెత్తుచుండునో, అవతారములు ధరించి యేయేక్రీడ లొనర్చుచుండునో, ఆ సంగతికూడ చెప్పవలయును. బ్రహ్మాది దేవతలుకూడ యథార్థముగఁ దెలిసికొనఁ జాలకున్నారని నీవు చెప్పుచుంటివే అట్టి దానిని నేనెట్లు తెలిసికొనఁ గలుగుదును? అని మీరనరాదు. మీరు సర్వజ్ఞులరు. శబ్దబ్రహ్మ, పరబ్రహ్మ - వేదవిద్య, అధ్యాత్మవిద్య ఈరెంటిలో నిష్ణాతలు. కావున

మీరు నాగూఢప్రశ్నలకు యథార్థమగు ప్రత్యుత్తరము నీయఁగలుగుదురు.''

సూతుఁ డిట్లనెను:-'' మునులారా! పరీక్షిన్నరేంద్రుఁ డిట్లు జ్ఞానసంబంధమగు గూఢవచనములు పలుకఁగా విని, నాగురుదేవుఁడగు శుకమహర్షి కథారంభముచేయుట కుద్యుక్తుఁడయ్యెను. ఆతఁడు కొంచెము సవరించుకొని; వెనుక బాలీసు సహాయమున సావధానముగఁ గూర్చుండెను. ఆతఁడు తన నేత్రద్వయమును మూసికొనెను. రెండు చేతులతోఁ బట్టిన అంజలి ముద్ర నీలకమలముల జంటమధ్య యెఱ్ఱని కమలము లున్నట్లుండెను. ధ్యానస్థుఁడే నేత్రములను మూసికొని, చేతులు జోడించుకొని యాతఁడు కథారంభమును జేయుటకుఁ బూర్వము మంగళాచరణము కావించెను. ఆతఁడు గద్గదకంఠముతోఁ గంభీరవాక్కులతో బిగ్గరగా భగవానుని దయాళుత్వమును, మహిమమును వర్ణించుచు స్తవము నొనర్చెను.

మునులారా! శాస్త్రకారులు మూఁడురకముల మంగళాచరణములను గూర్చి వచించిరి:- వస్తునిర్దేశాత్మకము, నమస్కారాత్మకము, ఆశీర్వాదాత్మకము.

మా గురుదేవుఁడు తాను జేసిన మంగళాచరణములో నీమూఁటిని నిర్దేశించెను. గొప్పగొప్ప జ్ఞానులుకూడ యాతని బుద్ధికౌశలమునుగాంచి మోహితులగునట్లు సమస్త భాగవత సారతత్త్వమును చక్కగ నిముడునట్లు ఆతఁడు తన మంగళాచరణమును గావించెను. చెప్పవలసినదంతయును పదునొకండు శ్లోకములలో నాతఁడు చెప్పివేసెను. తత్త్వమొక్కటియేనని

యూతఁ డా పదునొకండు శ్లోకములలోఁ జెప్పెను. అది తన యాకారప్రకారమును రెండురూపములు (రాధికాకృష్ణులు) గఁ జేసికొనెను. వారిద్దరికిని భేదము లేదు. అంతరమును లేదు. ఒకటికి మించిన దొకటి. ౧౧ శ్లోకములు చెప్పుటకుఁ గారణ మేమనఁగా మాయికజగత్తులో ౧౧ వస్తువులే ప్రధానములు. పంచభూతములు, పంచేంద్రియములు, ఒక్క మనస్సు. ౧౧ అని చెప్పుటకు తాత్పర్యము భగవంతుఁడు పది అవతారము లెత్తినాఁడనియు, శ్రీకృష్ణుఁ డీ పదియవతారములకుఁ గారణ మగు పదునొకండవ యవతారమనియే. ఏకాదశరుద్రులే యీ జగత్ప్రళయమునకు హేతువు. ఈ విధముగఁ జెప్పవల సిన దంతయును మంగళాచరణమను మిషచే గురుదేవుఁడీ ౧౧ శ్లోకములలోనే చెప్పివేసెను. తర్వాత చెప్పిన స్కంధము లన్నిటిలో వీని విస్తారము, భాష్యమున్నది. మునులారా! నిత్యపారాయణము చేయఁదగినవియు, హృదయహారముగ నుంచుకొనఁదగినవియు నగు నీ ౧౧ శ్లోకముల భావమును తర్వాత చెప్పెదను. ఈ కథాప్రసంగములో వాటిని గూర్చి దిగ్దర్శనముగఁ జెప్పెదను. ఉత్పత్తి, స్థితి, లయము లొనర్చు టకై రజ, స్సత్వ తమోగుణముల నాశ్రయించి బ్రహ్మ విష్ణు మహేశ్వరులకును, సర్వాంతర్యామి రూపమున సమస్త మున వ్యాపించిన భూమాపురుషునకును బ్రథమమున శ్రీశుక మహర్షి నమస్కరించెను. తర్వాత గురురూపమున, ఇష్ట దేవతారూపమున, ఆధారరూపమున, అర్చావిగ్రహరూప మున, బ్రహ్మరూపమున, పతితపావనరూపమున, సద్గుణాలయ రూపమున, పతిరూపమున, జ్ఞానరూపమున, కర్తారూపమున,

పురుషరూపమున భగవంతునకు వందనము కావించెను. అనంతరమున నెవని ముఖకమలముననుండి వెలువడిన జ్ఞానామృతమును సాధుపురుషులును, దానును యథేష్టముగఁ బానము కావించెనో అట్టి పరమతేజస్వియుఁ, దనకుఁ దండ్రియు నగు వ్యాసభగవానునకు వందనము కావించెను.

ఈవిధముగ బిగ్గఱగ లయతో పరమహంస చూడామణియగు నాగురుదేవుఁడు స్తుతిగానమును కావించెను. మునులారా! నేనచ్చటనే ఆతని యెదుట కూర్చుండి వినుచుంటిని. ఓజోపూర్ణమగు యాతని మధురగానమును వినఁగానే సభయంతయు స్తంభితమయ్యెను. సర్వత్ర నిశ్శబ్దముగనుండెను. వాయువుకూడ మందమందముగ వీచుచుండెను. పులుఁగులు కలరవ మాపివేసెను. ఎటుచూచినను శాంతి సామ్రాజ్యమే. ఇంతటి గొప్ప పరిషత్తులో నెవరైన గట్టిగా శ్వాసించిన నదియు స్పష్టముగ వినఁబడుచుండెను. సమస్త ఋషులు, మునులు, దేవర్షులు, బ్రహ్మర్షులు చిత్రప్రతిమలవలెనైరి. నేనుగూడ మంత్రముగ్ధునివలెఁ గనుఱెప్పవేయక మా గురుదేవుని ముఖకమలమును నిరంతరము చూచుచుంటిని. మంగళాచరణము కావించిన తర్వాత నాతఁడు కొంచెమాగెను. తర్వాత మెల్లమెల్లగా నాతని విశాలనేత్రములు సూర్యోదయకాలమున ముకుళ కమలము వికసించినట్లు తెఱవఁబడెను. ఒక్కసారి యాస్తంభిత సభవైపు విహంగమదృష్టిని బఱపి, రాజును లక్షించి, యాతనిని సంబోధించుచు నా యాచార్యదేవుఁ డిట్లనెను:— "రాజా! లోకపితామహుఁడగు బ్రహ్మయొక్క అంతఃకరణములో నీవిశ్వబ్రహ్మాండోత్పత్తికిపూర్వమే

తమకుఁ దాము వేదము లుత్పత్తి యయ్యెను, నేర్చుకొనకయే భగవత్ప్రేరణచే నాతని హృదయములో వేదప్రకాశము కలిగెను. ఆ సమయమునఁ గమలమున నాసీనుఁడైన కమలగర్భునకు సాక్షాత్తుగ శ్రీమన్నారాయణుఁడు శ్రీమద్భాగవతము నుపదేశించెను. ఆ పరమజ్ఞానమును బొంది బ్రహ్మ కృతకృత్యుఁడయ్యెను. తర్వాత తనపుత్రుఁడగు నారదుఁ డడుగఁగా బ్రహ్మ యాభాగవతతత్త్వము నాతని కుపదేశించెను. మఱల నదే భాగవత తత్త్వమును ఖిన్నుఁడై కూర్చుండిన నా తండ్రియగు వ్యాసమహర్షి కుపదేశించెను. నాతండ్రివలన నే నీ పరమపావన జ్ఞానమును జదివితిని. శ్రీమద్భాగవతరూపమగు నా మహాజ్ఞానమును నేను నీ కుపదేశించుచున్నాను.

ఒకానొకప్పుడు దేవర్షి యగు నారదుఁడు వీణమీటుచు హరిగుణ గానముచేయుచుఁ దండ్రియగు బ్రహ్మయొక్క లోకమునకుఁబోయెను. చిరకాలమునకుఁ దనపుత్రుడు వచ్చుటనుగాంచి బ్రహ్మ ఆతనియెడలఁ బ్రేమను బ్రదర్శించెను. నారదుఁడుకూడ పితృపాదపద్మములకుఁ బ్రేమపూర్వకముగఁ బ్రణామముకావించి, యాతఁడు నిర్దేశించిన యాసనమునఁ గూర్చుండెను. కూర్చుండిన తర్వాత నాతఁడు బ్రహ్మను బ్రశ్నించుట కుద్యుక్తుఁడయ్యెను. ప్రశ్నించుటకు నియమ మేమనఁగా నమ్రతతోఁ జేతులను జోడించి, మరలఁ బ్రణామము కావించి మిక్కిలి సావధానముతో సారగర్భిత శబ్దములతోఁ దన శంకను బ్రకటింపవలెను. అడుగుటలో అశిష్టత పనికిరాదు. ప్రశ్నాభిప్రాయము స్పష్టముగఁ దెలియకుండునట్లు మిక్కిలి సంక్షేపముగ నడుగరాదు. ముఖ్యప్రశ్న

యేమియో తెలియకుండునట్లు మిక్కిలి విస్తారముగను బ్రశ్నింపరాదు. వ్యర్థ శబ్ద మొక్కటైన నుండరాదు. ఈ నియమముల ప్రకారము నారదుఁడు ప్రశ్నించెను.

నారదుఁడు నమ్రతతో నిట్లు నివేదించెను:- "దేవాధిదేవా! సమస్త ప్రాణులకు ముందుగానే పుట్టినవాఁడా! సృష్టికర్తా! భగవంతుఁడా! భవదీయ అరుణ చరణ సరోజములకు పునఃపునః ప్రణామములు కావించి నేనొకటి అడుగఁదలఁచినాను. కృపతో నాత్మతత్త్వ సాక్షాత్కారము కలుగునట్లు నాకు జ్ఞానోపదేశము నొనర్పుఁడు. స్వామీ! ఈ దృశ్యమానప్రపంచ మెవని స్వరూపము? ఎనివ యాశ్రయముచే నిది కనఁబడుచున్నది? చివర కెవనిలో నిది విలీనముకాఁగలదు? దీనికి నియామకుఁ డెవఁడో, ఎవని యధీనమున నుండుటచే నిది యారీతిగనే సర్వదా జరుగుచుండునో ఆపరతత్త్వమును గూర్చి మీరు నాకుపదేశింపుఁడు."

బ్రహ్మ నవ్వి యిట్లనెను:- "నాయనా! ఇదంతయు నాకేమి తెలియును? ఇంకెవరినైన నడుగుము."

అంత నారదుఁ డిట్లనెను:- "కాదు ప్రభూ! మీకిది యంతయుఁ దెలియును. మీ రెఱుఁగనివిషయము లేవి కలవు? మీరు త్రికాల నియామకులు. భూత భవిష్య ద్వర్తమాన కాలములకు స్వామివి. ఒకానొకని చేతిలో నొక పండుండెనను కొనుఁడు. అది అతనిచేతిచే నణఁచఁబడెననుకొనుఁడు. దాని మీఁద నొక చీమ తిరుగుచున్నదనుకొనుడు. ఆ అణఁచుకొని పోయిన భాగమును చీమ యెఱుఁగదు. దానివెనుక నున్న వస్తువునుగూడ చూడఁజాలదు. కాని యెవనిచేతిలో నీ ఫల

మున్నదో వానికి ఫలములోఁ దెలియని భాగమే లేదు. ఇదే విధముగ నన్యజీవులును భూతభవిష్యత్తులను దెలిసికొనఁ జాలరు; కాని మీకు భేదభావమేమియును లేదు. మీరే యీ విభాగమంతయుఁ జేయుచుందురు.''

బ్రహ్మ యిట్లనెను:- ''నాయనా! నే నేమి చేయుచున్నాను? అంతయు చేసెడివాఁడింకొకఁడున్నాఁడు. నే నాతని యాధారముతో నంతయుఁ జేయుచున్నాను.''

అంత నారదుఁ డిట్లనెను:- ''స్వామీ! మీకీ విచిత్ర విజ్ఞాన శక్తి యెచ్చటనుండి ప్రాప్తించినదో అదియే నేను తెలిసికొనఁగోరుచున్నాను. మీ కాధారమేది? మీరుకూడ ఇంకెవరి యధీనములోనైన నుంటిరా? స్వామీ! మేము మిమ్ములనే చూచుచున్నాము. కుమ్మరివాఁడు సారెను ద్రిప్పి దానిమీఁద మంటిముద్దనుబెట్టి కుండ, చట్టి, మూఁకుడు, బుంగ మొదలగు పాత్రల నేదికోరిన దానిని జేసినట్లు మీరు చరాచర విశ్వమునంతను జేయుచుందురు. దానికి మీరు ప్రయాస చెందవలసినపనియు లేదు, ఆలోచింపవలసినదియును లేదు. ఇదేవిధమున మీరు చరాచర విశ్వమును రచింతురు. కుమ్మరివాఁడు మట్టిని దెచ్చుకొనవలసియుండును. సారె, కఱ్ఱ, దారము, నీరు మొదలగువాటిని సమకూర్చుకొనవలయును. మీ కివి యేమియు నవసరములేదు. సాలెపురుగు తన నోటినుండి దారమును తీసి వలగూడు నల్లినట్లు, మీ రట్లు కూర్చుండియే కేవలము సంకల్పమాత్రముచేతనే దీనినంతయు రచించుచుందురు. సాలెపురుగు నిరంతరమట్లే వలను రచింతమన్న దానికి దారము రాకపోవచ్చును, అది అలసిపోవచ్చును. కాని

మీలో నేవికారమును, న్యూనాధిక్యతలును గనఁబడవు. ఏక రసముచే మీరు దీనిని నిర్మించుచుందురు. జగత్తులో నేనెక్కడ చూచినను మీరు నిర్మించిన సామగ్రియే కనబడుచుండును. మిక్కిలి ఎత్తయినవియు, మిక్కిలి తగ్గయినవియు, మిక్కిలి గొప్పవియు, మిక్కిలి చిన్నవియు, మిక్కిలి సన్ననివియు, మిక్కిలి లావైనవియుఁ, గనఁబడునవియు, గనఁబడనవియు సదసత్తులు ఇవన్నియు మీవల్లనే యుత్పత్తి యగుచున్నవి. మీరు తప్ప యింకొకరచయిత కనఁబడుటలేదు.

ఇట్లైనను, సర్వస్వామివయ్యుఁ గర్తవు, ఈశ్వరుఁడవు, విధాతవయ్యును నీ వొక్కొక్కప్పుడు ఘోరతపస్సును జేయుచుందువు, ఒక్కొక్కప్పుడు భక్తిచే నేడ్చుచుందువు, ఒక్కొక్కప్పుడు చేతులు జోడించుకొని స్తుతిచేయుచుందువు. దీని వలన నాకు చాల సందేహము కలుగుచున్నది. నీ వందఱకును వందనీయుఁడవు. అట్టివాఁడవు నీ వెవరికి వందనము చేయుదువు? నీ వందఱకును ధ్యేయుఁడవు. అట్టివాఁడవు నీ వెవరిని గూర్చి ధ్యానింతువు? నీవే అందఱకును బూజనీయుఁడవు. నీకు మించిన వాఁడెవఁడున్నాఁడు, నీవు పూజించుటకు? నా యీ శంకలకు సమాధానమిండు.''

ఈ వాక్యములను విని లోకపితామహుఁడగు బ్రహ్మ నవ్వి యిట్లనెను:- "వత్సా! నారదా! నీకు కలిగిన శంక నీది కాదు. లోకానుగ్రహము కొఱకు, జగత్కల్యాణము నిమిత్తము నీవు సాంసారికులకు ప్రతినిధిత్వము వహించి యీ ప్రశ్న వేసితివి. ఈ ప్రశ్నను వేసి నీవు సాంసారికుల యెడలఁ గృపఁజూపితివి. నా యెడలఁగూడ కృపఁజూపితివి. ఈ మూల

మున నాకు భగవల్లీలా గుణాభివర్ణనము చేయు నవసరము లభింపఁ గలదు.

నీవు నన్ను సర్వస్వామివంటివి. అది చాలపొరపాటు. మాయ కధీనమై యీ ప్రపంచము కనఁబడుచున్నదో, నేను నేమాయ నాశ్రయించి సృష్టికార్యమునందు ప్రవృత్తుఁడ నైతినో, ఆ మాయకుగూడ ఒకపతి కలఁడు. ఆతఁడు నాకుఁగూడ స్వామియే. నాకేకాదు, చరాచర విశ్వమునకును స్వామియే. ఆతని ప్రేరణచేతనే యిదియంతయు జరుగుచున్నది. నేనాతని చేతిలోని కీలుబొమ్మను. ఆతఁడేది చేయించిన నది చేయు దును. ఏది పలికించిన దానిని పలుకుదును.''

సూతుఁడిట్లనెను:- ''మునులారా! ఇట్లు పలికి బ్రహ్మ నారదునకు సృష్టిక్రమమునుగూర్చి చెప్పెను. మహానుభావు లారా! సృష్టివిషయము చాల చిక్కువిషయము, దీనిని నేను సృష్టిప్రకరణములో విస్తారముగఁ జెప్పెదను. సృష్టిక్రమమును వర్ణించినతర్వాత విరాట్స్వరూపమును వర్ణించెదను. మును లారా! యథార్థమేమనఁగా ముందుగాఁ గథనుజెప్పి ప్రసం గానుసారముగా నన్నియుఁ జెప్పెదను. విరాట్ కూడ భగవం తునియొక్క స్వరూపమే. నేనాతనికి మాటిమాటికిఁ బ్రణా మము చేయుదును. కాని నేను మధురోపాసకుఁడను. సహస్ర బాహువులు, సహస్ర నేత్రములు, సమస్త ప్రపంచములో నుత్తమాధమ, సుఖద బీభత్సము లే విరాట్స్వరూపములోఁ గలవో ఆ విరాట్స్వరూపమునకు దూరమునునుండియే దండ వత్ప్రణామము. అయినను నేను ప్రసంగానుసారముగఁ దత్త్వ జ్ఞాన ప్రకరణములో దీనిని గూర్చి వర్ణించెదను.''

శౌనకుఁ డిట్లనెను:- "సూతా! బాగున్నది. ఇట్టి గంభీర ప్రసంగములను ప్రాతఃకాలమందు వినవలయును, జదువలయును. దీనిలో బుద్ధి మిక్కిలి ఏకాగ్రముగ నుండ వలయును. బహిరంగవృత్తి కలవారు ఇట్టి ప్రసంగమును వినిన విసుగుఁగొందురు. కొందఱు ఆవలింతురు, కొందఱు నిద్ర తూగుదురు. కొందఱు లేచి వెళ్లిపోవుదురు. కావున నిప్పుడు నీవు కథా ప్రసంగమునే చెప్పుము. కథా ప్రసంగమును సాధారణ అసాధారణులందఱు మిక్కిలి ప్రేమతో విను చుందురు. విరాట్స్వరూపవర్ణనము చేసిన తర్వాత బ్రహ్మ నారదునితో దేనిని వర్ణించెను ?"

ఇది విని సూతుడిట్లనెను:- "శౌనకా! ఈ విరాట్పురుషుని సమస్త అంగప్రత్యంగములలో నీ విశ్వములోని వస్తువులను గల్పించి యీ సమస్తజగత్తు విష్ణుమయమను సిద్ధాంతము నుపదేశించెను. అంత బ్రహ్మ స్వయముగ నారదునితో నిట్లనెను:- మునివరా! ఈ యజ్ఞ, రాక్షస, దేవ, పితర, సిద్ధ, చారణాదులు కాక, భూమాపురుషునియొక్క పరమ పావనములగు ప్రధానావతారములనుగూర్చి నీకు క్రమముగ నభివర్ణించెదను. ఆ యవతార చరిత్రలను వినుట చేతనే సమస్త పాపతాపములు దూరములు కాఁగలవు. ఇట్లు చెప్పి బ్రహ్మ ప్రధానములగు నవతారములను వర్ణించెను."

సూతుఁ డిట్లనెను:- "మునులారా! బ్రహ్మ నారదున కెట్లు అవతారములను గూర్చి అభివర్ణించి చెప్పెనో అట్లే నేను మీ సమ్ముఖమున నభివర్ణించెదను. మీరందఱు సమాహిత చిత్తులరై శ్రవణము చేయుఁడు."

అంత శౌనకుఁ డిట్లనెను:– "మహాభాగా! నీవు అవతార వర్ణనము యిదివఱలోఁ జేసితివి. ఇదివఱకు నీవు ౨౨,౨౩ అవతారముల సంక్షిప్త వర్ణనమును వినిపించితివి. అయితే యిప్పుడు అవికాక ఇతర నూతనావతారములను గూర్చి వర్ణించెదవా లేక వాటినే చెప్పెదవా?"

అంత సూతుఁ డిట్లనెను:– "శౌనకా! నీవును ఇట్లు మాటలాడుచున్నా వేల? అవతారకథలనిననే భాగవతకథ. వాటిని మాటిమాటికి చెప్పినప్పటికిని పునరుక్తిదోషము రాదు. ఈ యవతారచరిత్ర లెన్నిసార్లు వినినను తృప్తి తీరదు."

ఇది విని శీఘ్రముగ శౌనకుఁడిట్లనెను:– "కాదు, కాదు సూతా! నా యభిప్రాయము నీవు చెప్పఁగూడదని కాదు. నీ వవశ్యము చెప్పవలయును; కాని నూతనకథయందు గల యుత్సాహముచే మనస్సు అధికశీఘ్రముగ లగ్నము కాఁగలదు. ఒకానొక మిఠాయి తినఁగా నోరు మొత్తినపుడు వేఱొక మిఠాయిని దినుచున్నాముగదా రుచిని మార్చుటకు!"

ఇది విని సూతుఁడు నవ్వి యిట్లనెను:– "మునివరా! మిఠాయిలో భేదమేమున్నది? పిండి, నేయి, పంచదార–వీటి తోడనే సమస్తమిఠాయిలు తయారగుచున్నవి మైదాపిండిని కలిపి కుండలాకారముగ జిలేబిచుట్టలను నేతిలోఁగాల్చి, పంచదార పాకములో వైచిన నది జిలేబి అగుచున్నది. బూందిని దీసి, పాకములోవైచి గుండ్రని ఉండలు చేసిన లడ్డు అగుచున్నది. ఇట్లే మిఠాయీ లన్నిటిలోని పదార్థమంతయు నొక్కటే. కోవాతోఁ జేసినమిఠాయీలుకూడ యింతే. కోవా

ముదురుపాకములో పంచదార కలిపి ఉండలుచేసిన పేడా మిఠాయి యగును. పలచని పాకముచేసి, బిగిసినతర్వాత బిళ్లలుగఁ గోసిన బరఫీ యగును. బిళ్ళలుగఁ గోయక ఉండలు చేసిన కోవాలడ్డు కాఁగలదు. పదార్థ మదియే. కేవలము రూపాకృతిలోనే భేదము. ఇదేవిధముగ నేను ఇంకొకవిధమున బాగుగాఁ జెప్పెదను. మీరు వినఁగా వినఁగా నానందించెదరు. మీకు నూతనత్వము గోచరింపఁగలదు.''

ఇట్లని బ్రహ్మ నారదునకు వర్ణించిన విధమున సూతుఁడు భగవచ్చరిత్రములను వర్ణింప మొదలిడెను.

ఛప్పయ.

బోలే రాజా ప్రభో! సృష్టి ఉతపత్తి బతావేఁ।
నిర్గుణ తేఁ యహ సగుణ భయో కైసే సమఝావేఁ॥
శుక బోలే—విధి నికట యహీ పూఛీ నారద ముని।
కహూఁ భాగవత భూప! సమాహిత మన కారకేఁ సుని॥
బ్రహ్మ విష్ణు మహేశ బని, రచి పాలహిఁ మారహి సబహిఁ।
తిన హరికేఅవతార కీ, కథా కహహుఁ నృప, సును అబహిఁ॥

ఆర్థము.

రాజిట్లనెను:—''ప్రభూ! సృష్ట్యుత్పత్తి నిగూర్చి చెప్పుఁడు. నిర్గుణపరమాత్మ సగుణుఁ డెట్లైనాఁడో తెలుపుఁడు.''

శుకుఁ డిట్లనెను:— ''బ్రహ్మను నారదముని యిట్లే ప్రశ్నించెను. రాజా! నేను భాగవతమును జెప్పెదను. సమాహితచిత్తముతో వినుము. పరమాత్మ బ్రహ్మ, విష్ణు, మహే

శ్వరరూపములను జెంది జగత్తును సృష్టించి పాలించి నశింపఁ జేయుచుండును. ఇప్పుడు నేనట్టి శ్రీహరి యవతార కథా వృత్తాంతమును జెప్పెదను వినుము.''



# వరహావతారము

శ్లో॥ యత్రోద్యతః క్షితి తలోద్ధరణాయ విభ్రత్
క్రోడీంతనుం సకల యజ్ఞమయి మనంతః।
అంతర్మహార్ణవ ఉపాగత మాది దైత్యమ్,
తం దంష్ట్రయాద్రిమివ వజ్రధరోదదార॥

— శ్రీభాగ. ౨ స్కం, ౭ అ. ౧ శ్లో.

మ. కనకాక్షుండు భుజావిజృంభణమునన్ క్ష్మాచక్రముం జాపఁ జు
ట్టినచాడ్పుం గొనిపోవ యజ్ఞమయదంష్ట్రి స్వీకృతం దాల్చి య
దనుజాధీశ్వరుఁ దాఁకి యడ్డపడుమున్ దంష్ట్రాగ్రతం ద్రుంప ధా
త్రిని గూలెం గులిశాహతిం బడు మహాద్రిం బోలి యత్యుగ్రతన్.

— శ్రీమదాంధ్రభాగవతము.

ఛప్పయ.

బని గప సూఅర శ్యామ మేఘ సమ లంబ తడంగే।
ఘుర్రు ఘుర్రు కరి ఘుసే నీర మహఁ నంగ ధడంగే॥
ఆయో భీషణ దైత్య భిడే నఖ దాఁత చలావేఁ।
గ ఈ సిటిల్లి భూలి బలీ లఖి ముఁహ మటకావేఁ।
పటక్యో ఫిరి సటక్యో తురత, భటక్యో లటకో చోటతేఁ।
చట్ట పట్ట మార్యో అసుర, ధరణీ దేఖే ఓటతేఁ॥

అర్థము

శ్రీహరి మేఘశ్యాములుఁడై పెద్ద సూకరరూపమును ధరించి ఘుఱ్ఱుఘుఱ్ఱుమని శబ్దముచేయుచు నీటిలోఁ బ్రవేశించెను. అప్పుడు హిరణ్యాక్షుఁడు భీషణముగఁ దలపడెను. అప్పుడు గోళ్లతోడను, గోరలతోడను బోరాడిరి. ఒకరి నొకరు కవ్వించుకొనుచు నాతఁడు బలవంతుఁడని తెలిసికొని కోఱచూపులతో నేలకుఁగొట్టి, తాను దప్పించుకొని, వెంటనే వానిని ద్రిప్పిద్రిప్పి కొట్టి వానిని జివరకుఁ జంపెను. అంతఁ దన శరణుఁజొచ్చిన ధరణిని గాంచెను.

సూతుఁ డిట్లనెను:- శూకరాయ నమోనమః, చక్రతుండాయనమః, బృహద్వారాహాయనమః, వజ్రదంష్ట్రాయ నమః. మునులారా! మీకు రాముఁడు మేలు చేయునుగాక! వృద్ధపితామహుఁడగు బ్రహ్మ కూర్చుండియుండఁగానే ఒక దినమున నొకతుమ్ము వచ్చెను. కమలము చల్లగ నుండును. కమలాసనుఁడగుటచేఁ గాఁబోలు బ్రహ్మకు జలుబు చేసి యుండవచ్చును. తుమ్మఁగానే అంగుష్ఠాగ్రమంత సూకరము ముక్కునుండి బయటపడెను. పితామహుఁ డదరిపడి, భయపడెను. ఇదేమిటి? కొందఱ కడుపులోఁ బురుగులు పడిన క్రిందనుండి బయలుదేరును. నాకడుపులోఁ బంది పుట్టినదే. రామ రామ రామ! ఏమి చేయుదును? పొట్టలోనికి పంది దూఱి పిల్లలను బెట్టినదా యేమి? ఇంకను బయలు వెడలు నేమో? ఏద్దైనఁ జూర్ణమును దిందునా? ఏపచ్చడిచే నీ కడుపులోని పందులు చచ్చును? నులిపురుగులు పడిన వేఁప

చిగుళ్లు తినిన నయమగును. ఇప్పుడు పొట్టన బుట్టిన పందుల కేమి యౌషధము కలదు? ఎవరి నడుగుదును? అప్పటి కింకను అశ్వనీ కుమారులు పుట్టలేదు. పితామహుఁ డిట్లాలోచించు చుండఁగనే యాసూకరము కప్పంతదై త్రవ్వుచుండెను. బ్రహ్మ తన యాసనమును గొంచెము జరుపుకొనెను. అప్పుడే అది ఎలుకంతదైయుండెను. బ్రహ్మ ఏకాగ్రదృష్టితో దానినే జూచుచుండెను. వెంటనే అది పిల్లియంతదైయుండెను. ఇప్పుడు తాతగారికి సందేహము కలిగెను. ఇది క్షణక్షణము పెరుగు చున్నదే. చూచుచుండఁగనే అది సాధారణపు సూకరమంత య్యెను. దీని తల్లికూడ పొట్టలోనుండి జయజయ సీతా రామని చావవలసివచ్చునేమోయని బ్రహ్మ భయభీతుఁడై తన పొట్టను నులుముకొనుచుండెను. అప్పటికి సూకరాధిపుఁడు మత్తగజేంద్రమంత యయ్యెను. పొట్ట మెత్తగానే యున్నది, దానిలో గడబిడచేయున దేమియు లేదని బ్రహ్మ గ్రహించెను. ఇది సాధారణ వరాహము కాదు; ఇది యేమో అద్భుత అచింత్య సత్త్వమని బ్రహ్మకు సందేహము కలిగెను. ఇవన్నియు సత్యలోకములోని విషయములు. అప్పటికి మహ ర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము యుత్పన్న మయ్యెను. అట్లే పదునాల్గులోకము లుత్పన్నమయ్యెను. కాని వానిలో పట్టణములు లేవు. జీవు లింకను నివాసము లేర్పఱచు కొనలేదు. ఇంతలో బ్రహ్మ చూచునప్పటికి – సూకరరాజు ఆకాశములో పెద్దపర్వతశిఖరమంతై, గొప్పజలధర మేఘము వలె శూన్యములో నిలుచుండెను. బ్రహ్మ "ఈతఁడు భగవం తుఁడు, యజ్ఞవరాహప్రభువు, నాకు స్వామి, ఆదిఅవతారము,

సర్వత్రాత, నాకు రక్షకుడు, పృథ్వీప్రతిపాలకుడు, దుష్ట సంహారకుడు, అనాది అనంత అచ్యుతుడు, ఈశ్వరేశ్వరుడు, ఉత్తమోత్తముడు, ఋషిపూజితుడు, మాననీయుడు, వందనీయుడు, ఆరాధనీయుడు, సేవనీయుడు స్తవనీయుడు'' అని యిట్లు తలచి బ్రహ్మ గబగబ దూరముగ బోయి, అధీరుడై మాటిమాటికి సాష్టాంగప్రణామము కావించెను. తన చక్రమువలె గుండ్రముగనుండిన యాతని తుండమును గదలించి యాతడు బ్రహ్మ నాశీర్వదించి యచ్చటనుండి శర వేగమున గ్రిందికి దిగి, నిమిషములో దపోలోకము, జన లోకము, మహర్లోకము, స్వర్గలోకము, భువర్లోకము ఈ లోకముల నన్నిటిని దాటి భూలోకమున సముద్రతీరమునకు వచ్చి నిలుచుండెను. అచ్చట సప్తసముద్రములు పెద్ద సరోవరము వలె గనబడుచుండెను. శూకరావతారము ఆలోచింపకుండ నీటిలోనికి వేగమున దుమికి, అచ్చట పెండ్లికూతురువలె సిగ్గుచే ముడుచుకొనియుండిన భూదేవి నెత్తి, తన కోరలపై నుంచుకొని వెడలెను. ఇంతలోనే ఆతని వెనుకనే యిట్టి మాటలు వినబడెను. ''అరే సూకరాధమా! పారిపోయెద వెక్కడికి? నిలునిలు. జాగ్రత్త, ముందుకు అడుగువైచితివా ఎముకలు నులినులి చేసెదను.'' వరాహము తన రెండు కాళ్ళనుడు - చేతులనుడు - ముందుకు వేయ నెత్తెను. భూదేవి ఇదేమితిప్పలురా యని చాలభయపడెను. ఇంతలోనే భూతము వలె నాకాశమునుండి దీర్ఘ మణిజటిత ముకుటమును ధరించి హిరణ్యాక్షుడను దైత్యుడు వరాహము నెదుట ఢొమ్ముపిఱిచి తొడచఱచి నిలుచుండెను.

ఈతఁడును తీసివేసినవాఁడు కాఁడు. భూదేవితో నిట్లనెను:-"భూదేవీ! వినుచున్నావా? ఈ కుక్క పని ముగించి వేసెదను, నీవిచ్చటనే కూర్చుండుము. భయపడవలదు. నేను యుద్ధము చేసెదను." భీతచిత్తయైన పృథ్వీదేవి యిట్లనెను:- "వలదు, వలదు స్వామీ! నా ప్రాణనాథా! యుద్ధము వలదు. పోరాటము పనికిరాదు. తోఁక ముడుచుకొని పారిపొండు" భగవానుఁడు గద్దించి యిట్లనెను:- "ఛీ, తొలఁగుము, స్త్రీ జాతి. పారిపోవుటకు నీవలె తాళికట్టుకొనలేదు, మేలిముసుఁగు వేసికొనలేదు. నీవు మెదలకుండ కూర్చుండుము. ఇప్పుడే వీనిని నేను పచ్చడి చేసెదను. వీని పొగరణఁతును. వీని నిప్పుడే యమపురమునకుఁ బంపెదను." అని పలికి తోఁక చఱచి యజ్ఞవరాహము రణాంగణమందు ఘుఱ్ఱు ఘుఱ్ఱు మని శబ్దము చేయుచు నిలిచెను. అధముఁడగు నా యసురుఁడు పోరాటమున కచ్చటనే కూర్చుండి యుండెను. నేఁటికి వానితోఁ బోరాడు వానిని గాంచి యాతఁడు మేఘమువలె గర్జించి గదఁగైకొని సూకరస్వామి మీఁదఁకు వచ్చుచుండెను. ఇటునుండి యితఁడును దుమికెను. ఇద్దరును ఒకరి నొకరు పల్టీలు కొట్టించుచుండిరి.

దైత్యుఁడు తన ఖడ్గముతో వరాహమూర్తి కాలు మెత్తగాఁ గాళ్లక్రిందఁ గొట్టెను. ఈతఁడును తన వాడిగోళ్లచే వాని కాళ్లు చీరెను. అంత వాఁడీతని మడిమకు గాయ మొనర్చెను. ఈతఁడుకూడ ఆతనిని బీఁకెను. ఇప్పుడిద్దఱకును ద్వంద్వ యుద్ధము జరిగెను.

ఆతఁడీతని చీలమండలపైఁ బ్రహారమొనర్పఁగా నీతఁడాతని పిక్కలను మర్దించుచుండెను. ఆతఁడీతని మోఁకాళ్లపైఁ గొట్టెనా, ఈతఁడాతని కటిప్రదేశమునఁ గొట్టుచుండెను. ఈ సూకరము సామాన్య సూకరము కాదని తెలిసికొనిన తర్వాత భీకరమగు తనగదను దీసికొని ఈతని వక్షస్థలమున మోదెను. ఈతఁడు మాత్రము తీసిపోవువాఁడా? ఈతఁడును ఘనమగు గదను గైకొని, వాఁడు అొమ్మునఁగొట్టఁగా నీతఁడు హృదయమున బాదెను. ఆతఁడు కుడిస్థనమునఁ గొట్టఁగా నీతఁడెడమ స్తనమునఁ గొట్టెను. ఆతఁడెడమ మణిబంధమునఁ గొట్టఁగా నీతఁడు కుడి మణిబంధమును గొట్టెను. ఆతఁ డెడమ భుజమును గొట్టఁగా నీతఁడు కుడిభుజమును గొట్టెను. ఆతఁడీతని గళమునఁగొట్టఁగా నీతఁడు మెడ కంటెయెముకను గొట్టెను. ఆతఁడీతని తొండమును గొట్టఁగా నీతఁడాతని హనువును మెలిబెట్టెను. ఆతఁడడుగు పెదవిపైఁగొట్టఁగా నీతఁడెగిరి పై పెదవిపైఁగొట్టెను. ఆతఁడు కుడికణఁతపైఁగొట్టగా నీతఁడు ఎడమ కణతపైగొట్టెను. ఆతఁడు ఎడమచెవిపై గదను విసరఁగా నీతఁడు వాని కుడిచెవినిఁ బట్టుకొని మెలిపెట్టెను. ఆతఁడీతని యెడమ కంటికి గుఱిపెట్టఁగా నీతఁడు పండ్లూడఁగొట్టె, యాతని కుడికంటికి గాయమొనర్చెను. ఆతఁడీతని ముట్టెపై గదఁద్రిప్పి కొట్టఁగా నీతఁడాతని దవడ పగులఁగొట్టెను. ఆతఁడీతని వామభృకుటివైపునకు దుముకఁగా నీతఁడాతని కుడి భృకుటియందలి దంతముల వఱకు పొడిచెను. ఆతఁ డీతని మస్తకమునఁ గొట్టఁగా నీతఁడాతని ఫాలమునఁ బ్రహరించెను. ఆతఁ డీతని వెండ్రుకలపై గొట్టఁగా నీతఁ డెగిరి వాని పుఱ్ఱె

బ్రద్దలుకొట్టెను. ఆతఁడీతని శిరస్సునఁ గొట్టఁగా నీతఁ డాతని మెఱుఁగు కిరీటమును బడఁగొట్టెను. ఈవిధముగ నాతఁడటు నుండి కొట్టుటయు, నీతఁడిటునుండి కొట్టుటయు, జరుగు చుండెను. ఆతఁడటునుండి పైకిఉరుకఁగా నీతఁడిటునుండి బెద రించుచుండెను. వాఁడటునుండి యెగిరిపడఁగా నీతఁడిటునుండి కోపముచే మండిపడుచుండెను. ఆతఁడటు నెదుర్కొనఁగా నీతడిటు మెల్లగా జారుకొనెను. అటునుండి యాతని గద విసరుచే నటు ఆతనికాలు విఱిఁగెను. ఈవిధముగా వారిద్దరును ఒకరొకరు పెనుగులాడు కొనుచు, పరస్పరము బలము చూపించుకొనుచుండిరి. దేవతలు దేహములు మఱచిరి. వా రిట్లనుకొనిరి:- "ఈ దైత్యునితో నీ సూకరము గెల్వఁగల్గునో గెల్వలేదో?" వరాహమూర్తికి ఉత్సాహముపెరుగఁగా వాని నెత్తి నేలకువైచి బాది "ఓరీ, నిన్ను పచ్చడి చేయుదునా, హల్వాచేయుదునా?" అనెను.

వరాహమూర్తి కొట్టఁగా వాఁడు వెంటనే పైకి లేచెను. వరాహస్వామి ఘుఱ్ఱు ఘుఱ్ఱు మనుచు నట్లే నిలిచి పోయెను. అప్పటికి వరాహుని ధైర్యముకూడ జారిపోయెను. ఆతఁడిట్లనుకొనెను:- "వీఁడు నాకు జోడైన జోదు. కాని భయములేదు. నేఁడు నేను వీనిని యమసదనమునకుఁ బంప వలయును. వీని యీ భారీ శరీరమును బట్టలవ్యాపారి బట్టల తానును విదిలించినట్లును, చాప నల్లువాఁడు దానిని జించి నట్లు మధ్యకు వీనిని జీల్చివేసెదను. బాలురు కర్బూజాపండ్లను, పుచ్చకాయలను, పగిలినపండ్లను జీల్చినట్లు చీల్చివైచెదను. నేఁడు నేను వీనితలను కొబ్బరికాయనుబగులఁగొట్టినట్లు కొట్టె

దను. నేఁడు వీని యెముకలేరి పాఱవైచెదను. నేఁడు వీని శిరమును వీఁపువైపుగామడచి కాళ్లకతిగించెదను. టేకిబోదెల వంటి వీని దీర్ఘకరములను ద్రెంపి పాఱవైచెదను. వీఁడు దేవతలకుచేసిన యపరాధమునకు ఫలము ననుభవింపఁ జేదసెను.''
అని యిట్లాలోచించి సూకరమూర్తి గోళాకారమగు నతని తొండమునుండి విసరున నొక కోఱను పెటికి వాని ఱొమ్మున బొడిచి, కాళ్లతో వానిని నేలపై నదిమిపట్టి వానిని మధ్యకు రెం[illegible]గాఁ జీల్చివేసెను. ''వరాహామూర్తికి జయ్!, సూకర స్వామికి జయ్!''

ఛప్పయ.

హే సూకర భగవాన్! చరణ తబ శీశ నవావేఁ।
యజ్ఞరూప హైఁ ఆప శాస్త్ర అరు వేద బతావేఁ॥
స్వామిన్! సూకర రూప ధర్యో చ్యోఁ భేద బతాఓ।
ఊఁచ నీచ నహీ జీవ యహీంకా మర్మ జతాఓ॥
జిన పృథ్వీ ఉద్ధార కరి, ముదిత కరే సబ దేవగన।
తిన వరాహా భగవాన్ కీ, జయ బోలో అబ సంతజన॥

అర్థము.

వరాహామూర్తీ! నీ చరణకమలములకు శిరస్సాష్టాంగ నమస్కారము కావింతును. నీవు యజ్ఞస్వరూపుఁడ వని శాస్త్రములును, వేదములును జెప్పుచున్నవి. స్వామీ! నీవు సూకరరూపమును ధరించుటలో రహస్యమేమో తెలుపుము. ఉచ్చనీచ భేదములు నీకు లేవని తెలుపుటకా? ''ఎవఁ[illegible] పృథ్వి నుద్ధరించి సమస్త దేవగణములను సంతోషపెట్టెనో,

అట్టి వరాహభగవానునికి సమస్త సంతజనము జయజయ ధ్వానములు చేయుఁడు."

జయ్ బోలో వరాహభగవాన్ కీ — జయ్.



# అవతార కథ

## ౯౦

శ్లో॥ యేషాం స ఏవ భగవాన్ దయయే దనంతః
సర్వాత్మనాశ్రితపదో యది నిర్వ్యలీకమ్।
తే దుస్తరామతి తరంతి చ దేవమాయామ్
నైషాం మమాహమితి ధీః శ్వ శృగాల భక్ష్యే॥

— శ్రీభాగ. ౨ స్కం. ౭ అ. ౪౨ శ్లో.

చ. ఇతరముమాని తన్ను మది నెంతయు నమ్మి భజించువారి నా
శ్రితజనసేవితాంఘ్రి సరసీరుహుఁడైన సరోజనాభుఁ డం
చితదయతోడ నిష్కపటచిత్తమునం గరుణించునట్టి వా
రతుల దురంతమై తనరు సద్విభుమాయఁ దరింతు రెప్పుడున్

— శ్రీమదాంధ్రభాగవతము,

ఛప్పయ.

సూకర, హరి అరు కపిల, దత్త సనకాది తపస్వీ।
నరనారాయణ, ఋషభ, విష్ణు ధ్రువ పరమ యశస్వీ॥
హయగ్రీవ, పృథు, కచ్ఛ, మత్స్య, వామన, ధన్వంతరి।
పరశురామ, శ్రీరామ, హంస, మను బని ప్రకటేఁ హరి!॥

శ్రీబలదాఊా, వ్యాసజీ, బుద్ధ, కల్కి, ఆనందమయ।
సబ అవతారని కే పరము, అవతారీ యశుమతి తనయ॥

అర్థము.

వరాహ, నృసింహ, కపిల, దత్తాత్రేయ, సనక, సనంద, సనత్కుమార, సనత్సుజాతాది మునులు, నరనారాయణులు, ఋషభ, విష్ణు, ధ్రువ, హయగ్రీవ, పృథు, కచ్ఛప, మత్స్య, వామన, ధన్వంతరి, పరశురామ, శ్రీరామ, హంస, మను, బలరామ, వ్యాస, బుద్ధ, కల్కి. మొదలగు నవతారములను శ్రీహరి ధరించెను. ఈ యవతారము లన్నిటికంటె నానంద మయమును బరమోత్కృష్టము నగు నవతారము శ్రీకృష్ణావ తారము.

---

సూతుఁడిట్లనెను:- "మునులారా! మగయేనుఁగును ఆడయేనుఁగులు ప్రేమించినట్లు, మఱియొక జంతువు లేవియును ప్రేమింపవు. గృహములో నుండువారందఱును ప్రేమించి నప్పుడే గృహస్థునకు సర్వశ్రేష్ఠమగు సుఖము. సుఖకాలమున సుఖానుతాపమును, దుఃఖసమయమున దుఃఖానుతాపమును జెంది, బయటకు వచ్చినప్పుడు రెండు మధురవాక్కులను బలికి, దుఃఖమున ధైర్యమును జెప్పి, ఉత్సవమున నుత్సాహ మును జూపి, రాగానురాగములను జూపవలయును. కరి కరిణీయూథముల విషయమున నిట్లే. గజేంద్రుఁడు పర్వతమంత యెత్తుగలిగిన బలముగల జంతువు. వందలకొలఁది ఆడు ఏనుఁ గులు, వేలకొలఁది వాటి పుత్రపౌత్రసంతానము దానిచుట్టు

మూఁగి తిరుగుచుండెను. సాక్షాత్తుగ నీలాంజన పర్వతము దాని చిన్న పెద్ద శిఖరములతో సజీవమై తిరుగుచున్నదా యనునట్లు వాటి అన్నిటిచేఁ జుట్టుకొనఁబడి అది తిరుగు చుండెను. సమీపముననే ఒక సరోవరముండెను. దానిలో సరసిజములు వికసించియుండెను. జల పక్షులు కోలాహలమును జేయుచుండెను. దానిలో నీలజలము స్ఫటికమణివలె స్వచ్ఛముగ నుండెను. తీరమునఁ జందన, దేవదార్వాది వృక్షము లుండెను. తన పరివారమునంతను దీసికొని అది నిర్భయముగ సరోవరమునఁ బ్రవేసించెను. అంత జలక్రీడలు మొదలిడిరి. ఒక్కొక్కప్పుడు తనతొండమందు జలమును నింపుకొని ఆడు యేనుఁగులపై జల్లును. ఒక్కొక్కప్పుడు ఒకదానిని బట్టుకొని నీట ముంచును. ఒకదానికి తాను స్వయముగ స్నానము చేయించుచుండును. ఒక్కొక్కదాని ముఖమును గోకును. ఒక్కొక్కదానిని విచిత్రముఖమును బెట్టి సంతోషపెట్టును. ఒక్కొక్కదానిని తొండము నెత్తి బెదరించును. వేఱొక్క దాని నోటిలో తన తొండమును బెట్టి నీరు త్రాగించును. ఒక్కొక్కదానికి తమభాషలో పాడి వినిపించుచుండును.''

అంత శౌనకుఁ డిట్లనెను:- ''సూతా! నీ వస్యథా తలంపవలదు. మీ శైలి మాకు నచ్చలేదు. ఇప్పుడు నీవు కథ చెప్పుట మానివేసి నాటకమువలె సంభాషించు చున్నావు. కవిత్వము చెప్పినట్లున్నది. నీవిదివఱ కెట్లు చెప్పితివో అట్లే చెప్పుము.''

అంత చింతామనస్కతతో సూతుఁడిట్లనెను:- ''మును లారా! మీరు మిక్కిలి శుష్కహృదయులవలెఁ గనుబడు

చున్నారు. నేనెంతయో ఉత్సాహముతోఁ గథను జెప్పు చుండ మీరు దానికి ప్రశ్నలచే నడ్డుకలిగించి నా యుత్సాహమునకు భంగ మొనర్చుచున్నారు. నేను కథావాచకుఁడను. శ్రోతల కెట్టి రుచి కనఁబడునో అట్టికథలే చెప్పుచుండవలెను. కాని మీరందఱు గంభీరులు. మీకు నవ్వులు, హాస్యములన రుచింపదు. సరే, నేను గేవలము నామమాత్రముగనే చెప్పెదను. సంక్షేపముగనే చెప్పుదును. శీఘ్రముగనే వినిపించి పూర్తిచేసెదను.''

అంత శీఘ్రముగ శౌనకుఁ డిట్లనెను:- లేదు, లేదు సూతా! నీవు కథను సంక్షేపముగఁ జెప్పుమని మాయభిప్రాయము కాదు. చాల విస్తారముగనే చెప్పవలయును. నీయిష్టమువచినట్లు చెప్పుము. ఉత్సాహభంగ మొనర్పరాదు. కాని వాఁ డాతని గడ్డముమీఁద మోదెను, వీఁడు హనువు మీఁద బాదెను. వాఁడీతనిని గొట్టెను. ఈతఁడు వానినిఁ గొట్టెను, ఈతడు నెట్టెను. వాఁడు లాగెను, వీఁడు సాగెను అని యిట్లు లక్షణయుక్తమగు వాక్యములను తగ్గించుము తర్వాత నీయిష్టము. అవతారకథను కొంచెము గంభీరముగ జెప్పవలయుననే మాయభిప్రాయముగాని వేఱుకాదు.''

సూతుఁ డిట్లనెను:- ''ఇక్కడ నేను విస్తారముగఁ జెప్పను. ఈ స్థలమున బ్రహ్మ నారదునితోఁ గేవల మవతార సంఖ్యను మాత్రమే చెప్పెను. ఆసంఖ్యకు విస్తారముగ ద్వాదశ స్కంధమున, సమస్త భాగవతమునఁ గలదు. కావున నిచ్చట నేను సూచనగఁ జెప్పి, తర్వాత విస్తారముగఁ జెప్పఁగలను.

వినుఁడు. సరోవరమున గజమును గ్రాహము పట్టుకొనెను. అది తన కరమునఁ గమలమును ధరించి స్తుతించెను. ఆసమయమున హరి పరువిడి వచ్చెను. చక్రి చక్రముచే నక్ర వక్త్రమును వధించి దాని నుద్ధరించెను. ఈ భగవానుని పేరు హరి. ఈహరి తామసమన్వంతరమున హరిమేధ యను ఋషికి హరిణి యను భార్యయందు పుట్టెను. ఈ హరిగాక వేఱొక హరి యవతారము కలదు. ఆతఁడు రుచిప్రజాపతి యొక్క భార్యయగు దక్షిణాగర్భమున జన్మించెను. ఆతని వలన సుయామ దేవతాగణములు కలిగెను. ఈతఁడు త్రిలోకములలోని కష్టముల నన్నిటిని నివారించెను. కావుననే ఈతఁడు హరియని పిలువఁబడెను.

ఋషులారా! కర్దమ ప్రజాపతి భార్యయగు దేవహూతికి తొమ్మిదిమంది పుత్రికలు కలిగిన తర్వాత కపిల రూపమున నవతరించి, తన తల్లినే శిష్యురాలుగాఁ జేసికొని మోక్షప్రదమగు తత్త్వమును గూర్చి యుపదేశించెను.

అత్రి పత్ని భగవంతుని బుత్రరూపమునఁ బుట్టవలసినదని కోరఁగా భగవానుఁడు 'దత్త' (ఇచ్చితిని) అనెను. ఆ కారణమున దత్తాత్రేయ అవతారము అత్రిపత్నియగు అనసూయాదేవిగర్భమునఁ గలిగినది. కార్తవీర్యార్జునుఁడును, యదువును రాజ్యసుఖాదుల ననుభవించు చుండినను వారి కీతఁడు సమస్త యోగసంపత్తి నొసంగెను. ఆ భగవానుఁడే కల్పాదియందు సనకసనందన, సనత్కుమార, సనాతనులను పేర దిగంబరుఁడై తిరిగినాఁడు. ఎప్పుడు చూచినను వారైదు సంవత్సరముల యీడువారుగనే యుండిరి. ధర్మపత్నియగు

మూర్తి దేవియందు నర, నారాయణ రూపమున నవతరించిరి. ప్రభువు బదరీవనములో నివసించుచుఁ, గ్రోధమును జయించుచుఁ దపస్సుచేయు యుగ్మమును లైరి. వారింద్రునిచేఁ బంపఁబడిన అప్సరసల మీఁదఁగూడ కోపఁబడలేదు; కాని తనయూరువు నుండి త్రైలోక్యసుందరియగు నూర్వసిని సృజించి సత్కార స్వరూపమున నింద్రుని స్వర్గసౌందర్యమును వృద్ధికావించుట కాతని కిచ్చివేసెను. బాలకుఁడగు ధ్రువుని తపస్సునకుమెచ్చి ధ్రువవిష్ణువు ఆతనికి దర్శనమిచ్చి, యాతనిని ధ్రువలోకాధిపతిగ నొనర్చెను. ఉత్పథగామియగు వేనుని మునులందఱును గలిసి శపించి చంపఁగా, నాతని శరీరమంథనమున పృథ్వీశ్వరుని రూపమున పృథుచక్రవర్తి యుత్పన్నమయ్యెను. ఈతఁడు నరకమునఁ బడిన తండ్రి నుద్ధరించుటయే కాదు సమస్తోర్విని సముద్ధరించెను. సమస్తలోకమును మార్చివేసెను. భూమియందు గ్రామ, పుర, నగరాదులను నిర్మించెను. ఆ గ్రామ, పుర, నగరాదులలో నెన్నికలగోల లేకయే సమితులు తమ కార్యములను సక్రమముగ నిర్వహించుచుండెను.

నాభికి సుదేవియను భార్యయందు పరమహంస రూపమునఁ ద్యాగమహిమను బ్రకటించుచు ఋషభదేవుఁ డుదయించెను. తర్వాత బ్రహ్మయజ్ఞమందు యజ్ఞరూపమున నవతరించెను. ఆతని గ్రీవోపరిభాగమున గుఱ్ఱమాకారముండుటచే 'హయగ్రీవుఁ'డని పిలువఁబడెను. ఆతఁడు శ్వాసించుచుండిన నాసికాపుటములద్వారా వేదవాక్యములు ప్రకటమగుచుండెను. తర్వాత గొప్ప మత్స్యావతారము నెత్తెను. వేదముల నపహరించి ప్రళయసాగరమున దాఁగిన యసురుని

హా యవతారమున వెదకి వెదకి వధించెను. అమృత మంథన సమయమున నొక ద్వీపాకారమున భగవంతుఁ డొక కూర్మ మయ్యెను. ఆతని వీఁపున మందరాచలము తిరుగుచుండ నాతని కది చీమ ప్రాకులాడినట్లును, నిద్రించు వేళ కాలు గీరినట్లును, జిలపుట్టినప్పుడు దివ్యాంబరమున గోకికొనునట్లుండెను. ఆ మహా పర్వత ఘర్షణముచే కూపారాంతరమున నున్న కూర్మమునకు నిద్రరాఁగాఁ గమ్మని కూర్కులనుగూడ తీసెను. ఒకానొక ప్పుడు హిరణ్యకశిపుని సభలోఁ దన తల్లిదండ్రులు నిర్మించిన స్తంభమునుండియే యవతరించెను. అదియు సాధారణ వేష మునఁ గాదు. శిరము సింహమువలెను, మిగిలిన శరీరమంతయు మనుజశరీరమువలె నుండెను. అందువలన నృసింహుఁడను పేరఁ బ్రసిద్ధుఁడయ్యెను. అతఁడు తన తీక్ష్ణనఖములచే దుష్ట దైత్య రాజు పొట్టను జీల్చి ప్రేవులను దన మెడలో హారములుగ ధరించెను. మునులారా! ఆ భయంకరరూపమును గాంచి దేవ తలు గూడ భీతినిఁ జెందిరి. దూరమునుండియే సాష్టాంగపడిరి. మిగిలినవారిసంగతియేల, లక్ష్మీదేవియే భయపడెను. గజమును గ్రాహమునుండి రక్షించిన హరి కథను మీకు ప్రప్రథమము ననే చెప్పితిని. తనకుఁ బరమభక్తుఁడగు దైత్యాధిపుఁడగు బలిని మోసగించుటకు విచిత్రమగు కపట వామనబాలక వేష మును ధరించెను. అచ్చటికి పోయి, యాతనిఁ బ్రశంసించి యాకాశ పాతాళముల నేకము కావించెను. దైత్యరాజీతని వలలోఁబడి రాజ్యమును బోఁగొట్టుకొనెను. ఈతఁడు వైశాఖ జ్యేష్ఠమాసములందు మధ్యాహ్నపు వేళ సుడిగాలి మధ్యమున భూతము పెరిగినట్లు పెరిగెను. పాపము బలి యేమి చేయఁ

గలఁడు? విశ్వేశ్వరుఁడు నీచకర్మయగు యాచన నంగీకరించి, భిక్షుకుఁడై చేయిఁజాపఁగానే ఆనందమున నాతఁడు కట్టుపడెను. ధర్మాత్ములుగూడ భిక్షుకులకు సంబంధము తగ్గించుకొన్నను భయపడుచుందురు. ఈ విధముగ బలిచక్రవర్తి తనరాజ్యము నొసంగుటయే కాదు, తన శరీరమును, వేయేల సర్వస్వమును సమర్పించి, శాశ్వతముగ సంసార సాగర సంబంధమునుండి విడివడెను. ఆ భగవానుని వస్త్రరమాయనుండి నిమిషములో విడివడెను.

ఒకానొకప్పుడు నారదుని భక్తిభావమునకు మెచ్చి హరి హంసరూపమున నవతరించి, భక్తులు భవసాగరమును నిర్మల వాసుదేవ భక్తిద్వారా సులభముగఁ దరించు భాగవత తత్త్వోపదేశము నొనరించెను. ప్రతి మన్వంతరమున మనురూపమున నవతరించి, మన్వంతరాంతము వఱకు తీక్ష్ణ ధారగల సుదర్శనచక్రమును ధరించి నిష్కంటక శాసనమును జేయుచుండును. తన బలపరాక్రమములచేఁ బాపులను, అనాచారులను, అధర్మపరాయణులగు దైత్యులనణఁచి, తన కమనీయ కీర్తిచే సప్తలోకములను శుభ్రము కావించును. సర్వత్ర తన స్వచ్ఛయశమును వ్యాపింపఁజేయఁగలడు. మునులారా! నేను సముద్ర మంథన సమయమున కూర్మావతారమును గూర్చి చెప్పితినే, అదేసమయమున నమృతభాండమును ధరించి భగవానుఁడు ధన్వంతరిగ నవతరించెను. ఆతని వలన రోగచికిత్సలను నేర్చుకొని చాలమంది మానవులు చికత్సకులైరి. వారే వైద్యులనియు, భిషగ్వరులనియు, చికిత్సకులనియు లోకమునఁ బ్రసిద్ధులైరి. పూర్వము వైద్యులకు యజ్ఞ

భాగములు లేవు. ఈతఁడే వైద్యులకు యజ్ఞ భాగము లిప్పించెను. క్షత్రియులు స్వధర్మమును వీడి పాపకర్మలందుఁ బ్రవృత్తులుకాఁగా భగవంతుఁడు పరశురాముఁడై ఇరువదొక్క మారు పృథ్వియందు గల దుష్టక్షత్రియుల నందఱను సంహరించి నిఖిలావనిని నిఃక్షత్రియ మొనర్చెను.''

అంత శౌనకుఁడిట్లనెను:- ''సూతా! నీవిప్పుడు కొనాకులు మేయుచున్నట్లు చెప్పుచున్నావు. ఇంత తొందఱపాటు పనికిరాదు. నీవు అవతారకథను బూర్ణముగఁ జెప్పుటలేదని మా యూహ. ఊరక దిగ్దర్శకముగ మాత్రము చెప్పుచున్నావు. మరల వీటి నన్నిటిని విస్తారముగఁ జెప్పుడు. భగవచ్చరిత్రలను వినుటచేఁ గరుణ ఉదయించునట్లును, శుద్ధస్నేహ స్రోత బయలుదేరునట్లును జెప్పవలయును. కొంచెముగఁ బ్రేమామృతమును జల్లుచు నేదైన లీలనుగూర్చి చెప్పవలయును.''

సూతుఁడు దుఃఖితుఁడై యిట్లనెను:- ''ఏమి చెప్పుదును స్వామీ! కథా కథన కార్యము చాల కఠినమైనది. ఏవిధముగ నైనను శ్రోతలను మెప్పించుట చాల కష్టము. నేను కొంచెము విస్తారముగఁ జెప్ప మొదలిడఁగానే, మీరు నీవు లక్షణ యుక్తమగు ప్రాసాలంకారములతోఁ జెప్పుచుంటివను చుంటిరి. సంక్షేపము చేయఁగా కొనాకులు మేయుచున్నా ననుచున్నారు. అందుకనియే పగవానినైన కథావాచకునిఁగ భగవానుఁడొనర్పరాదు. ఒక వేళ నట్లొనర్చుచోఁ జెప్పినట్లు మెదలకుండ విను గృహస్థులకుఁ గథావాచకునిఁగఁ

జేయవలయును. ఈ సాధువు లెప్పుడు దేనిని వినఁగోరు చున్నారో తెలియుట లేదు.''

ఇది విని శౌనకుఁ డిట్లనెను:- "సూతా! నీ వన్యథా తలంచితివా యేమి?''

సూతుఁడు నవ్వుచు నిట్లనెను:- "లేదు స్వామీ! అన్యథా తలంపవలసిన పనియేమున్నది? నేను చెప్పుటలోనే యేదో దోషము కలదు.''

అంత శౌనకుఁ డిట్లనెను:- "లేదు, సూతా! నీవు చక్కఁగఁ గథ చెప్పుచున్నావు. నీ స్వరము, నీ శైలి, నీ బోధనాశక్తి ఇవన్నియుఁ జాలచక్కఁగ నున్నవి. కొంచెము విస్తారముగఁ జెప్పవలయు ననియే నాయభిప్రాయము.''

సూతుఁ డిట్లనెను:- "సరియే, స్వామీ! బ్రహ్మ నారదున కేపద్ధతిలో నీప్రసంగమును జేసెనో ఆపద్ధతిలోనే చెప్పెదను. నారద బ్రహ్మ సంవాదము జరిగినప్పుడు కృత యుగము. ఇప్పుడు నేనీచెప్పిన యవతారములన్నియు నప్పటి కయిపోయినవి. అప్పుడు పరశురామావతారము జరుగు చుండెను. అతఁడు క్షత్రియులందఱను సంహారించుచుండెను. కావున బ్రహ్మ దానికై వర్తమానక్రియను బ్రయోగించెను. శ్రీరామకృష్ణాద్యవతారము లెత్తవలసి యుండెను. ఆయా యవతారము లెత్తి, ఆయా లీల లొనర్పవలసి యుండునను భవిష్యత్ప్రథకమును వేయుచుండెను. కావున నేనిప్పు డాతఁడు చెప్పినట్లు మిగిలిన భవిష్యదవతారములను వర్ణించెదను.''

అంత శౌనకుఁ డిట్లడిగెను:- "సూతా! భవిష్య దవ తారము లెత్తక నేపోఁగా వానినిగూర్చి వర్ణించుటెట్లు?''

బిగ్గఱగ నవ్వుచు సూతుఁ డిట్లనెను:- "మహారాజా! ఒక్కొక్కప్పుడు మీరు బాలకులవలెఁ బ్రశ్నించుచుందురు. మీరు త్రికాలజ్ఞులు. కలియుగములోఁ జరుగబోవు నధర్మమును, పాపములను మీ రిప్పుడే మీ దివ్యదృష్టిచే నెట్లు చూచుచుంటిరి? బ్రహ్మకు కాలభేదమే లేదుకదా! సీతా మహాదేవిని వెదకుటకు హనుమంతుఁడు మొదలగువారు వెళ్లి సముద్రతటమునఁ గూర్చుండి 'సీతాదేవి యెచ్చటనున్నదో? ఏమిచేయుచున్నదో? ఆమెను మనమెట్లు కనుఁగొనఁగలము?' అని అనుకొనుచుండిరి. కాని శైలశిఖరమునఁ గూర్చుండిన సంపాతి అచ్చటనుండియే సమస్తసమాచారమును దెలిసికొనుచుండెను. ఆతఁ డంతయుఁ జూచుచుండెను. ఆతని కామె సంగతి యంతయుఁ దెలియును. భూత భవిష్య ద్వర్తమానములు బుద్ధికృతములు. మీరు దేనిని వర్తమాన మనుచున్నారో, అదియే ఒకానొకనికి భవిష్యత్తు. మీరు దేనిని భూతకాలమనుచున్నారో అది యొకానొకనికి వర్తమానము. కాలము నిత్యము, భగవానుఁడును నిత్యుఁడే. ఆతని లీలలు నిత్యములే. బ్రహ్మ సర్వజ్ఞుఁడు. కావున నాతనికి సృష్టిలో భూత భవిష్యత్తులు లేవు. అన్నియు వర్తమానములే. కేవలముపచారముకొఱ కాతఁడు నారదునితో భవిష్యత్తులో నిట్లు జరుగునని చెప్పుచుండెను. వాస్తవముగ నాతఁ డా ఘటనములను బ్రత్యక్షముగఁ దన భావజగత్తులో జరుగుచున్నట్లు చూచుచుండెను."

సూతుని వాక్యములను విని శౌనకుఁ డానందమును జెంది యిట్లనెను:- "సూతా! ఇప్పుఁడిక మిగిలిన యవతార

ముల సంక్షిప్తచరిత్రమును జెప్పెను. విస్తారముగ శుకుఁడు పరీక్షిన్నరేంద్రునకుఁ జెప్పినవిధమునఁ జెప్పవచ్చును.'' శౌనకుఁ డిట్లనఁగా సూతుఁడు మిగిలిన సంక్షిప్తచరిత్రములను జెప్పుట కుపక్రమించెను.

ఛప్పయ.

హైఁ అపార పురుష పార నర కైసే పావేఁ।
కాలై పూజా కరేఁ కౌనసీ వస్తు చఢావేఁ॥
శ్రీపతి సబకే ఈశ కోటి బ్రహ్మాండని నాయక।
మనవాణీ తేఁ పరేఁ చరిత కస గావైఁ గాయక॥
సహాస బదన శ్రీశేషజీ, సృష్టి ఆది తేఁ అంత తక।
కరేఁ గాన గుణగణని కోఁ, పార న పాయో అబ తక॥

అర్థము.

అపారుని పారము నరుఁడెట్లు తెలిసికోనఁగలఁడు? ఏ వస్తువును గ్రహించి పూజసేయఁగలఁడు? శ్రీపతి సమస్తమున కీశ్వరుఁడు. కోటిబ్రహ్మాండనాయకుఁడు. మనోవాక్కుల కతీతుఁ డగు వాని చరిత్రము గానముచేయు టెట్లు?

సహస్రవదనుఁడగు శేషాహి సృష్టిప్రారంభమునుండి అంతమువఱకు పరమేశ్వరుని గుణగానము చేయుచున్నప్పటికిని, ఇంతవఱకు పారము చిక్క లేదు.



# శ్రీరామ కృష్ణావతారములు

## ౯ ౧

శ్లో॥ యస్యావతార కర్మాణి గాయంతి హ్యస్మదాదయః।
న యం విదంతి తత్త్వేన తస్మై భగవతే నమః॥
—శ్రీభాగ. ౧ స్కం. ౬ అ. 32 శ్లో.

చ. తలకొని యమ్మహాత్మకుఁడు దాల్చిన యయ్యవతారకర్మముల్
వెలయఁగ నస్మదాదులము వేయివిధంబుల సన్నుతింతు మ
య్యలఘు ననంతునిం జిదచిదాత్మకు నాద్యు ననీశు నీశ్వరుం
దెలియఁగ నేర్తుమే తవిలి దివ్యచరిత్రున కేను మ్రొక్కెదన్.
— శ్రీమదాంధ్రభాగవతము.

ఛప్పయ.

మధురమూర్తి రఘునాథ సాథ సీతా సుకుమారీ।
అనుపమ జోరీ సుఘర మనోహార అతిశయ ప్యారీ॥
కైసీ హియహార చలని ఉఠని చితవని వర బోలని।
నంగే పగ తే కఠిన అవని పై వనవనడోలని॥
మనుష సరిస క్రీడా కరీ, కరుణా కర కీన్హే చరిత।
తినకూఁ గావత సునత అతి, నర నారిని కో హోయ హిత॥

అర్థము.

మధురమూర్తియగు శ్రీరామచంద్రుఁడును, సుకుమారి యగు సీతయు ననుపమానమగు దంపతులు. వీరిద్దరు మనోహార నిలయములు, ప్రేమమూర్తులు. వారి నడకలు, కదలికలు హృదయంగమములు. వారి పలుకులు చిత్తాకర్షకములు.

మృదుపాదములతోఁ పాదరక్షలు లేకయే కంటకావృతమగు కఠిన నేలలుగల వనారణ్యములందు దిరిగిరి. కరుణామయులు మానవులవలె వర్తించిరి. వారి చరిత్రను గానముచేయుట వలన నరనారీసమూహమునకుఁ గల్యాణము కలుగఁగలదు.



సూతుడిట్లనెను:- "మునులారా! కూర్మ, మత్స్య, వరాహ, హంస, నృసింహ, హయగ్రీవాదులు అఖిలేశ్వరుఁడగు నాప్రభుని యవతారములే. అవతారము లన్నియును బూజనీయములు, వందనీయములు, స్తవనీయములు. అయినను శ్రీరామలీలలలోఁ గల మాధుర్యము, చిత్తాకర్షణము ఇతరావతారములలోఁ గలుగదు. నేనా సర్వాంతర్యామి యగు పరిపూర్ణ పరబ్రహ్మయొక్క యవతారములందు భేద బుద్ధిచేసి - హెచ్చుతగ్గుల విభాగ మొనర్చి పాపభాగి నేల కావలయును? కాని మునులారా! కౌసలేయుఁడగు రామునిలోఁ గల కమనీయత, సౌందర్య మాధుర్యములు నాకెచ్చటను గనఁబడుటలేదు. ఆతఁడు ప్రేమకు ఘనీభూతమగు విగ్రహము. ఆనందరాశి. శోభాధామము. సౌందర్యార్ణవము. గుణసాగరము. మాధుర్యనిచయము. ఆహా! ఆతని యమాయకత్వ మెంతటిది? నేత్రము లెంత లజ్జాలలితములు? తలయెత్తి పైకి చూడఁడు. ఎట్టి శీలము? ఎంతటి సదాచారము? ఎంతటి సరళత? అబ్బో! ఎంతటి భక్తవత్సలత యీ విదేహరాజ కుమారి హృదయ సర్వస్వములో? ఇట్టి సౌమ్యత, ఇట్టి సౌందర్యము, ఇట్టి మర్యాద ఇంతవఱ కేయవతారములోను లేకుండెను. లేదు, ఉండఁబోదు, మునులారా! నారద సమ్మ

ఖమున నళినసంభవుఁడవతార వర్ణనము చేయుచు శ్రీరామా వతారమును, పై యవతారముల నన్నిటి నెట్లు వర్ణించెనో అట్లే వర్ణించెదను.''

బ్రహ్మ తన పుత్రుఁడగు నారదునితో నిట్లనను:—

''వత్సా! ముందు చాలకాలమునకు ఇక్ష్వాకు వంశములో మాయాపతియగు భగవంతుఁడు తన కళలతోఁగూడ దశరథ తనయుఁడై భాగ్యవతియు జగద్వంద్యయు నగు కౌసల్యాదేవి గర్భమున నవతరింపఁగలఁడు. ఆతని యవతారమునకుఁ బ్రధానహేతువు – భక్తుల ననుగ్రహించుటయే. మునులారా! శ్రీరాముఁ డెంతటి దయాళుఁడు! ఎంతటి కృపాళుఁడు! ఆతనికి ఉచ్చ నీచ భేదములు లేవు. ఆతఁడు మహాజ్ఞాని. సర్వశాస్త్ర విశారదుఁడు. గురువులకు గురువు (గురూణాం గురుః) వేద శాస్త్రార్థ పారంగతుఁడగు వశిష్ఠభగవానుని సంగతికిని బోవును. ఆ ప్రీతితోడనే, ఆ భావముతోడనే, ఆ యనుగ్రహముతోడనే నిషాదరాజగు గుహునిఁ గౌఁగిలించుకొనును. ఆతఁ డత్తవా రింట పరమజ్ఞానియుఁ, బరమ విరాగియు, సంపూర్ణైశ్వర్య పూర్ణుఁడగు జనకమహారాజుయొక్క భార్యలును, తన కత్త లును స్వయముగఁ జేసిన నానావిధ వ్యంజనములను దినును, ఆ ప్రీతితోడనే, ఆ ఉల్లాసముతోడనే అక్కడకంటె నింకను మిక్కిలి ప్రీతితో నాటవిక భిల్లపత్నియగు భిల్లినియగు శబరి తెచ్చిన యెండిన యెంగిలిపండ్లను లొట్టలువేసికొనుచుఁ దినఁ గలఁడు. సప్తద్వీపవతియగు వసుంధరకుఁ బ్రభువును, అనేకము లగు రాజసూయములను, నశ్వమేధ యాగముల నొనర్చిన

వాఁడును, దేవేంద్రుని యర్ధసింహాసనమునగూర్చుండినవాఁడును, ఋషులచేతను మహర్షులచేతనుగూడ సమ్మానమును బొందిన వాఁడును, తన తండ్రియు, మహారాజాధిరాజగు దశరథమహా రాజును శ్రద్ధాభక్తులతోడను, నమ్రతతోడనుసేవించును. అదే భావముతో — కాదు — అంతకుమించిన ప్రేమను బ్రదర్శించుచు, మాంసభోజియు, లోకనిందితములగు సమస్త పక్షులలో నధమమును, సాధారణమగు నధమమేకాదు — ఆపక్షి యెవని గృహముపై నైనను వ్రాలెనా, దానికి మరల శుద్ధి సంస్కారము కావింపవలసినదే. అట్టి గృధ్రజాతి పక్షిని వడిలోఁ బెట్టుకొని, తన తల జడలతో దానిపైఁబడిన ధూళిని దులిపి, తనయుఁడు తండ్రికి తర్పణాదు లొనర్చునట్లు, నీచ జాతి పక్షియగు జటాయువునకుఁ గ్రియాకర్మ లొనర్చెను. సౌందర్యనిధియు, సుశీలతావతారమును, కోమలతకూడ యెవని కోమలత్వమునుగాంచి లజ్జించునో, అట్టి ప్రేమావ తారుఁడగు భరతుఁడు అన్నయగు దనపాదములపైఁ బడఁగా నెట్టిప్రేమతో, నెట్టిమమకారముతో లేవఁదీసి కౌఁగిలించు కొనెనో, అంతకంటె నెక్కువ ప్రేమతో నాటవికులును, జంచలులును, దీర్ఘనఖులును, నెఱ్ఱమూఁతులు కలవారును, పెద్దగడ్డములు కలవారును, శరీర నుంతట రూక్షములగు వెండ్రుకలు కలవారు నగు హనుమదాది వానరులనుగూడ కౌఁగిలించుకొని స్నేహదాన మొసంగును. వారితో నిట్లను చుండును:— "మీరు నా తమ్ముఁడగు భరతునికంటె నధిక ప్రీతిపాత్రులు." వత్సా! నారదా! శ్రీరాముని కెనయగు దయాళు వీ జగత్తునందు వెదకిన నెచ్చట దొరుకఁగలఁడు?

ఆతని సమత్వమునకు సాటియగు సమత్వ మీ లోకమున నెంత వెదకినను దుర్లభము, అసంభవము, అభూతపూర్వము.

అట్టి భగవంతుఁడు సరయూనదీతటమున నయోధ్యాపురియం దవతరింపఁగలఁడు. పిత్రాజ్ఞచేఁ దమ్ముఁడగు లక్ష్మణునితోడను, ప్రాణప్రియయగు వైదేహితోడను వనముల కేగఁగలఁడు. అచ్చట దశముఖుఁడగు రావణుఁ డాతని ప్రాణప్రియయగు సీతను మోసమున హరింపఁగలఁడు. అంత నాతనిపైఁ గ్రుద్ధుఁడై తనశరణాగతవత్సలతను బ్రదర్శించుచు సీతను వెదకించును. అంత గొప్ప వానరసేనను సమకూర్చుకొని, సముద్రమునకు సేతువునుగట్టి, ఆవలనున్న లంకకుఁ జేరఁగలఁడు. ఐరావత దంతఘట్టనముచే గుంటపడిన ఱొమ్ముగల దశకంఠుఁడును, వింశతిభుజుఁడు నగు రావణుఁ డాతనితోఁ బోర రాఁగలఁడు. వాని నీతఁడు తన తీక్ష్ణశరములచేఁ గొట్టి వైకుంఠమునకుఁ బంపఁగలఁడు. తనయశమును సర్వలోకములఁ వ్యాపింపఁజేసి, దుఃఖితయై తన వియోగముచేఁ గృశించియున్న ప్రాణప్రియయగు జానకీదేవి యశ్రువులను తనకోమల కరకమలములచేఁ దుడిచి యిట్లనును:- "ప్రియా! నీకు నేను జ్ఞాపకమున్నానా? నేను నిరంతరము నిన్ను ధ్యానించుచునే యున్నాను."

ఆతర్వాత నారదా! దైత్యదానవులచే లోకమంతయుఁ బీడింపఁబడఁగా నాసమయమున దాని భారము బాపుటకు భగవంతుఁడు తన కేశములలో నలుపు తెలుపు వెండ్రుకలచేఁ గృష్ణ బలరాముల రూపమున నవతరించి, సాక్షాచ్ఛ్రీకృష్ణ రూపమునఁ దానే యవతరించును. అనఁగా భూభారము

నణఁచుట కాతని వెండ్రుక ఒక్కటి చాలును. కావున నాతని కళాద్వారా దుష్టకర్ములగు దైత్యులను జంపి భూభారమును దీర్పఁగలఁడు. మానవబుద్ధి కతీతమగు కర్మల నొనర్పఁగలఁడు. నారదా! ఈ యవతారము విషయమున నేమైనఁ జెప్పుటకు గాని, యోచించుటకుగాని వీలులేనట్టిదిగ నుండును.

నారదుఁ డిట్లనెను:- "తండ్రీ! ఇంతకు ముందుగా నీవు రామావతారము అభూతపూర్వమగు నవతారమంటివి. ఇట్టి సౌమ్య, సరళ, సుందర, సదాచారపూర్ణ, సత్యస్థిత, శరణాగతవత్సల, సర్వసమర్థ, సర్వగుణసంపన్న మగు నవతారము 'న భూతో న భవిష్యతి' అంటివి. ఇప్పుడు నీవు శ్రీకృష్ణావతార విషయమునను అట్లే అనుచుంటివి."

నారదుని వాక్యములు వినఁగానే బ్రహ్మ కన్నుల నీరు గిఱ్ఱున నిండఁగా నిట్లనెను:- "నారదా! భగవదవతారములన్నియు నొకదానికంటె నొకటి శ్రేష్ఠములు. అన్నియుఁ బరిపూర్ణములే. అన్నియు సుందరములే. అన్నియు నవాఙ్మానసగోచరములే. అయినను అన్నిటిలో శ్రీరామ, శ్రీకృష్ణావతారములు రెండే ప్రాణుల కానంద మొసఁగునవియైయున్నవి. ఈ రెండు నొకే పరాత్పరుని పూర్ణావతారములైనప్పటికిని, వీనికి ఆకాశపాతాళములకును, దివారాత్రములకును, హేమంత గ్రీష్మఋతువులకును, స్త్రీపురుషులకును ఉన్నంత భేదమున్నది. శ్రీరామునిలీలలు చెప్పవలసినదే మున్నది? ఒకదానికి మించి ఒకటి సుందరములై యున్నవి; కాని కృష్ణుని విషయములో నడుగవలసినదే లేదు. కోసలేంద్రుని లీలలకుఁ బూర్తి విరుద్ధము

లీ మహాత్ముని లీలలు. అనుకరణీయములు శిక్షాపూర్ణములగు లీలలు శ్రీ దశరథకుమారునివే. కృష్ణునిమాత్రము మనము తెలిసికొనలేము. తాను వంకర, లీలలు వంకరవి. ఈతని చాలనము, నడక, నవ్వు, సైగ, మాట, పాట అన్నియుఁ గృత్రిమములే. అందుకనియే నారదా! నే నందఋకును జాగ్రత్తగ నుండుఁడనియుఁ బూజ చేయవలసియుండినను, ఉపాసన చేయవలసియుండినను శ్రీరామచంద్రునకే చేయవలెననియు చెప్పితిని. భక్తి చేయఁదలఁచిన శ్రీ సీతారామ మహారాజాధిరాజ దంపతులకే చేయవలెను. ఈ పోకిరివానివైపు పొరపాటున నైనఁ జూడరాదు; ఏలననఁగా నీతని నొక్కసారి చూచెనా వాని నీతఁడు దిగంబరునిఁగ జేయఁగలఁడు. మనకిష్టము లేకున్నను బలపూర్వకముగ దొంగతనముగ వస్త్రము లెత్తుకొని పోఁగలఁడు. సాధకున కిష్టమున్నను, లేకున్నను ఈతఁ డాతనిని దనవైపున కాకర్షింపఁగలఁడు. బలవంతముగ దాసునిఁగ నొనర్చుకొనిన ఫరవాలేదు, కాకున్న వానికి ముక్కు చెవులు కుట్టించి, గాజులు తొడిగించి, మెట్టెలు పెట్టించి ఆడుదానిని జేసి వదలివేయును. కావున నాయనా! ఈ వ్యత్యస్తపాదునకు, ఈ శిఖిపింఛమాళికి దూరముననుండి నమస్కరింపవలయును. ఇఁక మహారాజాధిరాజును, చక్రవర్తియు, బ్రహ్మాది దేవతలకుఁగూడ పూజనీయుఁడును, మర్యాదపురుషోత్తముఁడగు కోసలేంద్రునకు శరణాగతి చేయవలెను. సింహాసనాసీనుఁడగు సామ్రాట్టు ఎక్కడ? గోవులవెంట వన వనములు తిరుగు గోపకుఁ డెక్కడ? అన్నివిషయములలో నీతఁ డాతనికి విపరీతమే.

"శ్రీరామచంద్రుఁ డెంతటి సౌమ్యుఁడు? ఆకుపచ్చని మఖమలు దుస్తులు ధరించి, చేత ధనుర్బాణములు ధరించి, పచ్చని పట్టుపీతాంబరమును ధరించి, స్వర్ణమండిత కిరీట ముకుటమును ధరించి, చిరుసిగ్గుతో నేలను జూచుచు నడచు చుండ హృదయము ద్రవించును. చూడుము, ఎంతటి మర్యాదయో! తలయెత్తి పైకి చూచుటయే యెఱుఁగఁడు. ఇఁక నీగోపకునిఁ జూడుము. మహాపోకిరి. తూర్పునకుఁ బోవు చుండిన పడమర చూచుచుండును. కన్నులు కన్నులు కలిపి మాట్లాడుచుఁ బోవుచుండును. కనుబొమ్మలతోడను, రెప్పల తోడను సైగలుచేసి చెప్పుచుండును. సిగ్గులేదు శరము లేదు. గ్రామీణస్త్రీయనియు లేదు, తనకు సంబంధించినవారనియును లేదు. వరుస లేదు వాయి లేదు. బయలు దేరెనా యేదియో గోలచేయుచు బయలు దేరును. ఎక్కడికి వెళ్లినను గోలతప్పదు. సముద్రమునకు ఆటుపోట్లున్నట్లు, ఈతనిరాకచే స్త్రీపురుషుల లోను, బాలకులలోను ఒకరకమగుతుపాను చెల రేగుచుండును.

శ్రీరామచంద్రుఁ డెంతటి సరళమూర్తి! ఈతని కెవరైన దేనినైన నర్పించెనా, భక్తితో సీతనిని బూజించి నైవేద్య మర్పించెనా, ఈతఁడు అల్లుఁడత్తవారింట వదినె, మరదండ్ల దగ్గఱను, అత్తదగ్గఱను బిడియముతో పదార్థ ములను గొంచెము కొంచముగ నంజుచుఁ దినునట్లు కొంచెము కొంచెముగఁ దినును. ఇఁక నీ కృష్ణుని సంగతి చెప్పవలదు. ఈ గొల్లవాని కిచ్చునదెవరు? బలవంతముగఁ దీసికొని తినును. త్వరత్వరగాఁ గొంత తినును. కొంత నోటిలోఁ గ్రుక్కుకొనును. కొంత పాఱవేయును. కొంత పంచిపెట్టును.

పాలవులకు ఎంగిలిచేసి నోటిలోఁ గ్రోఁతి గ్రుక్కుకొనినట్లు గ్రుక్కుకొని, యెంగిలి నోటితోడనే పరువిడి పోవును. శీల సంకోచములు లేనే లేవు.

ఇఁక సౌందర్యము విషయము కలదు. ఈవిషయ ములో నారదా! నేనేమియుఁ జెప్పఁజాలను. ఏలననఁగా నది వారివారి రుచినిబట్టి యుండును. ఒకానొకఁ డందఱకు సుందరముగ నుండిన మిగిలినవారికి అసుందరుఁడుగఁ గోచ రించుచుండును. కావున వీరిద్దరిలో సుందరుఁ డెవఁడో భక్త మహాశయులు తమంతటఁ దామే నిర్ణయించుకొన వలయును. ఇఁక సదాచారము విషయము కలదు. ఆహా! శ్రీరాముఁడెట్టి సదాచారుఁడు? ఆతనికి భగవతియు, జగజ్జననియు నగు జానకీదేవి తప్ప మిగిలిన స్త్రీలలోఁ బెద్దవారందఱు కౌసల్యా మాతతో సమానులే, తన యీడు స్త్రీలందఱు అక్కయగు శాంతమ్మతో సమానులు. తన కంటెఁ జిన్నవాఁరందఱు కూఁతుండ్రవంటివారు. నారదా! నీ కెక్కడ అత్తవారు లేరు కావున నీకెట్లు బోధపఱుపఁగలను? అత్తవారే గ్రామ ములో నుందురో ఆ గ్రామములోని యువతీయువకులు, స్త్రీ పురుషు లందఱు వరుని వరుస చేసికొని వరుసలాడుచుందురు. అట్లే వరునకును అత్తవారింటిలోని వారివలె నాగ్రామస్థులును వరుస చూచుకొని యెగతాళి పరిహాసములకు అధికారముం డును. కాని కౌసల్యానందవర్ధనుఁడగు రామచంద్రుఁ డెన్నఁ డైన నత్తవారింటికి పోయెనా, ఎచ్చటికిని బోఁడు. ఇంటనే యుండును. బావమఱఁదులు, వదినె మఱదండ్లు వచ్చి పరి హాసము లాడెనా, వారివైపునకుఁ దలయెత్తి నెత్తఁడు. ప్రత్యు

త్తరమిచ్చుట తరువాత. పలుక నే పలుకఁడు. అప్పుడు విదేహ రాజాధీశ్వరియు, రాముని కత్తయు నిట్లు వారినందఱను గసురు చుండును. "పిల్లలారా! ఎందుకు మానాయనకు బాధ కలిగించుచున్నారు? మీరు ఎగతాళి పరిహాసములు చేయఁదలఁచిన లక్ష్మణుని దగ్గఱకు పొండు. మా రామన్నకు మాట్లాడుటే చేతగాదు." ఇది ఆతని అత్తవారింటి సదాచారము. ఇఁకఁ గృష్ణుని విషయమును జూతమా? ఆతని నెప్పుడు చూచినను పల్లెపడుచులతో నవ్వులాటలు, పరిహాసములు. వారొకటి అనెనా యీతఁడు పది అనును. ఈతని నెవరైన నొక్కతిట్టు తిట్టెనా వారికి వేయి తిట్లర్పించును. ఎవరైన నీతనిని వేళాకోల మొనర్చిరా, ఈతఁడు వారి నెత్తికెక్కి కూర్చుండును. ఎక్కువగా నడుగవలదు. ఇదికూడ నవతారమేనా? అవతార మనిన నాపద్విగ్రహమా?

ఇఁక సత్యము విషయమున వినుము. ఆహా! రాముఁ డెంతటి సత్యపరాయణుఁడు! వనములకు వెళ్లుమని దశరథుఁడు తన నోటఁ జెప్పలేదు. కైకేయి నోటవినఁగానే వెళ్లిపోయెను. లక్ష్మణుఁడు కొంచెముగ హెచ్చుతగ్గుల మాటలు పలికి అన్నను అడవికి వెళ్లవల దనఁగా నాతఁడు మేఘగంభీర స్వరమున నిట్లనెను:– 'రామో ద్విర్నాభిభాషతే' 'రాముఁ డెన్నఁటికి నబద్ధము పలుకఁడు, నోట నేమాట వచ్చినదో అది జరిగితీరవలసినదే. రాముని వాణి, బాణము ఒక్కసారియే'. ఇఁక నీజారచోరశిఖామణి సంగతి వినుము. ఒంటరిగాఁగాదు. అందఱ సమక్షమున మన్నుఁదినెను. తల్లి కొఱడా తీసికొని 'ఏమిరా! నీవు మన్నుఁ దింటివా?' అని

అడుగఁగా గొప్ప సత్యవంతునివలె అమ్మ విడుచుకొని యిట్లనెను. "అమ్మా! వీరంద అబద్ధమాడుచున్నారే. నేను మట్టిని తాఁకనే తాఁకలేదే!" దీనిపేరే దొంగతనము, దుర్మార్గము. ప్రతి దినము రహస్యముగా వృషభానుపురము నకు (రాధయుండు గ్రామము. ఇప్పుడు దానికి బర్సానా అని పేరు.) బోవును. తల్లి - "ఏమిరా! వివాహ నిశ్చయ మింకను గానిది నీవు వృషభానుపురము నైపునకు వెళ్లెద వేమిరా?" అనఁగా నప్పుడాతఁడు దృఢముగా "లేదమ్మా! నాకు వృషభానుపురము త్రోవే తెలియదమ్మా" అనును. అబద్ధ మెంతవఱ కాడదగునో అంతవఱ కాడినాఁడు. చివరకు తన తల్లితోడనే యింతటి శుద్ధఅబద్ధము!

ఇఁక శరణాగతవత్సలత విషయము చూతము. ఈ విషయములో శ్రీరామచంద్రమూర్తి లోకమునఁ బ్రసిద్ధుఁడు. కొందఱు రావణుని దూతలు క్రోఁతులై శ్రీరాముని సేన లోనికిఁ జొచ్చిరి. వానరసేనాపతులు వారిని బట్టుకొనిరి. వారిని దన్నుచుఁ గొట్టుచు శ్రీరాముని దగ్గఱకు తీసికొని వచ్చిరి. అప్పుడు శ్రీరాముఁడు దయావశుఁడై, కరుణావశీ భూతుఁడై వెంటనే యిట్లనెను:-"వీరిని వదలిపెట్టుఁడు, వదలి పెట్టుఁడు. ఎట్లైనఁగానిండు, కపటమున నగుఁగాక, వీరు వానర రూపమును ధరించిరి. వానరులందఱు నన్ను శరణుజొచ్చిరి. కావున వీరిని దండించుట ఉచితముకాదు." శత్రువగు రావ ణుని తమ్ముఁడు విభీషణుఁడు సరిగా యుద్ధసమయమునకు వచ్చెను. సేనాపతులందఱును వానికి వ్యతిరేకముగ నుండిరి; కాని శ్రీరాముఁడు ప్రతిజ్ఞాపూర్వకముగ నిట్లనెను:- "ఒక్క-

సారి నన్ను శరణువేఁడెనా, ఒక్కసారి నేను నీవాఁడననెనా
వానికి నేను ప్రాణిమాత్రులనుండి అభయ మొసంగెదను.''
ఇంతటి కరుణ, ఇంతటి భక్తవత్సలత, ఇంతటి శరణాగత ప్రతి
పాలకతగల రాముఁడెక్కఁడ? ఈ గోపకుని నిష్ఠురత ఎక్కఁడ?
పూతన తల్లియై వచ్చెను. దానిని జంపెను. చంపినను సుగతి
నొసంగెననుకొనుఁడు. ప్రాణములు హరించినాఁడు గదా!
ఎవరి ప్రాణములందు వారికి తీపి. కావున నిది మాతృద్రోహ
మైనది. ఒక యసురుఁడు గోపవేషమునరాఁగా వానిని విడదీసి
గోపకులచేఁజంపించెను. ఈతఁడు సఖాద్రోహి. ఒకయసురుఁడు
వత్సమై వత్సములలోఁ దిరుగుచుండెను. వాని తోఁకఁ బట్టు
కొని గిఱ్ఱునఁ దిరుగుచుండఁగనే చచ్చునట్లు గిఱ్ఱునఁ ద్రిప్పి
చంపెను. ఇది శరణాగతమటుంచి విశ్వాసఘాతము, గోహత్య
కూడా. రామచంద్రుఁడుకూడ మారీచునిఁ జంపినాఁడుకదా
యని నీవనవచ్చును. ఆతఁడు మృగరూపమును ధరించెను.
రాజు మృగమును వధింపవచ్చును. అదియునుగాక రాముఁడు
దానిని బట్టుకొనఁదలఁచెను, వాఁడు చావఁదలఁచెను. అందు
వలన రాముఁడు తన కోరికను వదలుకొనెను. వాని కోరికనే
నెఱవేర్చెను. ఇఁక సీతని విషయమును జూడుము. మధురలో
నా చాకలివాఁడేమి చెఱుపుచేసినాఁడు? ఇతరుల గుడ్డల నుదికి
తీసికొనిపోవుచుండ వానిని నిలిపి నాకు గుడ్డలిమ్మని అడుగ
వచ్చునా? ఈతనికేల యీయవలయును? ఒకరిగుడ్డ లింకొకరి
కిచ్చిన నింక చాకరికముండునా? ఒకవేళ బలవంతుఁడైనచో
వాఁడిచ్చినతర్వాతఁ గంసుని జంపి లాగుకొనవలయునుగాని
నిర్బలులపై బలమునుజూపి, బీదలను బాధించి లాగుకొనుటా?

కాని వినువారెవరు? ఇది గ్రుడ్డిప్రపంచము. వాని నొకచెంప పెట్టు పెట్టి చంపి, చౌకులోనే యితరులుధరించిన ప్రాతగుడ్డలు లాగుకొనెను. ఇది దాసద్రోహమైనది. మామ తండ్రివంటి వాఁడు. వానిని జంపుటయేకాదు, జుట్టు పట్టుకొని యీడ్చుకొనుచు యమునానదివఱకు లాగుకొనిపోయెను. శ్రీరాముఁడు కూడ బ్రాహ్మణపుత్రుని జంపెనని నీవనవచ్చును. వాఁడు రాక్షసుఁడు. ఆతతాయి. వాఁడు గొప్ప యపరాధ మొనర్చెను. రాఘవుని ధర్మపత్నిని హరించినాఁడు. సాధారణ పురుషుఁడైనను స్త్రీవైపు కుదృష్టితోఁ జూచెనా మనస్వులగువారు వాని కన్నులను దోడవలయును. అదియునుగాక వాఁడు కామభావముతోఁ గొనిపోయెను. పది నెల లాతనికడ నుంచుకొనెను. అనేక యాతనలపాలు చేసెను. ఇంతఁ జేసినను కృపాళుఁడగు శ్రీరామచంద్రుఁ డిట్లనెను:– "ఆతఁడు వచ్చి శరణువేఁడెనా వాని యపరాధము లన్నిటిని క్షమించెదను." కాని, యాతఁడు చావగోరుచుండెను. రఘుకులచంద్రుని బాణములచేఁ జచ్చుటచేతనే ఆతనికి కల్యాణము కలదని తలంచెను. రాఘవుఁడు దుఃఖముతో నాతని మనోరథమును నెఱవేర్చెను; కాని సదా దుఃఖముతోడనే యుండెను. ఆతని జంపిన యపరాధమునకుఁ బ్రాయశ్చిత్తముగ గొప్పగొప్ప యశ్వమేధయాగము లొనర్చెను. సదా తాను బ్రహ్మఘాతినని ఖిన్నుఁడయ్యెడువాఁడు. కాని, యీ మాయా నటకుని ముఖమున నొక్క విషాదరేఖయైనఁ గనఁబడదు. మామను జంపి, ఆతని ధనసంపత్తుపై తన అధికారమును చలాయించెను. చిన్నతనమునుండియుఁ బెంచి పెద్దవానినిఁ జేసిన యశోదా

నందులను నిమిషములో మఱచెను. ఇట్టివానియెడల నాశ పెట్టుకొనిన నెవనికైన నేమి ప్రయోజనము? ఈ విధముగ నారదా! భజనీయుఁడు, స్మరణీయుఁడు శ్రీరామచంద్రుఁడే. కాని నల్లనివాఁడు, కృత్రిముఁడు, ఉత్పాతి, జార చోర శిఖామణియగు నీ గోపాలుఁడు గట్టివాఁడు. ఈతఁ డట్టి గట్టివాం డ్రను దనవైపునకు లాగుకొనును. బుద్ధిపూర్వకముగ నీతని యేగుణములు చూచి యీతనిదగ్గఱకు జేరుదురు? ఈతఁడు గుణహీనుఁడగు నిర్గుణుఁడు. శీల సంకోచములు లేవు. సదాచారము లేదు. అలికి ముగ్గులు పెట్టుకొనిన గోపికాగృహములను మాపివేయుచుండును. దాఁగి, దొంగతనముగా వెన్నముద్దలను దొంగిలించును. దొంగిలించి దానిని తాను గొంత తిని, కొంత క్రోఁతులకును, తోడిబాలురకును బంచిపెట్టును.

శ్రీరామచంద్రుఁడు ప్రతి త్రేతాయుగాంతమున నవతరించి లోకమున ధర్మమును స్థాపించును. మర్యాదను స్థాపించును. సాధువులను రక్షించును. భక్తులకు సుఖ మొసంగును. కాని యీ గోపాలుని సంగతి అంతయుఁ దలక్రిందులే. నియమము లన్నియు ననిశ్చితములే. ఈతఁడు భూమిపై నెప్పు డవతరించునో యెవనికిని దెలియదు. ఈసారి, యీ యిరువ దెనిమిదవ ద్వాపరాంతమునఁ గలియుగ సంధిలో నవతరించునని వినికిడి.

బాల్యముననే పూతనను జంపును, తృణావర్తుని మడియించును, శకటాసురుని భంజించును. నవనీతము హరింపఁగాఁ దల్లిచేఁ గట్టఁబడును. యములార్జున వృక్షముల మధ్యగాఁ బోవుచు వాటిని ఉలూఖల సహాయమునఁ బెల్లగించును.

యమునానది నంతను విషమయమొనర్చు కాళీయ విషధర మదము నణంచును. గోపకుల దావానలమునుండి రక్షించును. తల్లి నడుమునకుఁ ద్రాడుకట్టఁగాఁ ద్రాటియందు తనయనంత రూపమును జూపి గోపకులకును దనతల్లికిని పరమ విస్మయమును గొల్పును. ఆవలింపున నోట విశ్వరూపమును జూపించును. తన తండ్రియగు నందుని వరుణ పాశమునుండి వదలించును. వ్యోమాసురునిద్వారా భయభీతులైన గోపకులను వానిని జంపి కాపాడును. గోకులవాసులగు గ్రామీణ గోపకులకు తన దివ్యగోలోక వైకుంఠమును జూపఁగలఁడు. నందునిచే గిరిరాజపూజ గావింపఁ జేయును. ఇంద్రపూజను మాన్పించి, యింద్రునకుఁ గోపము వచ్చునట్లు చేయును. ఆతఁడు వర్షింపఁజేయఁగా తన చిటికెనవ్రేలిమీఁదఁ గొండ నెత్తి, వర్షముచే భయభీతులగు గోపకుల నిర్భయులఁ గావించును. ప్రేమోన్మత్తలగు గోపికలతో రాసక్రీడలాడి వారిని పరమభాగ్యవతులుగ నొనర్చును. వారితోఁ బరిహాసములాడు చంద్రచూడుఁడను యక్షుని యమసదనమునకుఁ బంపును. వీరుగాక ప్రలంబ, ధేనుక, బక, కేశి, అరిష్ట, చాణూర, ముష్టిక, కువలయాపీడ (ఏనుఁగు), కంస, కాలయవన, నరక, పౌండ్రక, శాల్వ, ద్వివిద (కపి), వల్వల, దంతవక్త్రి, నగ్న జిన్నరేశ్వర, వృషభసప్తకమును, శంబర, విదూరథ, రుక్మి, కాంభోజ, మత్స్య, కురు, కైకయ, సృంజయాద్యసురులు భూమిపై రాజవంశములఁ బుట్టఁగాఁ గొందఱను దానును, గొందఱ నర్జునునిచేతను, మఱికొందఱను బలరామాదుల చేతను జంపించును. వారు చచ్చియు నాతని లోకమునకుఁ

బోవుదురు. వారు సంసార చక్రమునఁ బడక మోక్షమును బొందఁగలరు.

ఈవిధముగ నీవిలక్షణావతారము కలుగును. ఈ యవతారములోని లీలలన్నియుఁ బరమాద్భుతములు. క్రోధములోను నీతని ప్రేమ ప్రకటమగును. శృంగారములోను ఈతఁడు కరుణాస్రవంతిని బ్రవహింపఁజేయును. ఆట పాటలలోఁగూడ నీతఁడు గోలోక సుఖమును బ్రసాదించును. ఆతనిని దర్శించిన వారికిని సంసారమునుండి తరింపఁజేయును. నామము పలుకు వారల నమరులఁ గావించును. ప్రేమించువారి విషయము చెప్పవలసినదేమున్నది. ద్వేషించువారికిఁ గూడ పరమ ధామమును బ్రాప్తింపఁజేయును. పైకి గోచరించు విపరీత క్రీడలందును నీతఁడు దివ్యరసము నాస్వాదింపజేయును. ఈతని లీలలు వినుటకైన నందఱ కధికారము లేదు. కావున నారదా! ఇప్పుడీ యవతార విషయములు నీతో నేమని చెప్పుదును? 'మానవుఁడు వర్ణింపఁజాలఁడు. జీవోద్ధరణ మెట్లు కలుగును? ఉద్ధరించునవి భగవల్లీలలొక్కటియే. సర్వదా శ్రవణీయమైనది శ్రీకృష్ణచరిత్రయే. దీని ప్రచారమెట్లు కాఁగలదు?' అని భగవంతుఁ డూహించి, తానే వ్యాసరూపమున నవతరించి తన లీలలను వ్రాయఁగలఁడు. దానిని తన సుతుఁడగు శుకునకు నేర్పఁగలఁడు. శుకుఁడు పరీక్షిత్తునకు వినిపింపఁగలఁడు. శ్రీశుక మహర్షివలన సూతుఁడు శ్రవణముచేసి నైమిశారణ్యమందు శౌనకాది మహామునులకు వినిపింపఁగలఁడు."

సూతుఁ డిట్లనెను:- "మునులారా! ఈ విషయము బ్రహ్మ నారదునితో నిదివఱకే చెప్పియుండెను. అట్లే నేను

మీకు కథను వినిపించుచున్నాను. ఇప్పుడేమి చెప్పవలయునో శలవిండు.''

ఛప్పయ.

చంచల చపల చటోర చోరయే అతి హీ ఖోటే।
బరబస ఖేఁచే చీర, లగే దేఖన మేఁ ఛోటే॥
బాహిర భీతర శ్యామ నయన తిరఛే అనియారే।
తీఖే విష తేఁ బుఝే వాన సమ తేఊ ప్యారే॥
మన మందిర మహఁ మోహనా, మాఖన కే హిత మచలిజా।
అరే, లడై తే నంద కే, ఆజా మోకూఁ పిచిలిజా॥

అర్థము.

కృష్ణుఁడు పోకిరి, చపలుఁడు, జిహ్వాచాపల్యము కలవాఁడు, చోరుఁడు, మిక్కిలి క్షుద్రుఁడు. చూచుటకుఁ జిన్నవాఁడే కాని బలాత్కారముగ జీరలను హరించినాఁడు. లోపల వెలుపల నల్లనివాఁడు. సుందరకోరచూపులుగల నయనములు గలవాఁడు. తీక్ష్ణవిషమును శాంతింపఁజేయువాఁడు. మనోవీథిని నెల్లప్పుడును విహరించు నవనీతచోరుఁడు నవనీతముకొఱకు మారాము చేయుచుండెను. ఓ నందకిశోరా! నా వెనువెంట రమ్ము.



# అన్యావతారములు

౼౨

శ్లో॥ విష్ణోర్ను వీర్యగణనాం కతమోఽర్హతీహ
యః పార్థివాన్యపి కవిర్విమమే రజాంసి ।
చస్కంభ యః స్వరభసాస్ఖలతా త్రిపృష్ఠం
యస్మాత్ త్రిసామ్య సదనాదురు కంపయానమ్॥
—శ్రీభాగ. ౨స్కం. ౭అ. ౪౦శ్లో.

"ధరణీ రేణువుల నయిన గణుతింప నలవియగుం గాని యమ్మహాత్ముని లీలావతారాద్భుత కర్మంబులు లెక్కవెట్ట నెవ్వరికి నశక్యంబై యుండు నీకు సంక్షేపరూపంబున నుపన్యసించితి సవిస్తరంబుగా నెఱింగింప నాకుం దరంబు గాదనిన నన్యులం జెప్పనేల వినుము.

చ. అమర త్రివిక్రమస్ఫురణ నందిన యమ్మహితాత్ము పాదవే
గమున హతంబులైన త్రిజగంబుల కావల వెల్గు సత్యలో
కము చలియించినం గరుణఁ గైకొని కాచి ధరించు పాదప
ద్మము తుది నున్న యప్రతిహతంబగుశక్తి గణింప శక్యమే॥
—శ్రీమదాంధ్ర భాగవతము.

ఛప్పయ.

కల్కి బుద్ధ బని వ్యాస, కరహిఁ జగ కారజ నటవర ।
మాయా అపరంపార విలక్షణ, అతిహి దుస్తర॥

బ్రహ్మా, రుద్ర ఆరు దేవ దైత్య హూ పార న పావేఁ ।
వేద భేద బిను లఖేఁ నేతి కహి కేఁ సముఝావేఁ॥

ఖోఊ శ్వపచ కిరాత శర, పశు పక్షీ హూ తరి గయే।
జో సబ తజి శ్రద్ధా సహిత, చరణ శరణ హరి కీ భయే॥

అర్థము.

కల్కియు, బుద్ధుఁడును, వ్యాసుఁడునై యానటవరుఁడు జగత్కార్యముల నెన్నిఁటినో చేసెను. ఆతఁడు మాయాతీతుఁడు. విలక్షణుఁడు. అతిదుస్తరమైన మాయ యాతనిది. బ్రహ్మ రుద్రేంద్రాదులును, సురాసురులును దానిని దాఁటలేకపోయిరి. వేదమును నాతని రహస్యమును గనుఁగొనఁజాలక 'నేతినేతి' ఇదికాదు ఇదికాదని చెప్పినవి.

ఎవరు సర్వమును వీడి శ్రద్ధాభక్తులతో నాతని చరణములకు శరణముగావించిరో వారు శ్వపచ, కిరాత, శర, పశు, పక్ష్యాదులలో నెవరైనఁ గానిండు తరించిరి.



భగవంతుఁ డవతారము లేల యెత్తును? అను విషయమున నింతవఱకు సరియైన నిర్ణయము జరుగలేదు. అయినను నిర్ణయించుటెట్లు? నిర్ణయించునదిబుద్ధి. ప్రభువు బుద్ధికతీతుఁడు. కావున వివిధావతారములకు వివిధములగు నూహాలు బయలుదేరుచుండును. కొన్ని ధర్మరక్షణకొఱకును, కొన్ని దైత్యవినాశనము కొఱకును, కొన్ని భక్తులకిచ్చిన వరములను సత్యమొనర్చుటకును, కొన్ని భక్తులకు సుఖమొసంగుటకును, కొన్ని శాపమును సత్యమొనర్చుటకును భగవానుఁ డవతరించుచుండును; కాని కొందఱ అభిప్రాయము ననుసరించి, యీ కార్యము లన్నియును ప్రభువు తన సంకల్పముచేతనే అవతారమెత్తకయే

చేయఁగలఁడందురు. ఆతఁడవతరించుటకు ముఖ్యప్రయోజనము లీలావిస్తారము. ఈ భూమిమీఁద నవతరించి యాతఁడు చేసిన క్రీడలను వినినవారును, జదివినవారును, అనుమోదించిన వారును శాశ్వతముగ నీసంసారసాగరమునుండి తరించి పరమ ధామమును బొందుదురు. ఈపనిని భగవంతుఁడు తప్ప మఱిం కెవరును జేయఁజాలరు. ప్రేమప్రదానము, ప్రేమప్రసారము, ప్రేమప్రదర్శనము, ప్రేమార్ణవమునుండి యుద్భవించినతప్ప ప్రకాశములోనికి రాఁజాలదు. వేదము సాక్షాద్భగవన్ముఖ నిస్సృతము. కలియుగములో వేదము లుప్తము కాఁగలదు. మానవులు వేదధర్మ విహీనులై, క్రియాకర్మశూన్యులై యుందురు. కావున తనవాణిని దాను బ్రకటపఱచి, తన మధుమయ, ప్రేమమయ, ఆనందమయ లీలలను బ్రకాశ మొనర్చుటకు స్వయముగ శ్రీహరియే వ్యాసరూపమున నవత రించి వేదములను వ్యాసమొనర్చి, పురాణేతిహాసములను సంగ్రహమొనర్చి సర్వసాధారణ మానవులకుఁగూడ వీటి నన్నిటిని సులభముగ నొనర్పఁగలఁడు. భగవంతుఁడు వ్యాస రూపమున నవతరింపకున్నచో నాతని దివ్యలీలల యొక్కయు నపౌరుషేయ ప్రభావజ్ఞానములయొక్కయు బ్రచారప్రసార మెట్లు కాఁగలదు? ఈ ద్వాపరాంతమందు వ్యాసభగవానుఁడు పరాశరమహాముని వీర్యముచే, సత్యవతీదేవి గర్భమున నుద్భ వించెను. ఆతఁడు వేదములను వ్యాసము కావించెను; అసంఖ్యా కులగు మానవుల నుద్ధరింపఁ గలిగినదియు, భగవల్లీలల నభి వర్ణించునదియుఁ, బరమహంస సాత్వత సంహితయు నగు భాగవత మహాపురాణమును రచించెను.

మయదానవునిచే నిర్మింపఁడి త్రిపురదైత్యులను త్రినేత్రుఁడగు శివుఁడు తనబాణములచే నాశముచేసెను. చివరకు ప్రసన్నుఁడై సువర్ణపురమును నాశముచేయుట మానివేసెను. అది యిప్పు డలక్షితముగ నాకాశమునఁ దిరుగుచున్నది. దానిలో దేవద్రోహులగు దైత్యు లభివృద్ధి చెందినప్పుడు వారు రాజులుగను, బ్రాహ్మణులుగను భూమిపైఁగల పురములలోఁ బుట్టి దంభయజ్ఞములు చేయఁగలరు. 'వైదిక హింస హింసకా'దను వేదవచనము నాధారముగఁగొని యజ్ఞము పేర నసంఖ్యాకములగు బశువుల హింసించుచుందురు. ధర్మరూపమున నధర్మ మొనర్పఁ గలరు. అప్పుడా ధర్మధ్వజుల నణంచుటకును, వారి బుద్ధిని మోహపెట్టుటకును భగవానుఁడు బుద్ధరూపమున నవతరింపఁగలఁడు.''

అంత శౌనకుఁ డిట్లడిగెను:- ''సూతా! భగవద్వాక్యమే వేదవాక్యమనుట నిజమే. కాని కార్యాకార్యవ్యవస్థయందు శాస్త్రమే ప్రమాణముగ నెంచఁబడినది. ఇట్టి యచింత్యభావము తర్కముద్వారా సిద్ధింపదు. భగవంతుఁడగు బుద్ధదేవుఁడు కేవల మసురుల మోహపెట్టుటకే ఇట్టి వేద విరుద్ధములగు నుపదేశములను జేసెనని శాస్త్రములు చెప్పుటచే, నాయుపదేశములు అసురుల కొఱకేనని గ్రహింపవలయును. సత్య, ధర్మ, దయా, దాన, పరోపకారాది సద్గుణముల విషయములో నాతని యుపదేశము సరియైనదే. కాని వైదిక క్రియాకలాప ఖండన ప్రకరణమంతయుఁ గేవలము వేదమార్గముల ననుసరించుచున్న నీచాసురలను మోహపెట్టుట కొఱకే.''

అంత శౌనకుఁ డిట్లనెను:- "అట్లైన భగవానుఁ డట్టి విపరీతోపదేశము నేలయిచ్చెను? అసురులు వేదమార్గమున నుండి వేదమార్గప్రచారము చేయుచుండినను, యజ్ఞయాగాది వైదికకర్మానుష్ఠాన మొనర్చుచుండినను వారిని తప్పుడుదారి త్రొక్కింపవలసిన పనియేమున్నది?"

ఇది విని సూతుఁ డిట్లనెను :- "మహానుభావులారా! గుణజ్ఞులకడ గుణము శోభించును గాని, నీచులకడ గుణ మవ గుణము కాఁగలదు. తీక్ష్ణఖడ్గము శూరునిచేత నున్న నది శత్రుసంహారము చేయట యను బుణ్యకార్య మొనర్చుటకు పనికివచ్చును. దానినే ఒక పిల్లవాని చేతికిచ్చిన వానిశరీరము కోసికొనుటకే పనికిరాఁగలదు. అట్లే అసురులు వైదికక్రియ లొనర్చి బలమును బొందిన, వారి బలము పరపీడనమునకే వినియోగపడగలదు. కావుననే భగవంతుఁడు వారిని వేదమార్గ భ్రష్టులఁ గావించి వైదికశ్రీసంపన్నులఁ గానీయలేదు."

కలియుగము రాఁగానే వర్ణాశ్రమధర్మములు సాధా రణముగ నశించిపోఁగలవు. ఒకవేళ నామమాత్ర ద్విజు లున్నను వారు పాషండులుగను, ధూర్తులుగను, వంచకులుగ నగుదురు. శూద్రులు, అంత్యజులు, మ్లేచ్ఛులు, పరమతస్థులు శాసకులగుదురు. వీరు వైదికధర్మ విరోధులుగను, ఆర్య సంస్కృతిని ద్వేషించువారుగను, తామే సర్వజ్ఞులమనియు, నభివృద్ధికారకులమనియు ననుకొనుచు యజ్ఞభాగములకు విరో ధించెదరు. అప్పుడెచ్చటను స్వాహా, స్వధా, వషట్కారాది శబ్దములు వినఁబడవు. సజ్జనుల గృహములందైనను వేద

శాస్త్రచర్చ జరుగక, భగవచ్చరిత్ర కథాశ్రవణము జరుగక - ఉత్తేజకమును, కామాసక్తిని బెంచు సమాచారములే ప్రతి దినము అధ్యయనము చేయఁబడుచుండును. అప్పుడు భగవంతుఁడు కల్కిరూపమునఁబుట్టి కలియుగాంతమును గావించి కృతయుగమును స్థాపింపఁగలఁడు.''

నారదునితో బ్రహ్మ యిట్లు చెప్పుచుండెను:-''నారదా! నేను సృష్టిరచనకై తపముచేయుచుందును. ఇదంతయు నేను ప్రభు ప్రేరణచేతనే చేయుచుందును. అతఁడు సృష్టిచేయఁదలఁచినప్పుడు, నన్ను, నాతో సమానులగు మరీచాది ప్రజాపతులను సృష్టించును. మేమందఱము నాతని ప్రేరణచేతనే రాత్రిందివములు సృష్టివృద్ధికై పాటుబడుచుందుము. సృష్టి యెట్లు పెరుగునా యనియే మాకెల్లప్పుడును జింత. ప్రతి మానవుఁడును బుత్రపౌత్రులను గని సృష్టిని వృద్ధికావింపవలయుననియే మేము ముఖ్యముగ నాశించునది. భగవంతుఁడు మాబుద్ధిప్రవృత్తుల నీకార్యములందు లగ్నమగునట్లు చేసెను. ఈ ప్రజాపతులందఱును నా యంశావతారములని గ్రహింపవలయును. ప్రజలలోఁ బ్రజాభివృద్ధిచేయు భావన యున్న యెడల, నది నాభావనయనియే గ్రహింపవలయును. ఎవరెంతటి యెక్కువ సంతానమును గనిన వారంతగ నా యంశమని భావింపవలయును.

ఆ భగవానుఁడే యీ సృష్టిని రక్షించుటకొఱకై ప్రతి మన్వంతరమున మనురూపమునఁ బుట్టి సృష్టిని రక్షించుచుండును. తనకు సమానులగు పుత్రులనుగని సృష్టి రక్షణకై దేవతలను ఋషులను నేర్పఱచును. ఇంద్రు నేర్పఱచును.

స్వాయముగ నవతారములుకూడ ధరించును. కావున యజ్ఞ రూపుఁడగు విష్ణువు, మనువు, మనుపుత్రులగు రాజులు, ఋషులు, దేవగణము, ఇంద్రుఁడు వీరందఱును రక్షకుఁడగు విష్ణుని యంశము లందురు.

పెరిగిపోవుచున్న సృష్టిని సంహార మొనర్చుటకై ఆతఁడే సర్వేశ్వరుఁడగు రుద్రరూపమున నుద్భవించి భూత, పిశాచులను, అత్యంత క్రోధముగల దైత్యుల నుద్భవింపఁజేసి, లోకమున నధర్మక్రోధముల వృద్ధికావించును. అందువలననే క్రోధులు, అధర్ములగు దైత్యులు, కాలము, అంతకుఁడు మొదలగువారందఱు రుద్రుని అంశలు. అందఱిలో నా హరి వ్యాపించియున్నాఁడు. ఆతని మహిమము అనంతము; అపారము. మానవుఁడు తన సాధనములచే దానిని బొందలేఁడు; తన తర్కముచే దానిని సిద్ధాంతము చేయలేఁడు. ఆతని కృప యెవరిమీఁదఁగలదో ఆతఁడుమాత్రమే దానిని దెలిసికొనఁగలఁడు. ఆతఁడే యీ సంసార సాగరమును దాఁటఁగలుగును. ఆతనిని సర్వాత్మభావముతోఁ బూర్ణముగ దేవ దానవ, ఋషి, మనులెవరును వేయేల నేనును దెలిసికొనఁజాలను. అయినను గొందఱాతనిని దెలిసికొనఁ గలుగుదురు. ఆతని కృప యున్నచో నాతని మాయను దాఁటఁగలుగుదురు. చాల మంది ఆతని దెలిసికొనిరి. ఆతని మాయను దాఁటిరి. వారిలోఁ గొందఱ పేర్లను జెప్పెదను. నేనాతని మాయను ఆతని కృపచేతనే యెఱుఁగుదును. నీవు నెఱుఁగుదువు. మహేశ్వరుఁడు నెఱుఁగును. ప్రహ్లాదుఁడు, మను పత్నియగు శతరూప, స్వాయంభువమనువు, ప్రియవ్రతాది మనుపుత్రులు,

ప్రాచీనబర్హి, ఋభువు, ధ్రువుఁడు ఇక్ష్వాకు, ఇలాపుత్రుఁడగు పురూరవుఁడు, ముచుకుందుఁడు, జనకుఁడు, గాధి, రఘు మహారాజు, అంబరీషుఁడు, సగరుఁడు, గయుఁడు, యయాతి, మాంధాత, అలర్కుఁడు, శతధన్వుఁడు, అనువు, రంతిదేవుఁడు, భీష్ముఁడు, బలి, అమూర్తరయుఁడు, దిలీపుఁడు, సౌభరిమహర్షి ఉతంకుఁడు, శిబి, దేవలుఁడు, పిప్పలాదుఁడు, సారస్వతుఁడు, ఉద్ధవుఁడు, పరాశరుఁడు, భూరిషేణుఁడు, విభీషణుఁడు, హనుమంతుఁడు, ఉపేంద్రదత్తుఁడు, అర్జునుఁడు, ఆర్ష్టిషేణుఁడు, విదురుఁడు, శ్రుతదేవుఁడు మొదలగు చాలమంది భాగవతు లందఱును భగవన్మాయ నెఱుంగుదురు. వీరందఱు రాజర్షులు, బ్రహ్మర్షులు, రాజపుత్రులు, కులీనులు, యశస్వులును. భక్త సాంగత్యము కావించి, వారివలన దీక్షనుబొంది, భగవత్పరి చర్య, భగవత్కథాశ్రవణ మెవరు చేయుదురో వారు ద్విజ, శూద్ర, స్త్రీ, చండాల, మ్లేచ్ఛ, హూణ, శబర, శక, కంకా భీరులలో నెవరైనఁ గానిండు, వారుకూడ భగవన్మాయను దాఁటఁగలుగుదురు. ఇఁక శాస్త్రజ్ఞులయొక్కయు, మహాత్ముల యొక్కయు, భక్తులయొక్కయు విషయమునఁ జెప్పనేల ?

'ఆ భగవంతుఁడు కారణకారణుఁడు. నిత్యుఁడు. అక్ష యుఁడు. సచ్చిదానందస్వరూపుఁడు. ఈ ప్రపంచమంతయు నాతని ప్రేరణచేతనే కనఁబడుచున్నది. ఇదంతయు నశించి నను ఆతఁడట్లే యుండును.'

బ్రహ్మ యిట్లనెను:- "వత్సా! నారదా! నేను నీకత్యంత సంక్షేపముగ భాగవత తత్త్వమును జెప్పితిని.

అనఁగా నేను గొంచెము సంక్షిప్తముగ భగవదవతార లీలలను, కొందఱ భాగవతుల నామములను జెప్పితిని. భగవంతునకును, భాగవతులకును సంబంధించినవారే భాగవతులు. నీకు కనఁబడున దంతయు భగవంతున కన్యమైనది కాదు. సమస్తజగత్తు ఆతని స్వరూపమే. ఇట్లయ్యు నాతఁడు జగద్వ్యతిరేకుఁడే. ఈ భాగవత తత్త్వమును నాకు కమలమునఁ గూర్చుండియున్నప్పుడు సాక్షాచ్ఛ్రీమన్నారాయణుఁడు నాకుఁ జెప్పెను. ఇప్పుడు నీవు దీనిని విస్తారమొనర్చి లోకమునఁ బ్రచారమొనర్పుము.''

నారదుఁ డిట్లడిగెను:- ''స్వామీ! కార్యములన్నియు నేదో సంకల్పముచే జరుగుచుండును. నా యీ కార్యమువలన నీవస్తువు సిద్ధింపవలయునని మునుముందుగ మనస్సున విచారించుము. సంకల్పముచేతనే సృష్టి కలుగునని నీవే చెప్పఁగలవు. మానవుఁడు సంకల్పముచేతనే బంధనమునఁ బడును. కావున సమస్తసంకల్పములను బరిత్యాగము కావింపవలెను. 'నీవీ భాగవతశాస్త్రమును విస్తారము కావించి, ప్రచార ప్రసారములఁ గావింపు'మని చెప్పుచున్నావు. నన్నుఁ గర్మప్రవృత్తుని కమ్మని యేల చెప్పుచున్నావు? నైష్కర్మ్యమే కదా ముక్తిమార్గము.''

ఇది విని బ్రహ్మ మిక్కిలి ప్రేమతో నిట్లనెను:—''నాయనా! కర్మమువలన బంధనమనుట యథార్థమే. కర్మము సంకల్పపూర్వకముగఁ జేయఁబడుననుటయును సత్యమే. కాని కేవలము భగవంతుని నిమిత్తము చేయఁబడు కర్మములు సంసార బంధహేతువులు కావు. కాకపోఁగా నవి సంసారబంధ

విచ్ఛేదకములు కాఁగలవు. మానవుఁడు దేనిని జింతించిన దాని రూపము కాఁగలఁడు. అంత్యకాలమున సతివను జింతించిన, మఱుసటిజన్మమున మగువగఁ బుట్టును. ఇదేవిధమున సాంసారికవస్తు చింతనము చేయువారు మరుసటిజన్మమున నావస్తువై పుట్టఁగలరు. సాంసారికచింతను వీడి, నిరంతరము భగవద్దివ్య గుణ కథనమునను, ఆతని మనోహర లీలాశ్రవణ కీర్తనము లందును మనస్సు లగ్నము చేయునెడలఁ జివర కాతనినే పొందుదురు. భగవంతుని బొందుటే సంసారమునుండి తరించుట. ఇదియే మోక్షము. కావున భగవల్లీలావిస్తారము చేయుట యనఁగా బంధనమునుండి విడివడుటయే. కావున నీవీ సంకల్పముతో నీ భాగవతశాస్త్ర విస్తారము కావించి, సమస్తప్రజల భక్తి సర్వాంతర్యామి సర్వాధారుఁడగు భగవంతుని చరణారవిందములపై నుండునట్లొనర్పుము. అందఱి మనస్సులు భగవానుని దివ్యలీలలలో నిమగ్నములు కావలయును.''

నారదుఁ డిట్లనెను:- ''స్వామీ! నేను నీ యాజ్ఞను బరిపాలించెదను. కాని యేరూపముననైన మాయవచ్చి నన్నుఁ దనవలలోఁ బడవేసికొనకుండ చూడవలయును.''

అంత బ్రహ్మ మిక్కిలి ప్రేమతోఁ దన మాటమీఁద నిలిచి యిట్లనెను:- ''నారదా! నీ వెట్టి పలుకులు పలుకుచున్నావు? నీ విషయము వేఱు. నీ దగ్గఱకు మాయ రానే రాదు. భాగవతతత్త్వ వర్ణనము చేయువారియొక్కయు, నచింత్య మాయాపతియగు శ్రీహరిలీలలను సమర్థించువారి యొక్కయు, ననుమోదించువారి యొక్కయు, శ్రద్ధతో

నిత్యము శ్రవణము చేయువారియొక్కయు చిత్తములు కూడ మాయావిమోహితములు కావు.''

సూతుఁ డిట్లనెను- ''మునులారా! ఈ విధముగ నా గురుదేవుఁడగు శుకదేవుఁడు పరీక్షిన్మహారాజుకు బ్రహ్మ-నారద సంవాదమును జెప్పి యూరకుండెను. అతఁ డూరకొనఁగా పరమభాగవతుఁడగు పరీక్షిన్నరేంద్రుఁ డేనియో పలుక నుద్యుక్తుఁడయ్యెను.''

ఛప్పయ.

బోలే బ్రహ్మ — ''వత్స! బజాకే వీణా వరతర।
భనోఁ భాగవత తత్త్వ సునత భవపార హోయఁ నర॥
కర్మ బంధ కే హేతు కింతు హరి చరిత లలిత అతి।
కహత సబాన కీ హోయ రాధికా పతి చరనని రతి॥
సబ సంసారీ సుఖ లహైఁ, జగ విషయని తేఁ మన హటే।
ముక్త ముముక్షూ బద్ధ సబ, సేవేఁ భవ బంధన కటేఁ॥

అర్థము.

బ్రహ్మ యిట్లనెను:- ''వత్సా! నీవు వీణ మీటుచు భాగవతమును గానముచేయుము. మానవుఁడు భాగవత తత్త్వమును విని భవసాగరమును దరింపఁగలఁడు. కర్మములు బంధహేతువులు. కాని హరి చరిత మతి లలితమైనది. దానినిఁ జెప్పుటచే రాధికాపతి చరణములందు ప్రేమ కలుగును. జగతిలో విషయములనుండి మనస్సు తొలఁగి సంసారమున సుఖమును బొందఁగలుగును. ముక్తులు, ముముక్షువులు,

బద్ధులు వీరందఱును దానిని సేవించినచో భవబంధము తెగిపోవును.''



# పరీక్షిత్తుని దృఢత్వము — వివిధప్రశ్నలు

## ౯౩

శ్లో॥ ప్రవిష్టః కర్ణరంధ్రేణ స్వానాం భావసరోరుహమ్,
ధునోతి శమలం కృష్ణః సలిలస్య యథా శరత్ ॥
ధౌతాత్మా పురుషః కృష్ణపాదమూలం న ముంచతి,
ముక్తసర్వ పరిక్లేశః పాంథః స్వశరణం యథా.

— శ్రీభాగ. ౨ స్కం. ౮ అ. ౫, ౬ శ్లో.

వ. అదియునుంగాక యెవ్వండేని శ్రద్ధాభక్తియుక్తుండై కృష్ణగుణ కీర్తనంబులు వినుచుం బలుకుచుం నట్టివాని హృదయ పద్మంబునందుఁ గర్ణరంధ్రమార్గంబులం బ్రవేశించి కృష్ణుం విశ్రమించి సలిలగతంబైన కలుషంబును శరత్కాలంబు నివారించు చందంబున నాత్మగతంబైన మాలిన్యంబు నపకర్షించుఁ గావున.

మ. భరితోదగ్ర నిదాఘతప్తుఁడగు నప్పాంథుం డరణ్యాది సం
చరణక్లేశ సముద్భవంబగు పిపాసం జెంది యాత్మీయ మం
దిరముంజేరి గతశ్రముండగుచు నెందేనిం జనంబోని భం
గి రమాధీశు పదారవిందయుగ సంగీభూతుఁడై మాను నే.

— శ్రీమదాంధ్రభాగవతము.

భ ప్ప యు.

కహేఁ పరీక్షిత్ _ "గురో! ఆపు విస్తార బతావేఁ।
జాకూఁ నారద కర్యో తాహి అబ మోహీ సునావేఁ॥
వర్షా బీతే శరద స్వచ్ఛ కరి దేవే జలకూఁ।
త్యోఁ హరి లీలా నామహి యే కే మేఁటే మలకూఁ॥
పీవత పానీ పంథ కో, నిజపుర పహుఁచే పాంథ జ్యోఁ।
హర్షిత హోవే హృదయ హరి, భక్తపరసి పదశాంత త్యోఁ॥

అర్థము.

పరీక్షిత్తు ఇట్లు పలికెను:- "గురూ! నారదుఁడు దేనిని గాన మొనర్చెనో ఆ భాగవతమును నాకు విస్తారముగఁ జెప్పవలయును. వర్షఋతువు దాటిపోఁగానే శరదృతువు రాఁగానే స్వచ్ఛమగు జలము నెట్లు లభించునో అట్లే హరి లీలానామములు హృదయమునకు సోకెనా దానిలోని పాపములను దుడిచివేయఁ గలదు.

మార్గమున పాంథుఁడు దప్పిక చెంది నీరును ద్రాగి స్వగ్రామము నెట్లు చేరునో అట్లే హృదయమున హరిని జింతింపఁగా భక్తుఁడు హర్షమును జెంది శాంతిని జెందును."

---

శ్రోతయొక్క అధికారమును దెలిసికొనియే వక్త యుపదేశింపవలయును. హీనశ్రేణికి చెందిన శ్రోతలకు ఉచ్చశ్రేణికి చెందిన జ్ఞానమును వెంటనే చెప్పుట వ్యర్థము. ఏలననఁగా వారు దానిని గ్రహింపఁజాలరు. అట్లే ఉచ్చకోటిలోఁ జేరిన శ్రోతలకు నిమ్నశ్రేణికి చెప్పు విషయమును జెప్పిన

వారికి తృప్తి కాదు. శ్రోతయొక్క యుత్సుకతను జూడఁగానే వక్తకు ఉత్సాహము హెచ్చును. కావుననే యాతఁడు ఒకానొక ప్రసంగమునకు బీజారోపణము కావించి కథకు సూత్రపాతము కావించును. శ్రోతకున్న యోగ్యతనుబట్టి శ్రవణోత్సాహము కలుగుచుండును. దానిననుసరించియే యాతఁడు తరువాతవిషయమును బ్రశ్నించును. బ్రహ్మ-నారద సంవాదమును జెప్పి, తరువాత బ్రహ్మ నారదునికి సంక్షిప్త భాగవతమును విస్తారము కావించుమని ఆజ్ఞాపించెనని చెప్పి శ్రీ శుక మహర్షి యూరకుండెను. అంత బరీక్షిన్మహారాజు ముందు విషయమును బ్రశ్నించుచుండెను.

పరీక్షిత్తు యిట్లు ప్రశ్నించెను:- "బ్రాహ్మణోత్తమా! బ్రహ్మ నారదునితో నిర్గుణస్వరూపుఁడగు భగవంతుని గుణములను విస్తారముగ వర్ణింప నాజ్ఞాపించెనని చెప్పియుంటివి. లోకపితామహుఁడును, దనకుఁ దండ్రియు నగు జతుర్ముఖుని యాజ్ఞననుసరించి నారదుఁ డా కథను ఎవరెవరితోఁ జెప్పెను? దాని విస్తార మెట్టిది? ఈ వృత్తాంతమంతయు నాకు విపులముగఁ జెప్పవలయును."

శుకుఁడిట్లనెను:-"రాజా! ఇట్టి గూఢతత్త్వమును మనమెట్లు తెలిసికొనఁగలము? ఒకవేళ తెలిసికొనినను, దానిని వర్ణించుటయును, ఇతరులకుఁ దెలియఁ జెప్పుటయు మఱింతకష్టము."

అంత నవ్వి మహారాజిట్లనెను:- "స్వామీ! నన్ను మఱపింపవలదు. నీ వెఱుఁగని యర్థములు కలవా? నీవు వేదవేత్తవే కాదు. వేదవేత్తలలో సర్వశ్రేష్ఠుఁడవును, శిరోమణివిని. నీకు భూత భవిష్యద్వర్తమానములలోఁ దెలియరానివి లేవు."

పరీక్షిద్వచనములను విని శ్రీశుకుఁ డిట్లనెను:- "రాజా! నీ వింత తొందఱపడెదవేల? ధైర్యమును వహించుము. నేను సర్వమును జెప్పెదను."

అంత మహారాజిట్లనెను:- "ప్రభూ! తొందఱపాటు యేమియు లేదు గాని, అంత్యకాలమున నా మనస్సు మదన మోహనుఁడగు శ్యామసుందర సుందర చరణారవిందములందు లగ్నముకాకుండి మరణకాలమునఁ జిత్తము సాంసారిక విషయములందే లగ్నమగుచో మరల నెనుబదినాల్గు లక్షల యోనులలోఁ దిరుగుచుండవలసి వచ్చునేమో నను చింతయే నన్ను వేధించుచున్నది. కావున నేను అనాసక్తచిత్తుఁడనై ఆనందకందుఁడగు నందనందన చరణారవిందములందు లగ్నము కావించి ప్రాణములు విడువఁదలఁచినాను."

నవ్వుచు శ్రీ శుకుఁ డిట్లనెను:- "రాజా! చెవులతోఁ గథ వినుచుండిన మనస్సు భగవచ్చరణారవిందములపై నెట్లు నిలుచును? ఈ విషయమున నీ యభిప్రాయ మేమియో చెప్పుము."

అంతఁ బరీక్షిన్మహారాజు చేతులు జోడించుకొని మిక్కిలి నమ్రతతో నిట్లనెను:- "స్వామీ! నాకేమి తెలియును? నేను మీ బోటి సాధువులవలన భగవంతునకును, భగవన్నామమునకును, భగవద్గుణములకును భేదమేమియును లేదు, ఒక్కటేనని వినియున్నాను. మనము మన కర్ణముల ద్వారా సుమధుర భగవన్నామములను, గలిమలహారిణియగు కమనీయ శ్రీకృష్ణకథను శ్రవణము చేయుచున్నప్పుడు, మన కర్ణరంధ్రములద్వారా కథతోఁగూడ నామ, గుణ రూపమగు

దామముచే బంధింపఁబడిన దామోదరుఁడు హృదయమున స్వతః ప్రవేశింపఁగలఁడు. ఆతఁడు ప్రవేశించుటకుఁ బూర్వము హృదయ మజ్ఞానాంధకారముచే వ్యాపించును. జ్ఞానస్వరూపుఁడగు శ్రీకృష్ణుఁడు హృదయమునఁ బ్రవేశింపఁగానే — వనములో సింహము ప్రవేశింపఁగానే పిరికిపందలగు నక్కలు గుంపులు గుంపులుగ నచ్చటచ్చట దాఁగినట్లు — దుర్గుణములన్నియు హృదయమునుండి పాఱిపోఁగలవు. పిల్లి రాఁగానే ఎలుకలన్నియుఁ గలుగునందు దూఱినట్లును, గరుడుని జూడఁగానే సర్పములన్నియుఁ జలచల నటునిటు పాఱిపోవునట్లును, సూర్యుఁడు రాఁగానే అంధకారమంతయుఁ బటాపంచ లగునట్లును శ్రీకృష్ణకథాశ్రవణముచేఁ బాపములన్నియుఁ బటాపంచలు కాఁగలవు. వర్షాకాలములో సమస్తనదులలోని నీరు ముఱికియగును. అదేవిధముగను స్వచ్ఛము కాదు. ఒక కుండ నీటిలో చిల్లగింజ చాది వేసిన నా మట్టిని అడుగునకుఁ గొనిపోయి నిర్మలము కావింపఁగలదు. అది నది నంతను నిర్మలముగ నొనర్ప సమర్థము కాదు; కాని శరదృతువు రాఁగానే ఆ ముఱికి అంతయును బోయి, నీరు శంఖమువలె నిర్మలముగఁ గాఁగలదు. అట్లే అన్యోపాయములచే క్షణికానిత్యములగు స్వర్గసుఖములు లభించునుగాక! కాని హృదయము విశుద్ధమై దానిలో నిత్యనిరంతరము వాసుదేవ భగవానుని నివాసము కలుగఁజాలదు. ఈ కృష్ణకథారూపమగు నమృతములోఁగల విశేషమేమనఁగా నిది కర్ణములద్వారా లోపలకుఁ బ్రవేశించెనా, సమస్త మలినములను గడిగివేసి స్వచ్ఛస్థానముగ నొనర్పఁగలదు. అచ్చట కమలముపై దివ్యసింహాసనము

నేర్పఱచి, యా ప్రవాహములో యమునాతట విహారియగు వాసుదేవుని స్నానము చేయించి, దానిపై శాశ్వతముగ నాసీనము కావింపఁగలదు. నవనీతమునకంటెఁ గోమలము లును, మఖమల్‌కంటె మెత్తనివియు, వటాశ్వత్థ నవజాత పల్లవములకంటె మృదులములు నగు మదనమోహనుని చరణ కమలములను జిత్తము దర్శించెనా, అది అచ్చటనే పాదుకొని పోఁగలదు. అది అచ్చటనుండి విషయప్రపంచములోనికి రాఁ గాంక్షింపదు.''

అంత శ్రీశుకుఁ డిట్లడిగెను:- ''భగవచ్చరణములను బొందిన చిత్తము తనచంచలత నెట్లు వదలఁగలదు? దాని స్వభావ మటునిటు తిరుగుటే గదా! అది దానిస్వభావమును వదలుట చాలకష్టమే.''

ఇదివిని పరీక్షిత్తు నవ్వుచు నిట్లనెను:- '' స్వామీ! అన్యథా తలంపకుండినచో నేనొక దృష్టాంత మీయఁగలను. ఆదృష్టాంతమైనను ఇంటిలోనుండుగృహస్థులవిషయము. గృహ ములో నన్నిటికంటెఁబ్రియమైనదియు, నన్నిటికంటె మోహక మైనదియు, సర్వవిధముల మనస్సును వశపఱచుకొనునది గృహిణి. గృహిణిలేని గృహము గృహమే కాదు. ఇంటికిశోభ యిల్లాలే. నానాదుఃఖములను మఱపించియు నింటిలోఁ గని పెట్టుకొనియుండునది ఇల్లాలు. సతీసాధ్వియు, రూపగుణ సంపన్నయు, దనను మిక్కిలిగఁ బ్రేమించునదియు, మృదు మధుర మందహాసము కలదియుఁ, బ్రియముగ భాషించు నదియు నగు బత్నినివీడి యే గుణగ్రాహియగు పతి యుండఁ గలఁడు? ఇట్టి సర్వాంగ సుందరియగు సాధ్విని బడసియుఁ

ప్రారబ్ధవశమునఁ గొందఱు పరదేశములఁ దిరుగవలసి వచ్చుచున్నది. ఆజీవిక కొఱకును, పదప్రతిష్ఠకొఱకును దానిని వదలి బయటకు పోవలసివచ్చుచున్నది. ఏదైన నావశ్యక కార్యము సంభవించెనా వాహనముకూడ పోఁజాలని పర్వతముల మీఁదకుఁ బోవలసివచ్చును. పని కాఁగానే మఱల నావ్యక్తి గృహమునకుఁ బరువిడి రావలసియుండును. వానికప్పు డెంతత్వరగా వీలైన నంత త్వరగా నింటికి జేరుకొనఁ గోరుచుండును. ప్రాతఃకాలము కాఁగానే మరల సంచిని చంకనుబెట్టుకొని వెళ్లవలసి వెళ్లుచుండును. మధ్యాహ్నమున భోజనముచేసి, మఱల వెంటనే బయలుదేఱును. సూర్యాస్తమయము కాఁగానే, చీఁకటిపడును. ఎక్కడైనఁ దిని, పడి నిద్రపోవును. ఈవిధముగా నాతఁడెల్లప్పుడు దిరుగుచుండవలసినదే. ఇతరులెవరైన జూచిన నీతని కెల్లప్పుడు తిరుగుడు వ్యసనము, ఒక్కచోట నిలువఁడందురు. కాని, అతఁడు తన గృహమునకు వచ్చి, చంద్రముఖియగు తనప్రాణప్రియను గాంచెనా, ఆతఁడిఁక వెళ్లజాలఁడు. ఇప్పుడెక్కడికి వెళ్లగలడు? ఎక్కడికి వెళ్లదలఁచెనో, అక్కడికి చేరినాఁడు. దేనినిజూచుటకాతఁడు వ్యాకులముచెందెనో, దానిని జూచినాఁడు. తన గమ్యస్థానమునకుఁ జేరుకొనినాఁడు. ఇప్పుడాతఁడు పాంథుఁడు గాని, వ్యాపారిగాని, యాత్రికుఁడుగాని, కాడు. ఇప్పుడాతఁడు గృహస్థుఁడు. అదేవిధముగా నీచిత్తముకూడ చిత్తచోరుని చారుచరణములవైపుకు మొగ్గక, ఆతని దగ్గఱకుఁ జేరనంత వఱకే చంచలముగనుండి తిరుగుచుండును. అతని అరుణ వర్ణము కలవియు విమోహకములును ప్రకాశవంతములునగు

పాదపద్మముల నొక్కసారి కాంచెనా, ఇంక నది వానిసా త్తే కాఁగలదు. వాటినివదలి యింకొకచోటకు పోదు. పోవుట యెట్లు? ఆతనికంటెఁ గమనీయమగు పదార్థ మింకొకటి యీలోకమున నుండినగదా! కావునఁ జిత్తము తన చంచలతనువీడి యాతనిలో రమింపఁగలదు.''

ఇది విని శ్రీశుకుఁడు నవ్వి యిట్లనెను:- ''రాజా! నీవు మంచి దృష్టాంతమిచ్చితివి. మంచిది. నీ వేయే ప్రశ్నలడుగఁ దలఁచితివి? వాటి సూచన సూక్ష్మముగ నాకిమ్ము, దానిని నేను విస్తరించి నీకుఁ జెప్పెదను.''

ఇది విని యానందమును బ్రకటించుచు మహారాజిట్లనెను:-''స్వామీ! ప్రశ్నించుటకును యోగ్యత కావలయును. అందఱును బ్రశ్నింపఁజాలరు. మీరంతట మీరే నా కేది హితమో దానినుపదేశింపుఁడు. కథాప్రసంగము జరుగుటకై నేను కొన్ని ప్రశ్నించెదను; కాని నే నిన్ని విషయములనే అడుగుచున్నానని మీరు భావింపవలదు. మీరే ప్రశ్నలకు మాత్రము ప్రత్యుత్తర మీయవలయును. ఇవికాక నేనడుగఁ జాలనివియు, హితకరమైనవియు నేమైననుండిన వాటిని గూడ నాహితముకొఱకు నేనడుగకయే నన్ను శిష్యునిఁగ గ్రహించి యుపదేశింపవలయును. నాప్రశ్నలివి:-

(౧) ఈజీవుఁడు స్వతః పంచభూత రహితుఁడు. కాని యే దేహములోనుండి యీ సుఖదుఃఖములను భోగించుచున్నట్లు కనుపించుచున్నాఁడో, అది పంచభూతములతో నేర్పడినది. జీవుడీ దేహమును స్వభావవశమున బొందుచున్నాఁడా లేక కర్మాధీనుఁడై పొందుచున్నాఁడా?

(౨) పురాణపురుషుని నాభినుండి ఒక కమలముత్పన్న మైనదనియు, దాని వలన సృష్టియైనదనియుఁ జెప్పితివి. పరమాత్మ జీవునివలెఁ బరిమితావయవములచేఁ బరిచ్ఛిన్నుఁడా? లేక జీవబ్రహ్మల కేమైన భేదమున్నదా?

(౩) ఎవని కృపచే బ్రహ్మ సమస్త లోకములను సృజించెనో, ఎవని కృపచేతనే బ్రహ్మ ఆతనిని సాక్షాత్కరింపఁ జేసికొనెనో, ఎవఁడు సమస్తభూతములయొక్క ఉత్పత్తి, స్థితి, లయముల కాధారమో, ఎవఁడు మాయానియామకుఁడగు స్వామియో, అట్టి సర్వాంతర్యామియు, పురాణపురుషుఁడును తన మాయకు దూరముగ నుండి యెచ్చట శయనించును?

(౪) విరాట్పురుషుని అంగములచే సమస్తలోకములు లోకపాలురు కలిగిరని ఒకసారి చెప్పితివి. మరల నింకొకసారి సమస్త లోకములు, లోకపాలురచే నాతని యంగములు కల్పింపఁబడినవని చెప్పితివి. దీని రహస్యమేమి? ఇదెట్లు?

(౫) మహాకల్పమనఁగా నేమి? దాని కంతర్గతముగ నవాంతరకల్పము లెన్ని?

(౬) ఇది భూతకాలమనియు, నిది వర్తమానకాలమనియు, నిది భవిష్యత్కాలమనియు దేని యాధారమున నెన్నఁబడుచున్నది?

(౭) స్వర్గ మర్త్యలోక ప్రాణులకు ఆయుః పరిమాణ మెంత?

(౮) కాలముయొక్క స్థూల సూక్ష్మ గతుల నెట్లు తెలిసికొనవచ్చును?

(౯) జీవు లేయేకర్మ లొనర్చిన నేయేగతి ప్రాప్తించును?

(౧౦) త్రిగుణముల పరిణామ స్వరూపములగు దేవ, మనుష్యాది యోనులందు బుట్టగోరువా రేల కర్మద్వారా యేయే జన్మలను బొందుటకుఁ బ్రయత్నింతురు?

(౧౧) పృథ్వీ, పాతాళ, దిశ, ఆకాశ, గ్రహనక్షత్ర, పర్వత, నదీ, సముద్ర, ద్వీపాదు లన్నిటిలో నివసించు జీవు లన్నియు నెట్లుత్పన్నమైనవి?

(౧౨) ఈ బ్రహ్మాండము లోపలినుండి యెంత పెద్దది? బయట ఇది యింకెంత పరిణామమున నున్నది?

(౧౩) మహాపురుషుల ఆచరణ మెట్లుండును? వారి చరిత్ర గుణకథనము నొనర్పుఁడు.

(౧౪) వర్ణాశ్రమధర్మ విభాగ మెట్లుండును? ఆయా వర్ణాశ్రమధర్మము లేవియో తెల్పుఁడు.

(౧౫) భగవంతుని పరమాశ్చర్యమయ, సులలిత కమనీయ అవతారకథలను గూర్చి చెప్పుఁడు.

(౧౬) కృత, త్రేతా, ద్వాపర, కలియుగాదుల భేదములను గూర్చి చెప్పుఁడు. ఇప్పుడు ఫలానియుగమని తెలిసికొనుట యెట్లు?

(౧౭) ఏయే యుగ మెన్నాళ్లుండునో, ఆయా యుగ పరిమాణమునుగూర్చి చెప్పుఁడు.

(౧౮) ఏయే యుగములలో నేయే కర్మ లొనర్చిన ముక్తినిబొంది భగవత్ప్రాప్తికలుగునో, ఆయా యుగధర్మములను గూర్చియుఁ జెప్పవలయును.

(౨౦) వివిధ విధములగు వృత్తులవారికి ధర్మములను జెప్పవలయును.

(౨౧) రాజర్షి ధర్మములనుగూడ చెప్పవలయును.

(౨౨) ఆపద్ధర్మము లేవియో చెప్పవలయును.

(౨౩) ప్రపంచమున నెన్ని తత్త్వములు కలవో శెలవీయవలయును.

(౨౪) సమస్త తత్త్వముల స్వరూప, లక్షణ, హేతు లక్షణములను గూడ యెఱుకపఱచవలయును.

(౨౫) భగవదుపాసనా రహస్యమును విస్తారముగ వర్ణింపవలయును.

(౨౬) అధ్యాత్మ యోగ విధిని గూడ విస్తారముగ వర్ణింపవలయును.

(౨౭) యోగముద్వారా యోగేశ్వరుల కే యైశ్వర్యము ప్రాప్తించునో, తద్గతిని గూర్చి విస్తారముగ వర్ణింపవలయును.

(౨౮) శరీరము స్థూల, సూక్ష్మ, లింగములని మూఁడు విధములుగఁ జెప్పఁబడినది. యోగి లింగశరీరము నెట్లు భేదింపఁగలఁడు? ఈరహస్యమును గూడ నాకు జెప్పవలయును.

(౨౯) వేదస్వరూప మేది? ఉపవేదములని వేటి నందురు? ఏ వేదమున కేవి ఉపవేదములు? ధర్మశాస్త్రముల యొక్కయు, ఇతిహాస పురాణములయొక్కయు స్వరూపమును, వీటిసంఖ్యను మొదలగువాటిని గూర్చి చెప్పవలయును.

(30) సర్గ, స్థితి, ప్రలయములను గూర్చిన రహస్యమును గ్రమముగఁ జెప్పవలయును.

(31) ఇష్టమను జెప్పఁబడు యజ్ఞాది వైదికకర్మ లెట్లు చేయఁబడునో, ఆసంగతికూడ చెప్పవలయును.

(32) వాపీ, కూప, తటాకారామ దేవాలయాదిపూర్తి కర్మలను గూర్చియు, వాటి నిర్మాణ, విధులను గూర్చియుఁ జెప్పవలయును.

(33) స్మార్త కర్మలు, కామ్యకర్మలు, ధర్మార్థ కామములను త్రివర్గములకు సంబంధించి సాధన విధులను గూర్చియుఁ జెప్పవలెను.

(34) మోక్షమును బొందక, ప్రకృతిలో లీనమును జెందినవారు మరల నెట్లు పుట్టుదురో చెప్పవలయును.

(35) పాషండ ధర్మప్రచార ప్రసారము లెట్లు, యేల కలుగునో తెలుపవలయును.

(36( ఆత్మయొక్క బంధమోక్షములను గూర్చి చెప్పవలయును.

(37) ఆత్మ స్వరూపమందవస్థితి యెట్లుకలుగును?

(38) సర్వతంత్రస్వతంత్రుఁడును, సర్వసమర్థుఁడు నగు సర్వేశ్వరుఁడు అఘటన ఘటనాపటీయసి యగు తన ప్రియురాలితో నేవిధముగఁ గ్రీడించును?

(39) స్వేచ్ఛగాఁ దనమాయను బరిత్యజించి యుదాసీన భావముతోఁ గేవలము సాక్షీరూపుడై యెట్లుండును?

మహామునులారా! ఈ నా ప్రశ్నలకుఁ బ్రత్యుత్తరమును, ఇంకను నేను వినఁదగినవి యన్నియును మిక్కిలి త్వరగా వినగోరుచున్నాను. నేను నిన్ను శరణు జొచ్చితిని. సాధుపురుషులు శరణాగతుని సదా రక్షించుచుందురు. నీవు కూడ నన్ను శరణాగతునిగ భావించి సంసారసాగరమునుండి బయటపడవేయుఁడు. నాయీ శంకలన్నిటికిని సమాధానమొసంగి నిశ్శంకునిగఁ జేయుఁడు. నీవు స్వతః జ్ఞాన సిద్ధుఁడవు. నీవు శాస్త్రమును బఠించి, దానిని స్వయముగ సాక్షాత్కరింపఁ జేసికొంటివి. ఇఁక ఋషులు మునులో వినిన విషయములు చెప్పుచుందురు.''

అంత శుకుఁడిట్లనెను:- ''రాజా! నీవొక్క సారిగా నిన్ని ప్రశ్నలు వేయుచున్నావు. నీవేమియుఁ దినను లేదు త్రాగను లేదు. భోజనము చేయుము, లేదా కొంచెము ఫలహారము చేయుము. అదియు నక్కఱలేకున్నచోఁ గొంచెముగఁ బాలు త్రాగుము. పాలు అక్కఱలేకున్నచోఁ గొంచెముగ పండ్లు, నిర్మల గంగాజలమును బుచ్చుకొనుము. ఆహారపానీయములు లేకున్న నెట్లు సాగును? శరీరస్థితి అన్నపానీయములమీఁదనే ఆధారపడి యున్నది. ఆహారపానీయములు గొనకుండుటచే, మధ్యలోనేదైన నయ్యెనా, నీవు శంకతోడనే యుండిపోయెదవు. నీకు పూర్ణసమాధానము కలుగదు.''

ఇదివిని పరీక్షిన్మహారాజు మిక్కిలిదృఢముగ నిట్లనెను:- 'ప్రభూ! అమృతపానము చేసిన తర్వాతఁగూడ నెవఁడైనఁ జచ్చునా? నీవు నాకు మధురాతిమధురమగు శ్రీకృష్ణకథా

సుధారసమును పానము చేయించుచున్నావు. నాకర్ణరంధ్రము లందు అమృతమును గ్రుమ్మరించి హృదయమువఱకు బంపించు చుంటివి. మృత సంజీవనీ సుధను శరీరమంతటను జిలుకు చున్నావు. ఇఁక నేనెట్లు చావఁగలను? మధ్యలో నాకనిష్టమేల కలుగఁగలదు? కుపితుఁడగు శృంగి మహర్షి నామృత్యు కాలమును నిర్దేశింపకుండినను, తక్షకునిచే నేఁడుదినములలోఁ జావకుండినను నేను నిరంతరము కథను వినుచుఁ జావనేచావను. నిరంతర మీవిధముగానే నిరాహారుఁడనై కథాశ్రవణము చేయుచుందును. నీవు నా యాహారపానీయముల చింతను వీడవలెను. నాకుఁ గేవలము కేశవుని లలితకథలనే వినిపింపుము. నన్ను శంకారహితునిఁ గావించి పరమ పదమునకు అధికారిగా నొనర్పుము. నన్ను దుర్గతినుండి రక్షింపుము. ఇదియే శ్రీచరణములకు నా వినయపూర్వకమగు ప్రార్థన.''

సూతుఁడు శౌనకాది మహామునులతో నిట్లనెను:- ''మునులారా! ఈవిధముగఁ బరీక్షిన్మహారాజు నాగురుదేవుఁడగు శ్రీశుకమహర్షిని, తనప్రశ్నలకుఁ బ్రత్యుత్తర మీయవలయునని ప్రార్థింపఁగా నాతఁడు రాజు ప్రశ్నలనువిని మిక్కిలి సంతసించి, బ్రహ్మకల్పారంభమున సాక్షాచ్ఛ్రీమన్నారాయణుని వలనఁ గమలమునఁ గూర్చుండిన లోకపితామహుఁడగు బ్రహ్మవినిన ప్రకారముగ శ్రీమద్భాగవత తత్త్వమును వినిపించుటకుఁ బ్రవృత్తుఁడయ్యెను. పరీక్షిన్మహారాజేయే ప్రశ్నల నడిగెనో వాటికి క్రమముగఁ బ్రత్యుత్తరమిచ్చుటకు వ్యాసనందనుఁడగు శుకమహర్షి ప్రవృత్తుఁడయ్యెను.

ఛప్పయ.

బ్రహ్మన్! యహ సంసార భూమి ఆకాశ నదీ నద।
వన, పర్వత, గ్రహ, దిశా, స్వర్గ, పాతాల కమలహ్రద॥
ఇన సబకీ ఉతపత్తి, ప్రలయ రక్షా బతలావేఁ।
ధర్మ కామ, అరు అర్థ మోక్ష కో మార్గ దిఖావేఁ॥
వర్ణ ధర్మ ఆశ్రమ నియమ, భగవత్ చరిత సునాయికేఁ।
శంకా నాథ మిటాఇదేఁ, శరణాగత అపనాఇకేఁ॥

అర్థము.

బ్రహ్మణ్యమూర్తీ! శరణాగతుఁడనగు నాపై మమకారముంచి, యీప్రపంచములోని నదీ, నద, వన, పర్వత, గ్రహ, దిశా, స్వర్గ, పాతాళ, కమలాకరాదులయొక్కయుత్పత్తి స్థితి లయములనుగూర్చియు, ధర్మార్థ కామమోక్షముల మార్గములనుగూర్చియుఁ జెప్పవలయును.

ఇంకను వర్ణధర్మములనుగూర్చియు, ఆశ్రమనియమములనుగూర్చియు, భగవచ్చరిత్రమును గూర్చియుఁ జెప్పి నా శంకలనన్నింటినిఁ బోఁగొట్టవలయును.



# బ్రహ్మ తపస్సు - వైకుంఠదర్శనము

౯౪

శ్లో॥ తస్మై స్వలోకం భగవాన్ సభాజితః
సందర్శయామాస పరం నయత్పరమ్ ।
వ్యపేత సంక్లేశ విమోహ మాధ్వసమ్,
స్వదృష్టవద్భిర్విబుధై రభిష్టుతమ్॥

—శ్రీభాగ. ౨ స్కం. ౯ అ. ౯ శ్లో.

"బ్రహ్మ నిజస్థానంబైన పద్మంబునం దాసీనుఁడై యొక్కింత చింతించి యట్టి శబ్దంబు దన్నుఁ దపంబుసేయుమని నియమించుటగాఁ దలంచి ప్రాణాయామ పరాయణుండై జ్ఞానేంద్రియ కర్మేంద్రియంబుల జయించి యేకాగ్ర చిత్తుండై సకలలోక సంతాప హేతువగు తపంబు వేయి దివ్యవత్సరంబులు గావింప నీశ్వరుండు ప్రసన్నుండై పొడసూపిన నక్కమల సంభవుండు తత్ణంబ రాజసతామస మిశ్రసత్త్వ గుణాతీతంబును శుద్ధసత్త్వ గుణావాసంబును, నకాలవిక్రమంబును సర్వలోకోన్నతంబును సకల సురగణస్తుత్యంబును లోభమోహభయ విరహితంబును నపునరావృత్తి మార్గంబును ననంత తేజో విరాజితంబునునైన వైకుంఠపురంబుం బొడగని"

—శ్రీమదాంధ్ర భాగవతము.

భ ప్స యు.

హైప్రసన్న శుకకహేఁ భూప! సును సుఖ కే మగకూఁ।
పాకై బ్రహ్మ ప్రకాశ దిఖావే మాయాజగ కూఁ॥

సోచే఼ బ్రహ్మా సృష్టి కరూఁ కస నభ ధుని ఆఈ।
తపహి సబకో సార కరో తప భ్రమ మిటిజాఈ॥
దివ్య సహాస వత్సర పరమ, తప కీన్హోఁ విధి ఉగ్ర అతి।
పరమధామ వైకుంఠ మహా, లఖే ముదిత మన రమాపతి॥

అర్థము.

ప్రసన్నచిత్తుఁడై శుకుఁడిట్లనెను:- "రాజా! సుఖ మార్గమునుగూర్చి వినుము. మాయాజగమునకు బ్రహ్మ ప్రకాశమును జూపించెను. బ్రహ్మ సృష్టిచేయఁ దలంపఁగా నాకాశమునుండి యిట్లు ధ్వని వచ్చినది. 'తపమే అన్నిటికి సారమైనది. కావునఁ దపమును జేయుము. తపమువలన భ్రమ తొలఁగిపోవును.'

అంత బ్రహ్మ ఆవాక్యములను విని అనేక దివ్య సహస్ర వర్షము లుగ్రతపమును జేయఁగా సంతోషముతో వైకుంఠమున రమాపతి దర్శనమయ్యెను."

---

ఇంద్రియ విషయభోగములలో మునిఁగిన కొలఁది సంసారబంధన మధికముగ బిగియుచుండును. మన స్వాధీనము నశించిపోవును. అప్పుడు మనము పరాధీనుల మగుదుము. మనల నెట్లాడించిన నట్లాడవలసియుండును. ఎక్కడకూర్చుండఁ బెట్టిన నక్కడ కూర్చుండవలయును. విషయాధీనుఁడగువాఁడు తన కోరికను నెఱవేర్చుకొనుట కెట్లు శక్తుఁడగును? దీనికి విరుద్ధముగా సమస్తేంద్రియములను విషయములనుండి విరమించి మనస్సును దపస్సునందు లగ్నము కావించినచో నాతఁడు

స్వారాజ్యమున కధికారి కాఁగలఁడు. ఆతఁడు సర్వము నిర్వహింపఁ గలుగును. కావున విషయములలో మనస్సును జొన్పుటయే బంధనమని సారసిద్ధాంతము. మనస్సును విషయముల నుండి తొలఁగించి తపస్సునందు లగ్నముచేయుటయే మోక్షమార్గము.

ఈ కనఁబడు చిత్రవిచిత్రములగు మోహక సాంసారిక పదార్థములన్నిటికి ఆ సచ్చిదానంద ప్రభువుతో నేమి సంబంధము? ఈ పదార్థము లన్నియు ననిత్యములు, శ్రీహరి నిత్యుఁడు. ఇవి నాశవంతములు, ఆనందఘనుఁడగు ప్రభువు అవినాశి. ఇవి పరిణామమున దుఃఖదాయకములు, భగవంతుఁడు సర్వదా సుఖస్వరూపుఁడు. ఇదంతయు యోచించుకొని శుకమహర్షి పరీక్షిన్మహారాజుతో నిట్లనెను:- "రాజా! ఈ సాంసారిక పదార్థములతో నా విశుద్ధ జ్ఞానస్వరూపుఁడగు భగవంతున కేమియు సంబంధము లేదు. ఒకవేళ సంబంధముండిన, స్వప్నములోఁ జూచిన పదార్థములకును స్వప్నము కన్నవానికి నెంతటి సంబంధము కలదో, అంతటి సంబంధము కలదు. కలలో నేనుఁగులు, గుఱ్ఱములు, సాగర పర్వతాదు లన్నియుఁ గనఁబడును. కన్నులు తెఱవఁగానే పర్వతములును లేవు, నదులును లేవు, సముద్రములును లేవు. తన పూరిగుడిశెలో కుక్కిమంచములో చినుఁగుల దుప్పటి తాను ఉన్నాఁడు."

అంత మహారాజిట్లడిగెను:- "ప్రభూ! మానవుఁడు తాను బూర్వము సత్యముగఁ జూచినదే కలలోఁ జూచును. దీనినిబట్టి మొట్టమొదట నేదియో సత్యపదార్థ ముండియుండ

వలెనని తెలుచున్నది. స్వప్నద్రష్ట స్వప్నములో పదార్థము లన్నిటిని సత్యముగ నెంచును. నిద్రలేవఁగానే ఆతఁడు తన బుద్ధిభ్రమను గ్రహించును. తన యజ్ఞానము పోయినదను కొనును. ఎక్కడైన భగవంతునకు భ్రమయుండునా?''

అంత శ్రీశుకుఁ డిట్లనెను:- ''రాజా! దృష్టాంతము సకేక దేశమే గ్రహింపఁబడును. స్వప్నదృష్టాంతములో స్వప్నము చూచువానికి స్వప్నపదార్థము లన్నియుఁ గల్పితములని యేం తీసికొనవలయును. అచ్చట పదార్థములును లేవు, వాటితో నాతనికి సంబంధమును లేదు. కేవలము స్వప్నాశ్రయము చేతనే ఆతని కవి యున్నట్లు కనఁబడుచున్నది. ఇదేవిధముగ నీ సాంసారిక పదార్థములతోఁ బరబ్రహ్మకు సంబంధ ముండ లేదు, ఉండదు, ఉండఁబోదు, కాని ఆతని మాయచే నివి ఆతనికి సంబంధించి యున్నట్లును, సత్యములైనట్లును గోచరించు చున్నవి.''

రాజిట్లనెను:- ''ప్రభూ! ఒక పదార్థముచో నిది మాయచే సత్యముగ గోచరించు చున్నదనవచ్చును. లోకమున నానారూపములు, నానాకృతులగు పదార్థములు కలవు. అవన్నియు సత్యములే. అట్టివాటిని మీరు స్వప్నదృష్ట పదార్థములతో నేల పోల్చుచున్నారు?''

శ్రీశుకమహర్షి యిట్లనెను:- ''మహారాజా! ఈ మాయయే నానారూపముల నేర్పఱచినది. రాజదర్బారులకు పగటివేషగాండ్రు వచ్చుటలేదా? వారొక్కొక్కప్పుడు బిచ్చగాండ్రై, స్త్రీలై, రాజులై, రాజపురుషులై వేషములతో వచ్చుచుందురు. అందఱను దమ రూపములచే విస్మితులఁ

గావించుచుందురు. మొదట వారిని యథార్థముగ నక్షే చూచెదరు. తెలిసికొనఁగానే 'వీరు పగటివేషగాండ్ర'ని నవ్వుకొందురు. ఈ మాయకూడ పగటివేషగాండ్రవంటిదే. నానారూపిణియగు మాయాసంబంధముచే జీవుఁడు శుద్ధ చైతన్యుడయ్యు, మాయిక గుణములలో రమించుటచే దేహ, గేహ, స్త్రీ, ధన, భూ, వాహన, వస్త్రాదులందు మమకారము వహించి, అనిత్యము, నాశవంతము, క్షణభంగురమునగు పాంచభౌతిక శరీరమందహంభావము వహించి, ఇదినేను, అది నేను, నాకీశక్తి యున్నది, నేను దీనిని జంపఁగలను, దానిని గొట్టఁగలను, వానిని మోసగింపఁగలను, వానిపని పట్టింపఁ గలను, అక్కడికి పోయెదను, దీనిని దెచ్చెదను, దాని నిచ్చె దను, నేనిట్టి జ్ఞానిని, అట్టిధ్యానిని, మిక్కిలి మానవంతుఁడను, నేనావస్తువునకుఁ గర్తను, దానిని భరణపోషణచేయు భర్తను అని యిట్లు శరీరముమీఁద అహంకారమును వహించి వాగు చుండును. ఇదంతయు నేల జరుగుచున్నది? ప్రకృతి మాయ వలన. అవిద్యాకారణమున. కాలము సమీపింపఁగా, గుణ క్షోభముకలుగఁగా నీప్రపంచమంతయు నిర్మాణమగును. కాని, మాయాపతియెవఁడో, కాలనియంత యెవఁడో, స్వభా వముగఁ బ్రవర్తకుఁడెవఁడో అట్టివాని నీజీవుఁడు శరణుచొచ్చి నప్పుడు, సమస్త ప్రపంచ జననియగు మోహకమాయకు శాశనకర్తయని గ్రహించి, తన మహిమను గుర్తెఱిఁగి, అక్షరబ్రహ్మమందు రమించుచో, నా శుద్ధచేతనుఁ డజ్ఞాన రహితుఁడై తానహంకార మమకారములు చెందిన యీ మాయిక పదార్థములను వీడి ఉదాసీనుఁడు కాఁగలఁడు.

పరీక్షిన్మహారాజిట్లనెను:- "స్వామీ! మీరు చాల గూఢవిషయమును జెప్పితిరి. ఈవిషయమును మరలఁ దెలిసికొందును. ఇప్పుడు మీరు నాకు సృష్టిక్రమమును జెప్పుఁడు. ఈసృష్టి యెట్లైనది? బ్రహ్మమనస్సులో సృష్టిచేయు కోరిక యేలకలిగెను? ఆతఁడు తనకుఁదానే సృష్టింప మొదలిడెనా లేక యెవరైన నాదేశించినారా?"

మహారాజు ప్రశ్నలను విని నవ్వుచు శుకుఁడిట్లనెను:- "రాజా! ఈసృష్టిక్రమ మిట్లు అనాదికాలమునుండియు జరుగుచున్నది. బ్రహ్మకాయుర్దాయము నూఱు సంవత్సరములు. తర్వాత మాఱిపోవును. దానిని మహాకల్పమందురు. బ్రహ్మకొక్క దినమొక కల్పము. మహాకల్పమున మహాప్రళయమగును. కల్పములో త్రిలోకప్రళయము జరుగును. నేనీ కల్పవిషయమును జెప్పెదను. బ్రహ్మ శ్రీమన్నారాయణుని నాభిపద్మమునుండి యుత్పన్నమగుటచే దీనిని పద్మకల్ప మందురు. ఈ సృష్ట్యాదియందు బ్రహ్మతపమునకుఁ బ్రసన్నుఁడై భగవానుఁ డే భాగవతతత్త్వము నుపదేశించెనో, అదియే ఆత్మతత్త్వప్రాప్తికి ఏకమాత్ర సాధనము."

అంతఁ బరీక్షిన్మహారా జిట్లడిగెను:- "స్వామీ! సృష్ట్యాదియందు బ్రహ్మ యేయాదేశమునఁ దప మొనర్చెను? ఆతఁడు తప మొనర్చుటకు ప్రేరణ మెవరొనర్చెను?"

అంత శ్రీశుకుఁ డిట్లనెను:- "మహారాజా! సృష్ట్యాదియందు శ్రీమన్నారాయణుని నాభినుండి ఒక్క కమలముద్భవించెను. ఆకమలమునుండియే బ్రహ్మపుట్టెను. బ్రహ్మ పుట్టఁగానే నల్దిక్కుల చూడవలెనను కోరికగలిగెను. ఆకారణమున

నల్దిక్కులను రెండునేత్రములు కలిగిన నాలుగుముఖములు పుట్టెను. వానితో నెనిమిది దిక్కులు చూడఁగలిగియుండెను. అందువలన బ్రహ్మ చతురాననుఁడనఁబడెను. దిశలు పది యగుటచే బ్రహ్మకు మొట్టమొదట అయిదు ముఖము లుండెను. ఆ యైదవ ముఖమును శివుఁడుత్తరించెను.''

ఇదివిని శౌనకుఁడిట్లనెను:- "సూతా! తన తండ్రి యగు బ్రహ్మయొక్క అయిదవశిరమును శివుఁడేలఖండించెను? ఇట్టి లోకవిరుద్ధమగు కార్యమును మహేశ్వరుఁడేల చేసెను? ఆసంగతి మాకు చెప్పవలయును.''

ఇదివిని సూతుఁడిట్లనెను:- "ఈ కథ చాలపెద్దది. దీని నెప్పుడైన సమయానుసారముగ మీకు వినిపించెదను. నా గురుదేవుఁడు పరీక్షిన్మహారాజునకు వినిపించిన యా సృష్టి ప్రసంగమును మాత్రమే యిప్పుడు వినుఁడు. నేను సృష్టి తత్త్వముల యొక్క ప్రకృతి వికృతాదులను గూర్చి చెప్పెద నని మీరు భావింపకుఁడు. ఈసమయమున శ్రీమన్నా రాయణుఁడు లోకపితామహుఁడగు బ్రహ్మకు భాగవత తత్త్వము నెట్లుపదేశించెనో కేవల మా కథాప్రసంగమును మాత్రమే చెప్పవలసియున్నది.''

శౌనకుఁడిట్లనెను:- "లెస్స, లెస్స. సూతా! నీ కేది ఉచితముగఁ దోఁచిన దానిని జెప్పుము.''

ఇది విని సూతుఁడిట్లనెను:- "బ్రాహ్మణోత్తము లారా! బ్రహ్మ ఇటు నటు బిత్తరచూపులతోఁ జూచు చుండెను. భగవంతుఁ డతని హృదయములో సృష్టిచేయవల యునను సంకల్పమును గలుగఁజేసెను. పుట్టఁగానే ఆతనికి

సృష్టిరచనా చింతగల్గెను. సృష్టి యెట్లు వృద్ధియగునో, ఏవస్తువుచే సర్గము వృద్ధియగునో యను చింతచే నాతఁడు మగ్నుఁడయ్యెను. ఆసమయమున 'తప' 'తప'యను శబ్దము వినఁబడెను.

'తపములేనిది పని సాగదని బ్రహ్మ గ్రహించెను. తపముద్వారానే సమ్యక్ జ్ఞానదృష్టి ప్రాప్తించును. దానివలన నేను ప్రపంచరచనా ప్రకారము నెఱుఁగఁగలను.' అని యోచించి పద్మయోనియగు బ్రహ్మ పద్మము మీఁదఁ గూర్చుండి, పద్మాసనము వేసుకొని హృత్పద్మమందు పురాణ పురుషోత్తముని ధ్యానింప మొదలిడెను. ఆతఁడు దివ్య సహస్ర వర్షములు శ్వాసనుబిగించి ఘోరతప మొనర్చెను. ఆతఁడు తన మనః ప్రాణ, జ్ఞాన కర్మేంద్రియములను నిరోధించి మనస్సును బరబ్రహ్మయందు లగ్న మొనర్చి సమస్తలోకమును బ్రకాశింపఁజేయు ఘోరతప మొనర్చెను.''

శౌనకుఁ డిట్లడిగెను:- ''విషయభోగమునకు పదార్థములే లేవుగదా బ్రహ్మమనస్సు నేవస్తువునుండి తొలఁగించెను? ఏమి తపస్సును జేసెను?''

అంత సూతుఁడిట్లనెను:- ''శౌనకా! నీవుకూడ తెలిసియే యిట్లడుగుచున్నావు. ఈ బాహ్యవస్తువులలో నేమి కలదు? విషమునకు వేరు మనస్సు. సంకల్పముచేఁ జంచలత్వము కలుగును. తపస్సువలన చిందఱవందఱయైన వృత్తులను సంయమించి యొకేవైపునకు లగ్నముచేయఁబడును. తన నెవరు సృజించినదియుఁ, దనకు సృష్టిచేయవలెనను కోరిక యెవరు కలిగించినదియు, బ్రహ్మతపస్సుచేఁ దెలిసికొనఁ

దలఁచెను. ఇట్టి జ్ఞానము కలుగకున్న చో జీవుఁడు సాలెపురుగు వలెఁ దనవలను దానే అల్లుకొని దానిలోఁ జిక్కుకొనును. ఈ జ్ఞానము కలిగినతర్వాత జ్ఞాని యేదైనఁ జేసెనా ఆతనికి పుణ్యాపాపములు గాని సుఖదుఃఖములుగాని అంటవు. బ్రహ్మ తన సంకల్పమునకుఁ గారణమును వెదకుటకు మనస్సును నిరోధించి తపస్సుచేయ మొదలిడెను. మనో నిరోధము కావించుటయే తపస్సునకుఁ బరమలక్ష్యము.

శ్రీమహావిష్ణువు బ్రహ్మతపస్సునకు మెచ్చి యాతనికి పరమధామమును నిత్యసత్త్వస్థానము నగు వైకుంఠలోకమును జూపెను.''

అంత శౌనకుఁడిట్లనెను:- ''సూతా! వైకుంఠములోఁ గూడ సత్త్వముండు నెడల నదియు మాయికమే కదా! ఏలననఁగా సత్త్వరజస్తమములు మూఁడును ప్రాకృతికములు కదా!''

ఇది విని సూతుఁడిట్లనెను:- ''మహాభాగా! అక్కడిది యీ త్రిగుణములలోఁ జేరిన సత్త్వము కాదు. త్రిగుణములకు పైన మాయాతీతమగు దివ్యసత్త్వమొకటి కలదు. దానికి ఉపము లేదు. అది భగవంతుని దివ్యగుణము. దానివలననే వైకుంఠలోకము శాంతముగ నుండును. త్రిగుణములలో సముద్రములోవలెఁ దరంగములు లేచుచుండును. అక్క డూర్ములతో నేమిపని? అచ్చట నిత్యసుఖము కలదు.''

ఇది విని శౌనకుఁడిట్లనెను:- ''సూతా! మాకు వైకుంఠవర్ణనముచేసి చెప్పుము.''

అంత సూతుఁడిట్లనెను:- "నాకీ చర్మ చక్షువులతో వైకుంఠ దర్శనము చేయునంతటి సత్తా యెక్కడిది? నా గురువునకుఁగూడ గురువగు నారదమహర్షి వైకుంఠమునకు పోయి వచ్చుచుండును. ఆతనిద్వారా పరంపరగా వినిన వైకుంఠవర్ణనమును నేను మీకు వినిపించెదను. మీరు సావధానముగ శ్రవణము చేయుడు.

మునులారా! వైకుంఠలోకములో కాలము ప్రవర్తిలుడకవు. అది కాలాతీతమగు లోకము. అచ్చట మాయా లేశమే లేదు. ఇఁక నన్యవికారముల మాటఁజెప్పనేల? అచ్చట భగవంతుని పార్షదులందఱును జతుర్భుజులే. అందఱ రూపు రేఖాకృతి ప్రకృతులును, అస్త్రాయుధములును భగవానునితో సమానమైనవియే. ఆవిష్ణు పార్షదులకు దేవదైత్యులందఱును గరములు మోడ్తురు. అందఱ శరీరములు స్వచ్ఛములై, సుందరములై శ్యామలములై యుండును. అందఱ నేత్రములు వికచకమలములవలె శోభాయమానముగను, ఆకర్షకములై యుండును. అందఱ శరీరములమీఁదను విద్యున్మాలా లంకృతములగు దివ్యపీతాంబరములు శోభిల్లుచున్నవి. వారతి సుకుమారులు, కాంతి మంతులు, ప్రభావంతులు, ఐశ్వర్యవంతులు, శౌర్యవీర్యవంతులు. అందఱు మణి జటిత సువర్ణ విభూషణములచే సదా విభూషితులై యుందురు. వారి శరీర కాంతికి ఉపమయే లేదు. పగడపు కాంతి పాలిపోవును. కమలములకు కమనీయత కొఱవగానే యుండును. వైడూర్యము విరూపమగును. వారి కర్ణములందు కమనీయ కనక కుండలములు ప్రకాశించుచుండును. మస్తకమున మనోహర

మకుటము మెఱయుచుండును. కంఠమునఁ గమనీయ మౌక్తిక హారములు వ్రేలాడుచుండును. అందఱ చేతులలో తులసీ మాలలు తిరుగుచుండును. దేవలోకములోని దివ్య దేవాంగనలు కూడ ఆరూపములను గాంచి విమోహితలగుచుందురు. మునులారా! వైకుంఠములోఁగూడ కమనీయకాంతికలిగిన కాంతలకు కఱవు లేదు. అక్కడకూడ లక్ష్మికి చెలికత్తెలుగ నసంఖ్యాకములుగ, అతి అనుపమ లావణ్యయుక్తలగు నప్సరసలు ఇటునటు మెఱుఁగుతీఁగలవలె మెఱయుచుఁ దిరుగుచుందురు. వారు కులుకుచుఁ దళుక్కుమని అటు నిటు దిరుగుచుండుటచే మేఘాచ్ఛన్నమగు నాకాశము విద్యున్మాలలచేఁ బ్రకాశించునట్లు, వైకుంఠమెల్లప్పుడు శోభాయమానముగ నుండును.

అచ్చట లక్ష్మీదేవి మూర్తివంతయై సదా నివాసము చేయుచుండును. అచ్చట నామె తన చంచలతాస్వభావమును వీడును. పురాణపురుషుని పత్ని చంచలత్వము కలిగియుండుట స్వాభావికమే; కాని యచ్చట శ్రీహరి సదా కిశోరుఁడై యుండును. కావున లక్ష్మీదేవి సదా ఆతని గుణగానమందు లీనమగును. అచ్చట నొక దివ్యమగు నుద్యానవనము కలదు. అనేక పరమదివ్యజన్మలనుండి యనంతపుణ్యముచేతను, వివిధారాధనలచేతను వైకుంఠమునకుఁ జేరిన పక్షులు కూజితము చేయుచుండును. శుక, శారికా, పారావత, దాదుర, మయూర, చకోరాది పులుగులు సంగీతస్వరముతోఁ గూయుచుండును. అనంతపుణ్యములద్వారా యుగయుగములు ఆరాధన చేయుటచే నచ్చట వృక్షములుగనైనవి నిరంతరము దివ్యగంధమును వెదఁజల్లుచుండును. ఆ వృక్షశాఖలందు దివ్యమగు

పట్టుత్రాళ్ళచేఁ గట్టఁబడిన యూయలలు వ్రేలాడుచుండును. వాటిపై లీలగా, హావ భావ కటాక్షములతో వైకుంఠవిమోహిని యగు లక్ష్మీదేవి తన సఖులతో నూగుచుండును. ఊగు నప్పుడు పాడు పాటలు తన ప్రాణనాథుఁడగు గోవిందుని గూర్చియే పాడుచుండును. ఆమె గోవిందగుణగీతముల నాలాపించునప్పుడు వృక్షస్థములగు శుక, శారికా, మయూర, భ్రమరాదులు లక్ష్మియొక్క గుణగానమును జేయుచుండును. దానికి లక్ష్మి లజ్జితయై, ప్రణయకోపమునఁ బ్రణయిని తన ప్రాణవల్లభునివైపు చూచుసట్లు ప్రేమకోపమున నామె వాటివైపు చూచును.

సూతుఁ డిట్లనెను:- మునులారా! వైకుంఠవర్ణనము గావించుట వాగతీతమైనది. బ్రహ్మ సహస్ర, లక్ష, దివ్య సంవత్సరములు తపస్సుచేయగా నీ వైకుంఠధామ దివ్యదర్శనము లభించినది. సమస్త బ్రహ్మాండాధిపతియు, లక్ష్మీ జీవనాధారమును, భక్తసర్వస్వము నగు శ్రీహరి తన నంద సునంద సుబల, అర్హణాది ప్రధానపార్షదులతో విరాజిల్లుచుండుటను బ్రహ్మ కాంచెను. అందఱును సావధానముగ భగవత్సేవలో సంలగ్నులై యుండిరి. భగవంతుఁడు భక్తవత్సలుఁడు. ఆతఁ డెల్లప్పుడును భక్తానుగ్రహమునకై కాతరుఁడై యుండునని యాతని ముద్రవలననే తెలియుచున్నది. జీవులు తన్ను శరణుఁజొచ్చినవారిని గృపఁజూడవలయుననియే ఆతఁ డారాటపడుచుండును. కాని మునులారా! ఈ జీవులీ తుచ్ఛ సాంసారిక విషయములందే, యా రక్త, మూత్ర, మలయుక్తమగు దుర్గంధస్థానములందే రమించుట కువ్విళ్లూరుచుందురు. ఇవియే

పరమసుఖములనుకొనుచుందురు. మలములోఁదిరుగు పురుగునకదియే హితముగనుండునుగాని దుర్గంధముగఁ దోఁచదు. చీములోనుండుపురుగు క్రుళ్లి వాసనకొట్టు చీములోనే తిరుగుచునచ్చటనే దానికి సుఖమని తలఁచును. జీవి యీ తుచ్ఛ విషయమునుండి మనస్సును దొలిఁగించినచో వైకుంఠమార్గగామి కాఁగలుగును.

బ్రహ్మ అచ్చట శ్రీమన్నారాయణుని దర్శించెను. ఆతఁడు భుజముపైఁ జేయివేసి, మందహాసముతోఁ గ్రీగంటి చూపులతో, కిరీట, ముకుటాంగదాదులను ధరించి, రత్నజటిత సింహాసనమున విరాజిల్లుచుండెను. ఆతని నాలుగు భుజములందు అంగద, కంకణాది దివ్యాభరణములు శోభాయమానములుగ నుండెను. గళమున దివ్యవనమాలయు, వక్షఃస్థలమున శ్రీవత్సచిహ్నమును గలదు. అచ్చట లక్ష్మీదేవి నిత్యనివాసము చేయుచుండును. తళతళమెఱయు పట్టుపీతాంబరము ధరించియుండెను. ఆయనచుట్టును మూర్తిమంతములగుఁ బురుష, ప్రకృతి, మహత్తత్వ, అహంకార, పంచకర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు, మనస్సు, పంచతన్మాత్రలు, పంచభూతములు ఇవన్నియు దివ్యరూపములం ధరించియుండెను. భగవానుఁడు పూర్ణషడైశ్వర్యసంపన్నుడు. ఏయైశ్వర్యములోను నే యంశమును ఆయనలోఁ దరుగు లేదు. ఆతఁడు యథార్థముగ భగవత్పదవాచ్యుఁడు.

ఇట్టి మహైశ్వర్యపూర్ణుఁడు, సౌందర్యరాశి, ఆనందనిధి, శోభాధాముఁడగు భగవంతుని దర్శించి బ్రహ్మ ఆనందమును బట్టఁజాలకపోయెను. ఆతని శరీరము రోమాంచమగు

నట్లు హృదయమున నానందవేగ ముబికినది. నేత్రములనుండి శీతలప్రేమాశ్రువులు బయలుదేరెను. ఆతఁడు తన్నుఁ దా మఱచునట్లు ప్రేమలో మునిఁగిపోయెను. ఇట్టి భగవద్దర్శనము అనంత తపముచేతను, చిరకాలము శ్రద్ధాభక్తులతో యతి ధర్మమును బాలించుటచేతను, ఆతని కృపాకటాక్ష వీక్షణము చేతను గలుగుచుండును. ఇట్టి భగవంతుని తన కన్నుల యెదుటఁ గాంచి బ్రహ్మ ధైర్యము తెచ్చుకొని మిక్కిలి భక్తిశ్రద్ధలతో భగవత్పదారవిందములకుఁ బ్రణామము కావించెను.

తన చరణములకుఁ జతుర్ముఖుఁడగు బ్రహ్మ నతమస్తకుఁ డగుటను గాంచి, భగవంతుఁ డత్యంతస్నేహముతో సంపూర్ణ మమకారభావమును గుఱియించుచు నాతనిని బ్రేమించి, యాతని చేతిని బట్టుకొని, తన సమీపమునఁ గూర్చుండఁ బెట్టుకొనెను. ఆతనిపైఁ దన కృపాదృష్టులను బఱపెను. ఆతని చింతావ్యాకులముఖమును గాంచి భగవంతుఁడు నవ్వి యాత నితో సంభాషింప నుద్యుక్తుఁడయ్యెను.''

ఛప్పయ.

పరమ దివ్య వైకుంఠ కాంతి ఐశ్వర్య అమిత జహ్మఁ ।
సుఖాసీన పరివార పారషద సహ శ్రీహరి తహ్మఁ॥
నారాయణకూఁ నిరఖి నీర నయనని మేఁ ఛాయో ।
పకరి బాఁహ భగవాన పుత్రకూఁ ఢింగ బైఠాయో॥
వేదగర్భ తేఁ విష్ణు వర, బోలే వచన సుధా సనే ।
వత్స! బతాఓ బాత్ సబ్ సృష్టి సమయ చ్యోఁ అనమనే॥

అర్థము.

పరమ దివ్య వైకుంఠముయొక్క కాంత్యైశ్వర్యము లమితములు. అచ్చట శ్రీహరి పార్షదులతోడను, బరివారముతోడను నిండు పేరోలగమున సుఖాసీనుఁడై దర్శనమీయఁగా నారాయణుని వీధికాంచి, ఆనందబాష్పములను గార్చుచుండ, హరి నాతని బాహువులను బట్టుకొని తనదగ్గఱఁ గూర్చుండఁ బెట్టుకొని వేదగర్భుఁడగు బ్రహ్మతో సుధామయవాక్కులతో నిట్లనెను:- "వత్సా! సృష్టిసమయములో నేల విచారము కలిగినదో చెప్పుము."

—♦—

# పంచశ్లోకీ భాగవతము



శ్రీ భగవానువాచ.

శ్లో॥ జ్ఞానం పరమగుహ్యం మే యద్విజ్ఞాన సమన్వితమ్,
సరహస్యం తదంగం చ గృహాణ గదితం మయా॥

యావానహం యథాభావో యద్రూప గుణకర్మకః,
తథైవ తత్త్వవిజ్ఞానమస్తు తే మదనుగ్రహాత్॥

అహమేవాసమే వాగ్రే నాన్యద్యత్సద సత్పరమ్,
పశ్చాదహం యదేతచ్చ యోఽవశిష్యేత సోఽస్మ్యహమ్

ఋతేఽర్థం యత్ప్రతీయేత న ప్రతీయేత చాత్మని,
తద్విద్యాదాత్మనో మాయాం యథాభాసో యథా తమః॥

యథా మహాంతి భూతాని భూతేషూచ్చావచేష్వను,
ప్రవిష్టాన్యప్రవిష్టాని తథా తేషు న తేష్వహమ్॥
ఏతావదేవ జిజ్ఞాస్యం తత్త్వజిజ్ఞాసు నాత్మనః,
అన్వయవ్యతిరేకాభ్యాం యత్ స్యాత్సర్వత్ర సర్వదా॥
శ్రీభాగ. ౨స్క. ౯అ. ౩౦శ్లో. మొదలు ౩౫శ్లో. వఱకు.

క॥ వారిజభవ శాస్త్రార్థ వి
చారజ్ఞానమును భక్తిసమధిక సాత్త్వి
త్కారములను నీ మూఁడు ను
దారత నీమనమునందు ధరియింపనగున్.

సీ॥ పరికింప మత్స్వరూప స్వభావములును
మహిమావతార కర్మములుఁ దెలియఁ
దత్త్వ విజ్ఞానంబు దలకొని మత్ప్రసా
దమునఁ గల్గెడి నీకుఁ గమలగర్భ
సృష్టి పూర్వమునఁ జర్చింప నేనొకరుండఁ
గలిగియుండుదు వీతకర్మినగుచు
సమధిక స్థూల సూక్ష్మ స్వరూపములుఁ ద
త్కారణ ప్రకృతియుఁ దగ మదంశ

ఆ॥ మందు లీనమైన నద్వితీయుండనై
యుందు నాకు నన్య మొకటి లేదు
సృష్టికాలమందు సృజ్యమానంబగు
జగము మత్స్వరూపమగును వత్స.

క॥ అరయఁగఁ గల్ప ప్రళయాం
తరమున నాద్యంత విరహిత క్రియ తోడం
బరిపూర్ణ నిత్య మహిమం
బరమాత్ముఁడనై సరోజభవ యేనుందుణ్.

వ. అదియునుంగాక నీవు నన్నడిగిన యీజగన్నిర్మాణ మాయాప్రకారం బెఱింగింతు లేనియర్థంబు శుక్తిరజత భ్రాంతియుంబోలె నేమిటి మహిమందోఁచి క్రమ్మఱఁ దోఁపక మానునదియె మదీయ మాయావిశేషంబని యెఱుంగు మది యునుంగాక లేనియర్థంబు దృశ్యమానంబగుటకును గల యర్థంబు దర్శన గోచరంబు గాకుండుటకును ద్విచంద్రాది కంబును దమఃప్రభాసంబును దృష్టాంతంబులుగాఁ దెలియు మే ప్రకారంబున మహాభూతంబులు భౌతికంబులయిన ఘట పటాదులందుఁ బ్రవేశించియుండు నాప్రకారంబున నేను నీ భూత భౌతికంబులయిన సర్వకార్యంబులందు సత్త్వాది రూపంబులం బ్రవేశించి యుండుదు భౌతికంబులు భూతంబు లందుఁ గారణావస్థం బొందుచందంబున భూత భౌతికంబులు గారణావస్థంబొంది నాయందు నభివ్యక్తంబులై యుండవు. సర్వదేశంబులయందును సర్వకాలంబులయందును నేది బోధి తంబై యుండు నట్టిదియ పరబ్రహ్మస్వరూపంబు తత్త్వం బెఱుంగ నిచ్ఛించిన మిముబోఁటి వారలకు నీచెప్పిన మదీయ తత్త్వాత్మకంబైన యర్థంబ యర్థంబని యెఱుంగు మీ యర్థం బుత్కృష్టంబయిన యది యేకాగ్ర చిత్తుండవై యాకర్ణించి భవదీయ చిత్తంబున ధరియించిన నీకు సర్గాదికర్మంబులందు

మోహంబు నొందకుండెడినని భగవంతుండయిన పరమేశ్వ రుండు చతుర్ముఖున కానతిచ్చి నిజలోకంబుతో నంతర్థానంబు నొందె.."
—శ్రీమదాంధ్రభాగవతము.

ఛప్పయ.

బోలే బ్రహ్మ-విభో! జీవ జగ తత్వ బతావే౹
దివ్య భాగవత మర్మ సార సంక్షిప్త సునావే॥
హఁసి హరిబోలే-మోహి కృపాహి తేఁ సబపావే౹
ఆది అంతమైఁ రహూఁ నేతి కహి నిగమ జనావే॥
బినా భయే దీఖే గుహీ, మాయామేరీ మానియో౹
అన్వయ అరు వ్యతిరేక తేఁ, సదామోహి పహిచానియో॥

అర్థము.

బ్రహ్మ యిట్లనెను:- "విభూ! జీవతత్త్వమును గూర్చియు, జగత్తత్త్వమునుగూర్చియు నాకుఁ జెప్పుము. దివ్యభాగవత మర్మసారమును సంక్షిప్తముగ నాకుఁ జెప్పుము." నవ్వుచు నారాయణుఁ డిట్లనెను:- "నాకృపచే నంతయును దెలియఁగలదు. ఆద్యంతములందు నేనే యున్నాను. నన్ను నిగమములు నేతినేతి (ఇదికాదు ఇదికాదు) అని పలికినవి.

లేకుండియు నున్నట్లు కనఁబడునదియే నామాయ. అన్వయవ్యతిరేకములచే నన్నుఁ దెలిసికొనవలయును."



సాధనసిద్ధి అయిన తర్వాత కలుగు ఆనందము అవర్ణ నీయము. నాటిన వృక్షము ఫలించుటవలనను, దల్లిదండ్రులు తన పుత్రుని బుత్రవంతుఁడగుటఁ గాంచియు, కృషీవలుఁడు

పండిన పైరును గాంచియు, గురువు సర్వగుణసంపన్నుఁడును, విద్వాంసుఁడునగు యోగ్యశిష్యుని గాంచియు, యోగ్యుఁడగు తండ్రి యిల్లు,వాఁకిలిగల వానికిచ్చిన తన పుత్రిక సుఖపడుటను గాంచియు, వివాహానంతరము వధూవరులిద్దరు ననుకూలముగ నుండుటఁ గనియు నెంతటి యానందము కలుగుచుండునో అంతకుఁ గోటిరెట్లానందము భక్తులకు భగవద్దర్శనమునఁ గలుగును. భగవంతుఁడు కృపతో సాధకుని సాధనను సఫలము కావించి, అతిదుర్లభమగు తన దర్శనము నొసంగిన నప్పుడు కలుగు ఆనందమును వర్ణింప నలవికాదు. అది కేవల మనుభవైకవేద్యము. దివ్యసహస్ర వర్షములకు స్వాయంభువుఁడగు చతురాననునకు మాయాపతియగు శ్రీహరి దర్శనము ప్రాప్తించెను. కేవలము దర్శనమే కాదు. భగవంతుఁడాతని గృపఁ జూచి, మమకారముతో బాహువులు పట్టుకొని తన సమీపమునఁ గూర్చుండఁ బెట్టుకొనఁగా నాతఁ డనుభవించిన యానందమునకు మేఱలేకుండెను. ఆతఁడు స్తుతించుటకూడ మఱచిపోవునంతటి యానందమును దా ననుభవించెను. ఈ విధముగ బ్రహ్మ నిశ్చేష్టితుఁడై మాటాడఁజాలకుండుటను గాంచి మందహాసము చేయుచు మధుసూదనుఁ డిట్లనెను:- ''వేదగర్భా! నీ యోగము నిర్వ్యలీకము. నీవు నాయారాధనమును నిష్కపటభావముతోఁ జేసితివి. దీనికి ప్రత్యక్షప్రమాణము నాదర్శనము లభించుటయే.''

బ్రహ్మ చేతులు జోడించి యిట్లనెను:- ''ప్రభూ! నేను నిష్కాముఁడనని యెట్లనఁగలను?''

పండిన పైరును గాంచియు, గురువు సర్వగుణసంపన్నుఁడును, విద్వాంసుఁడునగు యోగ్యశిష్యుని గాంచియు, యోగ్యుఁడగు తండ్రి యిల్లు, వాఁకిలిగల వానికిచ్చిన తన పుత్రిక సుఖపడుటను గాంచియు, వివాహానంతరము వధూవరులిద్దరు ననుకూలముగ నుండుటఁ గనియు నెంతటి యానందము కలుగుచుండునో అంతకుఁ గోటిరెట్లానందము భక్తులకు భగవద్దర్శనమునఁ గలుగును. భగవంతుఁడు కృపతో సాధకుని సాధనను సఫలము కావించి, అతిదుర్లభమగు తన దర్శనము నొసంగిన నప్పుడు కలుగు ఆనందమును వర్ణింప నలవికాదు. అది కేవల మనుభవైకవేద్యము. దివ్యసహస్ర వర్షములకు స్వాయంభువుఁడగు చతురాననునకు మాయాపతియగు శ్రీహరి దర్శనము ప్రాప్తించెను. కేవలము దర్శనమే కాదు. భగవంతుఁడాతని గృపఁ జూచి, మమకారముతో బాహువులు పట్టుకొని తన సమీపమునఁ గూర్చుండఁ బెట్టుకొనఁగా నాతఁ డనుభవించిన యానందమునకు మేఱ లేకుండెను. ఆతఁడు స్తుతించుటకూడ మఱచిపోవునంతటి యానందమును దా ననుభవించెను. ఈ విధముగ బ్రహ్మ నిశ్చేష్టితుఁడై మాటాడఁజాలకుండుటను గాంచి మందహాసము చేయుచు మధుసూదనుఁ డిట్లనెను:- "వేదగర్భా! నీ యోగము నిర్వ్యాలీకము. నీవు నాయారాధనమును నిష్కపటభావముతోఁ జేసితివి. దీనికి ప్రత్యక్ష ప్రమాణము నాదర్శనము లభించుటయే."

బ్రహ్మ చేతులు జోడించి యిట్లనెను:- "ప్రభూ! నేను నిష్కాముఁడనని యెట్లనఁగలను?"

బంగారు బిందెలు బయటపడి, పరిశ్రమ సఫలము కాఁగానే, ధనస్వామి యానందమునకు మేఱయుండదు. ఆతఁడానంద డోలికల నూగులాడుచుండును. ఇష్టము వచ్చినట్లు తినును, త్రాగును. వసంతమాడును. దానినెదురుగఁబెట్టుకొని చూచు కొనుచుండును. ఇదేవిధముగ సాధకుఁడు నా దర్శన మగు వఱకు కల్యాణప్రాప్తికై పరిశ్రమ కావింపవలయును. నీవు మోహితుఁడవై కూర్చుండఁగా నే నాకాశవాణిద్వారా తపము చేయుమని యాదేశించితిని. నీవు నాయాదేశము నంగీకరించి యేకాంతమున ఘోరతప మొనర్చితివి. ఆ కారణమున నీవు నాకృపకుఁ బాత్రుఁడవైతివి. నా యనుగ్రహము వలననే నీకు సర్వసాధారణులకు దుర్లభమగు నా దివ్యలోక దర్శనము కూడ ప్రాప్తించినది.''

బ్రహ్మ దీనస్వరముతో నిట్లనెను:-''ప్రభూ! ఏసాధన ద్వారా నేను నీకృపకుఁ బాత్రుఁడనైతిని?''

భగవానుఁ డిట్లనెను:- ''నా కృప సాధన సాధ్యము కాదు. ఎవనిపై నాకృప ప్రసరించునో, ఆతఁడే నావైపుకు మరలును. ఆతఁడే సాధనలోఁ బ్రవృత్తుఁడగును.''

బ్రహ్మ యిట్లడిగెను:-''ప్రభూ! నీకృప వానిపై బఱపి నప్పుడు వానిచే నీవిట్టి కఠినసాధనలు చేయించు టెందులకు?''

భగవానుఁడిట్లనెను:- ''కేవల ముత్కంఠత కలిగించు టకును, అధికాధికముగ సుఖమును బ్రసాదించుటకును భగ వద్దర్శనము కొఱకెంతటి యుత్కంఠత కలుగునో, అట్టి తీవ్ర సాధనములందుఁ బ్రవృత్తి కలుగును. ఆ సాధన లొనర్చుటచే

దినదినము తీవ్రేచ్ఛ కలుగును. ఇచ్ఛ యెంత తీవ్రముగ నుండిన దర్శనములో నంతటిరసము లభింపఁగలదు. ఉత్కంఠత ఆనందవర్ధని. ప్రతీక్ష యిష్టదైవముతోఁ దన్మయత్వము కలిగించును. ఇవన్నియు రసాస్వాదన ప్రకారములు. కావుననే తపము నాహృదయమని చెప్పఁబడినది. హృదయమేది? నేను తపోమయుఁడనే. తపస్సే నా యాత్మ.''

బ్రహ్మ యిట్లనెను:- ''ప్రభూ! తపమనఁగా నేమి?''

భగవానుఁడిట్లనెను:-''తపమనఁగా సాధనము. ఆ తప సాధనము చేతనే నేను సృష్టిచేయుచున్నాను. ఇంక ననేక తపములద్వారా వివిధ సాధనలద్వారా దానిని రక్షించుచుందును. చివరకు కల్పావసానము కాఁగా తపమను సాధనము చేతనే దానిని సంహరించుచుందును. దానిని బలమనుము, వీర్యమనుము, సాధనమనుము, తపమనుము-శబ్దభేదము తప్ప విషయమంతయు నొక్కటే. నీవు తపస్సును నా ప్రేరణచేతనే చేసితివి. ఇప్పుడేమి కావలయునో చెప్పుము. నీకుఁ బ్రియమగు కార్యము నేనేమి చేయవలయును? నేను నీ కేయుత్తమ వరము నొసంగుదును?''

ఇదివిని బ్రహ్మ యిట్లనెను:- ''ప్రభూ! ఇప్పుడు మీ సమక్షమునఁ జెప్పవలసిన దేమున్నది? మీ కెఱుక లేకున్నఁ జెప్పుట ఉచితమే కాఁగలదు. నీవు ఘటములన్నిటిలోని విషయములనెఱిఁగినవాఁడవు. అణు పరమాణువులందు వ్యాపించియున్నవాఁడవు. సూక్ష్మాతి సూక్ష్మ వస్తువులందును, మహా ద్వస్తువులందును సమానముగ నున్నావు. నీవే అంతర్యా

మివై అందఱ బుద్ధిగుహాయందుండి కార్యము లొనర్పఁజేయు చున్నావు. అందఱ నాడించుచున్నావు. అన్ని అలంకారములు నీవే చేయుచున్నావు. అన్ని ఆడంబరములు నీవే కావించు చున్నావు. నామనస్సులోని విషయములన్నియు నీకుఁ దెలి యును. అయినను నీ వడుగుచుండుటచే, నీ యాదేశమును బాలించుటకై నా మనోగత భావములను వ్యక్తమొనర్చు చున్నాను. నామనోవాంఛితమును బ్రకటింతును. మీ సమ్ము ఖమున నాయిష్టవస్తువును యాచించెదను. కృపతో దానిని దీన హీన సాధన విహీనుడ నగు నాకుఁ బ్రేమపూర్వకముగఁ బ్రసాదించుఁడు."

భగవంతుఁ డిట్లనెను:- "బ్రహ్మ! నీవడిగిన దెట్టి దైన నిచ్చెదను. నాకడ నదేయవస్తువేదియును లేదు."

అంత బ్రహ్మ వినయముతో నిట్లనెను:- "నాథా! స్వామీ! సర్వసమర్థుఁడగు దాతవగు నీ ద్వారమునకు వచ్చి నేను విముఖుఁడనై తిరిగిపోను. నిన్నందఱు నరూపుఁడవందురు. కావున నరూపుఁడవైనను నీయొక్క స్థూల సూక్ష్మ రూప ముల రెంటిని నే నెఱుఁగునట్లు నాకుఁ బ్రసాదింపుము."

భగవానుఁ డిట్లనెను:- "బ్రహ్మ! నేను విష్ణువును. కేవలము జగద్రక్షణము చేయుటయే నా పని. ప్రజాసృష్టి చేయుట నీ పని. సంహారము చేయుట శివుని పని."

ఇది విని బ్రహ్మ యిట్లనెను:- "లేదు ప్రభూ! ఇదం తయు నీ క్రీడ. సాలీడు తనలోనుండి దారమును దీసి వలనల్లి, దానిలో నిటునుండి అటు, అటునుండి యిటు నానందముతోఁ

దిరుగుచుండును. అట్లే యీ ప్రపంచమంతయు నీ క్రీడా లయము. నీవు సృష్టిచేయునపుడు బ్రహ్మవగుదువు. పాలన కాలమున విష్ణువగుచుందువు. ప్రళయకాలమున రుద్రుఁడ వౌదువు. నీ వే విధముగ నీయచింత్య మాయాశక్తి నాశ్ర యించి ప్రాపంచికకార్యములన్నిటి నొనర్చుచున్నావో, దానిని నే నెఱుఁగఁజాలకున్నాను. ఆ విషయము నాకు దెలుపుము. మాయాస్వరూపమును గూర్చి చెప్పుఁడు. ఈ ప్రపంచమున కును ఆత్మకును సంబంధమేమియో తెల్పుఁడు.''

భగవానుఁడిట్లనెను:-''బ్రహ్మదేవా! నీవు సృష్టికార్య ములో నుండుము. చరాచరజీవులను వారివారి కర్మానుసార ముగఁ బుట్టించి, అధికాధికముగఁ బ్రజావృద్ధిని గావింపుము.''

బ్రహ్మ చేతులు జోడించి యిట్లనెను:- ''స్వామీ! మీరు నాకొసంగు నాదేశమును, ఉపదేశమును మిగుల సావ ధానముగఁ బాలించెదను. దానిని బాలించుటలో నే నెన్నఁడును బ్రమాదాలస్యములకుఁ గుఱికాను. నాప్రార్థన మొక్కటియే— చరాచరసృష్టి చేయుచున్నను నేను సృష్టికర్త ననుకొనకుండు నట్లును, గర్వాతిశయము నా యంతఃకరణమునఁ జేరకుండు నట్లును, గర్వము నన్నజ్ఞానములో ముంచి బాధింపకుండు నట్లును, నే నేదిచేసినను నీ ప్రేరణచేఁ జేయుచున్నట్లు భావిం చుచుఁ జేయునట్లును జేయవలయును.''

భగవానుఁ డిట్లనెను:- ''బ్రహ్మ! నీవు తెలియనివాని వలె మాటలాడుచున్నావు. నీకుఁగూడ గర్వాభిమానములు కలుగునా? నీవును నావంటివాఁడవే, నాతో సమానుఁడవగు నీశ్వరుఁడవే.''

బ్రహ్మ గద్గదకంఠముతో నిట్లనెను:-''ఈశ్వరేశ్వరా! నే నింతవఱకు కట్టివాఁడనుగాను; కాని మీరు స్నేహపూర్వకముగఁ బ్రేమతో నా చేయి పట్టుకొంటిరా, నా భుజమును బట్టుకొని మీ చరణసమీపమునకుఁ జేర్చుకొంటిరా, ప్రభూ! దీనిని సర్వదా నేను నిర్వహింపఁగలను. వివాహమందు వరుఁ డొక్కసారి వధువుయొక్క పాణిని గ్రహించును. ఆ కారణమున జీవితాంతమువఱకు దాని భరణ పోషణ పాలనభారము వహించుచున్నాఁడు. అదేవిధముగఁ జేయి పట్టుకొనినందులకు మాట దక్కించుకొనవలసినది మీరే. నేను మీ యాజ్ఞ చే—మీ సేవయను భావముతో — సృష్టికార్యమందు సంలగ్నుఁడనై ఉద్భిజ, స్వేదజ, అండజ, జరాయుజాది చిన్న, పెద్ద, మధ్యమ, ఉచ్చ నీచ జీవ విభాగము చేయునప్పుడు నేను స్వతంత్రుఁడనను నభిమానము కలుగకుండునట్లు చేయవలయుననియే మరల మరల నేను ప్రార్థించుచున్నాను.''

ఇది విని భగవానుఁడు నవ్వి యిట్లనెను:- ''పరమ ప్రేమాస్పదా! చతురాననా! నేను నీకు పరమదివ్యజ్ఞానమును జెప్పెదను. దానిని తెలిసికొనిన మానవుఁడు మోహజాలమునఁ బడఁడు.''

మిక్కిలి యుత్సాహముతో బ్రహ్మ యిట్లనెను:— ''నాథా! ఆ నీ జ్ఞాన మెట్టిది?''

భగవంతుఁ డిట్లనెను:- ''నా జ్ఞానము జన్మకర్మ దివ్యత్వమును బ్రబోధించునదై యున్నది. ఆ జ్ఞానము విజ్ఞానసహితమైనది. అది రహస్యయుతమైన పరమగుహ్యతత్త్వము. అది

బ్రహ్మ గద్గదకంఠముతో నిట్లనెను:–"ఈశ్వరేశ్వరా! నే నింతవఱ కట్టివాఁడనుగాను; కాని మీరు స్నేహపూర్వకముగఁ బ్రేమతో నా చేయి పట్టుకొంటిరా, నా భుజమును బట్టుకొని మీ చరణసమీపమునకుఁ జేర్చుకొంటిరా, ప్రభూ! దీనిని సర్వదా నేను నిర్వహింపఁగలను. వివాహమందు వరుఁడొక్కసారి వధువుయొక్క పాణిని గ్రహించును. ఆ కారణమున జీవితాంతమువఱకు దాని భరణపోషణ పాలనభారము వహించుచున్నాఁడు. అదేవిధముగఁ జేయి పట్టుకొనినందులకు మాట దక్కించుకొనవలసినది మీరే. నేను మీ యాజ్ఞ చే–మీ సేవయను భావముతో – సృష్టికార్యమందు సంలగ్నుఁడనై ఉద్భిజ, స్వేదజ, అండజ, జరాయుజాది చిన్న, పెద్ద, మధ్యమ, ఉచ్చ నీచ జీవ విభాగము చేయునప్పుడు నేను స్వతంత్రుఁడ నను నభిమానము కలుగకుండునట్లు చేయవలయుననియే మరల మరల నేను ప్రార్థించుచున్నాను."

ఇది విని భగవానుఁడు నవ్వి యిట్లనెను:– "పరమ ప్రేమాస్పదా! చతురాననా! నేను నీకు పరమదివ్యజ్ఞానమును జెప్పెదను. దానిని దెలిసికొనిన మానవుఁడు మోహజాలమునఁ బడఁడు."

మిక్కిలి యుత్సాహముతో బ్రహ్మ యిట్లనెను:— "నాథా! ఆ నీ జ్ఞాన మెట్టిది?"

భగవంతుఁ డిట్లనెను:– "నా జ్ఞానము జన్మకర్మ దివ్యత్వమును బ్రబోధించునదై యున్నది. ఆ జ్ఞానము విజ్ఞానసహితమైనది. అది రహస్యయుతమైన పరమగుహ్యతత్వము. అది

బ్రహ్మ యిట్లనెను:- "భక్తవత్సలా! నేను కృతార్థుండ నైతిని. నీకృపకుఁ బాత్రుఁడనైతిని. ఇప్పుడునాకు దీనినిఁ జెప్పుఁడు. ఈ జగత్తేమిటి? త్రికాలములందు సమాన సత్తాతోనుండు పరమతత్వమేది?"

భగవానుఁ డిట్లనెను:- "బ్రహ్మ! ఈ భౌతిక సృష్టి కాకపూర్వమే నేనున్నాను. ఆసమయమున సత్, అసత్, స్థూల, సూక్ష్మ, వీనికి కారణభూతమగు ప్రకృతియునులేదు. ఈ దృశ్యమానజగత్తుగూడ నాస్వరూపమే. సృష్ట్యనంతరము నను నేనే యుందును."

బ్రహ్మ యిట్లనెను:- "ప్రభూ! ఇదంతయు నానాత్వముగ గోచరించుచున్నది. సృష్టియందనేక పదార్థములు, అనేక రూపములు, అనేక వర్ణములు, అనేక నామములు కనబఁడుచున్నవి. సృష్ట్యంతమున నివియన్నియు నెచ్చటికి పోవును?"

భగవానుఁడు నవ్వి యిట్లనెను:- "నీకు నానాత్వముగఁ గనఁబడునదంతయు నాక్రీడ. దీపావళినాఁడు చక్కెరతోఁ జేయఁబడిన చాల ఏనుఁగులు, గుఱ్ఱములు, ఒంటెలు, గుఱ్ఱపుపిల్లలు, గొల్లవాడు, సిపాయి, పరాసువాఁడు, స్త్రీ, పెండ్లికూఁతురు, బాలుఁడు, బాలిక మొదలగు నాటవస్తువులు వచ్చును. పిల్లలు ఇదిగో నాగుఱ్ఱము, ఇది నాగుఱ్ఱపు పిల్ల, ఆపిల్లకు ఒంటెపిల్లనుతీసికొనిరా, ఆబొమ్మను ఏనుఁగుపై నెక్కించుము —— అని యిట్లు బొమ్మలతోఁ చాలసేపు ఆడుకొనుచుందురు. ఆట వస్తువులన్నియు విఱిచివేయఁబడిన తర్వాత నేనుఁగులును లేవు, గుఱ్ఱములును లేవు. అన్నియుఁ

జక్కెరలో విలీనములైనవి. గుజ్జమును బండరాతిపై నుద్దిరి. అప్పుడది తననామ రూపములను విడిచిపెట్టి చక్కెరలోఁ గలిసిపోయెను. సిపాయి చేతులు కాళ్లు విఱిచి పిసికి పిండి చేసిరి. సిపాయి అంతర్ధానమై ఒకతులము చక్కెరమాత్రము మిగిలెను. నిమిషములో నాటలైనవి. అక్కడిప్పుడు గజమును లేదు, గుజ్జమును లేదు. కేవలము కొంచెము చక్కెర మిగిలినది. ఇదేవిధముగఁ బ్రళయాంతమున నన్నియును నాశనము కాఁగా మిగులునది నేనే.''

బ్రహ్మ యిట్లనెను:- ''స్వామీ! మీ రూపము విషయమునుగూర్చి చెప్పితిరి. మీ మాయా స్వరూపమును గూర్చి చెప్పుఁడు.''

ఇది వినఁగానే భగవానుఁడు కిలకిలనవ్వుచు నిట్లనెను:- ''బ్రహ్మ! ఇది చాల మోసకత్తె. దీనివలలోఁబడి జ్ఞానులు, భక్తులు, యోగులు, కర్మిష్ఠులు, జపానుష్ఠానపరులు, తపోనిష్ఠులు, సన్న్యాసులు, అందఱును మోసపోవుదురు. నా మాయను దెలిసికొనిన నంతయుఁ దెలిసికొనినట్లే. నా మాయను దెలిసికొననిది నా పరిచయము గలుగదు. ఈ నా విచిత్రగృహిణియే అందఱను మోసగించుచున్నది.''

బ్రహ్మ విస్మితుఁడై యిట్లనెను:- ''ప్రభూ! దాని స్వరూపమునుగూర్చి చెప్పుము.''

భగవానుఁడు కొంచెము ఆగిఆగి యిట్లనెను:-''స్వరూపమా, స్వరూపము నేమని చెప్పుదును? స్వరూప ముండిన గదా చెప్పుటకు. లేదు. ఇదియును జెప్ప వీలుపడనిది. ఏల

ననఁగా లేనిది ఉన్నట్లు కనఁబడుచున్నది. కన్నులక్రింద వ్రేలితో నదిమినచో ఇద్దరు సూర్యులు, ఇద్దరు చంద్రులు కనఁబడుదురు. వృద్ధావస్థలోఁ గొందఱకు రెండవచంద్రుఁడు ఆభాసముగఁ గనఁబడుచుండును. అదేవిధముగ నాకానాక సత్తాచే అసత్తైకూడ సత్తుగా గోచరించుచున్నది. సత్తు కనఁబడనిది. సూర్యప్రకాశము చొరఁబడని అంతర్గృహము సర్వదా అంధకారముగనే యుండును. అచ్చటికి దీపమును గొనిపోయిన నంధకారము కనఁబడదు. అంధకార మచ్చటి నుండి పోలేదు, కాని దీపమున్న కారణమున కనఁబడుటలేదు. దీపము నచ్చటనుండి తొలఁగించినచో మరల యథాప్రకారముగ నంధకారము వ్యాపించును. రాహువు నక్షత్రమండలమునుండి యెచ్చటికిని వెళ్లుటలేదు. నక్షత్రమండలములోనే కలదు; కాని కనఁబడదు. అదేవిధముగ నాత్మ నిత్యమున్నప్పటికిని కనఁబడదు. ఇదంతయు మాయాకార్యమే. నా మాయచేతనే యీ మాయిక విద్వాంసు లనేకార్థముల నొసఁగ్చిరి. అవన్నియు సరియే. ఏలననఁగా నామాయలో నన్నియు సంభవములే. మాయలో నసంభవ మను వస్తువే లేదు. మిగిలినవన్నియు దానిలో సమావేశమగును.''

బ్రహ్మ చాలగ విచారించి యిట్లనెను:- ''ప్రభూ! నాకు సరిగా మనస్సునకుఁ బట్టలేదు. ఏమో అయోమయముగ నున్నది. ఒక్కొక్కసారి మీ రిదియంతయు నా రూపమే యందురు. తర్వాత మరల నీ ప్రపంచమునకు వేఱుగా నున్నా ననుచుంటిరి. అదెట్లు? నాకు స్పష్టముగఁ జెప్పుఁడు.''

భగవానుఁడిట్లనెను:- "బ్రహ్మా! ఇది మోటుమాట. పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అను నీపంచ భూతములు తమ కారణరూపమున సమస్త భౌతిక పదార్థములందు వ్యాపించుచున్నట్లు కనఁబడుచున్నవి. ఈ భూతములకు వేఱుగ నున్న పదార్థమేమియును లేదు. అయ్యును బంచభూతములు వీటి అన్నిటికిని వేఱుగ నున్నవి. శరీర నాశము కాఁగానే మహాభూతములు నాశము కావు. మానవ శరీరము పార్థివమే. ఈ శరీరమందు పంచభూతములు గాక వేఱొక స్థూల పదార్థ మేమున్నది? నేఁడీ శరీరము మృతి జెందెనా సమస్తభూతములు తమ కారణములలో విలీనములగును. శరీరములు నశించుటచే మహాభూతములందు వృద్ధియేర్పడదు. అనంత శరీరములలో వ్యాపించుటచే వానిలోఁ దరుగేమియుఁ గనుపింపదు. నదులు వర్షకాలములో నెంత వేగముతో వచ్చి సముద్రములోఁ బడినను సముద్రము పెరుగదు కదా! జ్యేష్ఠాషాఢములలో నత్యంతాల్ప జలము పాఱుచున్నప్పటికిని దానిలోఁ దరుగు కనఁబడదు. ఇదే విధముగ సమస్త ప్రాణులలో నాత్మస్వరూపముగ సర్వాంతర్యామి భావనచే నుండినప్పటికిని వాస్తవముగ నేనన్నిటికిని వేఱుగనే యున్నాను. భగవంతుఁడే యీ విశ్వమంతటను సర్వత్ర సర్వదా వ్యాపించి యున్నాఁడని వేదము అన్వయ వ్యతిరేకములచేతను, అనేక హేతువులచేతను సిద్ధాంతము చేయుచున్నది."

బ్రహ్మ యిట్లడిగెను:- "ఈ యన్వయ వ్యతిరేకమేమి?"

భగవానుఁ డిట్లనెను:- "అన్వయము కలుపుటకును నేకమొనర్చుటకును, వ్యతిరేకము వేఱుచేయుటకును బనికి వచ్చును. చాలమంది నల్లనివారు, గౌరవర్ణమువారు, పచ్చని వారు, చిన్నవారు, పెద్దవారు, లావువారు, సన్ననివారు ఉందురు. వీరందఱకును రెండుచేతులు, రెండుకాళ్లున్న పురుషులతో నన్వయము కలదు. అనఁగా నేకపురుష సంజ్ఞకు సంబంధించియుండును. జరాయను తిత్తిలోఁ బుట్టువాటి నన్నిటిని జరాయుజము లందురు. పక్షుల నేకములు కలవు. పేర్లెన్ని చెప్పఁగలను? ఇవన్నియు అండములనుండి పుట్టుటచే నండజములని పిలువబడును. వృక్షము లసంఖ్యాకములు. ఇవన్నియు నుద్భిజములలో జేర్పఁబడినవి. చెమట వలనఁ బుట్టినవి స్వేదజములలో నన్వయింపఁబడినవి. ఈ నాలుగు రకములను నొకే జీవకోటిలోఁ జేర్పఁబడినవి. జీవశక్తి కల వన్నియు జీవులు. వీటినన్నిటిని జీవులతో నన్వయింపఁ బడినవి. ఇదేవిధముగ శ్రుతి అన్ని పదార్థములను జెప్పి, చివరకు ఈ కనఁబడునదంతయు బ్రహ్మమనెను. దీనిలోఁ గనఁబడు నానాత్వము నిజముగ లేదు."

బ్రహ్మ యిట్లనెను:- "అవును, ఇది నిజమే. దేనిలో సత్తా కలదో, చైతన్యత కలదో, ఆనందానుభూతి కలదో యదియే బ్రహ్మ. ఈజీవులన్నిటిలో న్యూనాధిక్యతలు కనఁ బడుచున్నవి. కావున నన్నియుఁ దారతమ్యముచే సచ్చిదానందస్వరూపమై యున్నది. ఇఁక నిప్పుడు వ్యతిరేకమును గూర్చి చెప్పఁడు."

భగవానుఁ డిట్లనెను:- "అసలు వస్తువును కప్పిపుచ్చుటకు వ్యతిరేకమందురు. సారమునుగ్రహించి, తుక్కును బార వేయుట. దీనికొక దృష్టాంతమును వినుము. మధురాపురమున నొక బ్రాహ్మణుఁడు నివసించుచుండెను. ఆతనికి చక్కని రూపగుణవతియు, సుశీలయు, లజ్జావతియు, శీలవతియను పేరు గల కూఁతురుండెను. శీలవతి పేరుకుఁదగిన గుణములు కలది. బాలికలకు ప్రధానగుణము శీలము. శీలమున్నచోట కన్ని గుణములు వచ్చిచేరును. శీల సంకోచములను బరిత్యాగము కావించిన వారి దగ్గఱనుండి మెల్లమెల్లగా సమస్తగుణములు జారిపోవుచుండును. ఆ స్థానమును బూర్తి కావించుటకు దుర్గుణములు వచ్చి చేరును.

తండ్రి తన ప్రియపుత్రియగు శీలవతివివాహము ప్రక్క గ్రామమున నున్న సుశీలుఁడును, విద్వాంసుఁడు నగు నొక బ్రాహ్మణకుమారుని కిచ్చి చేసెను. ఆ గ్రామములో నింకఁ గొందఱు పిల్లల వివాహముకూడ జరిగెను. అది శ్రావణ మాసము. వరులందఱును సుందరములగు చొక్కాలను, పాగలను, రంగురంగుల ధోవతులను గట్టుకొని తమ అత్తవారింట అల్లెము దినుటకు వెళ్లిరి. కొందఱు గుఱ్ఱముల నెక్కి వెళ్లుచుండిరి. వెనుకనే బాజాభజంత్రీలు వెళ్ళుచుండిరి. కొందఱు పల్లకీలమీఁదఁ గూర్చుండియుఁ, గొందఱు రథములమీఁదఁ గూర్చుండియు, నానందసాగరమున నోలలాడుచు వెళ్లుచుండిరి. శ్రావణమాసములోఁ దండ్రులు తమ పుత్రికలను అత్తవారింటినుండి పుట్టినింటికి బిలిచి తెచ్చుకొందురు. శీలవతియుఁ దన పుట్టినింట నేయుండెను. ఆమె భర్తయుఁ

జక్కని వస్త్రములను గట్టుకొని నలుగురు స్నేహితులతో నత్తవారింటికి అల్లెముతినుటకు వచ్చెను. ఆనలుగురు ఆ త్తవా రింద్లును నచ్చుటనే. అందఱొకే యీడువారు. అందఱు నత్తవారింటికి వచ్చుటచే నలంకారములు చేసికొనియుండిరి. అందఱును వస్త్రభూషణములచేఁ దమకుఁ దామే అలంకరించు కొనిరి. విశ్రాంతిఘట్టమునకు వచ్చి, వారు యమునలో నాచ మింపఁబోయిరి. దైవికముగ శీల ఆ సమయమున తన చెలి కత్తెలతో యమునలో స్నానముచేయ వచ్చెను. దూరమున నుండియే యామె తన భర్తను గాంచెను. ఆమె సిగ్గుచే శరీర మును ముడుచుకొని, యొక చెలికత్తెచాటున నక్కెను. ఈమె భర్త వీరిలో నొకరై యుందురని అందఱును గ్రహించిరి. చెలికత్తెలు మిక్కిలి ఉల్లాసముగ నిట్లనిరి:- 'శీలా! వారెవరో చెప్పవే?' శీల మెదలకుండెను. కులవతియు, శీలవతియు నగు కన్య తన భర్తను జేయిచాచి చూపించుచు బహిరంగముగ నెట్లు చెప్పఁగలదు? అది ద్వాపరయుగము. అది కలియుగమే యై యుండినచో, నామె వెంటనే గయ్యాళివలెఁ దల యెత్తు కొని, పన్నులిగిలించుచు నందఱసమక్షమున వానిదగ్గఱకుఁ జేరి నాతని పేరుపెట్టి 'రమేశా! నీ వెప్పుడు వచ్చితివి? వెళ్లుదము పద' అని చేయిపట్టుకొని కొనిపోయెడిదే. ఇది యనార్య సంస్కృతి. ద్వాపరయుగములో నిట్టి నిర్లజ్జావ్యవహారమును ననార్యులుకూడ చేసెడువారు కారు.

ఇట్లు మాటిమాటికి ఆమెనడిగి యిబ్బందిపెట్టినకొలఁది ఆమె యింకను సిగ్గుపడుచుండెను. ఆ వివాహిత బాలికలలో నొకతె మిక్కిలి తెలివికలది కలదు. ఆమె అత్తవారింటికి

పోయివచ్చెను. అత్తవారింట నడువవలసిన నడక ఆమెకు తెలియును. ఆమె యా యెదుగురవైపు చూచి యిట్లనెను:- 'మంచిది. శ్యామవర్ణముగనుండి, పసుపుపచ్చ దుప్పటి కప్పుకొన్నవారా యేమి?' శీల సంకోచముచేఁ దల యూపెను. అంత మరల నామె యిట్లడిగెను:- 'ఆతని ప్రక్కన బక్క-పలచగ గౌరవర్ణముఁ కలిగి, లేతయెఱ్ఱరంగు తలగుడ్డను జుట్టుకొని తెల్లని చొక్కా ధరించిన యాతఁడా?' శీల కాదని తల యూపెను. బాలికల యుత్సుకత అతిశయించెను.

ఆ చతురబాలిక యిట్లడిగెను:- 'నవ్వుచు మాటలాడుచు, పట్టు నీలివస్త్రమును ధరించి పచ్చని పాగ ధరించిన యాతఁడా?' ఇది విని శీల మరల తల నూపెను. అంత నామె మరల నిట్లనెను:-'అట్లైన, గోధుమరంగుకలిగి, నెఱపట్టుపూలు కుట్టఁబడిన చొక్కాను దొడుగుకొనియుండెనే, ఆతఁడా?' శీల మరల మెల్లగాఁ గాదని తలయూఁపెను. నేతి నేతి (ఇది కాదు ఇది కాదు) అని నల్గురను గూర్చి చెప్పెను. ఇఁక నైదవవాఁడీమె భర్తయని బాలికలు గ్రహించిరి. ఆమె యిట్లడిగెను:- 'మందహాసము చేయుచు, తెల్లని చొక్కాను ధరించి, కొఱడా నాడించుచున్నాఁడే ఆతఁడేననుకొనుచున్నాము. ఏమి పలుకవేమి?' శీల యిప్పు డేమియును బలుకలేదు. ఆమె లజ్జితయై మౌనము వహించెను.

అట్లే శ్రుతిభగవతి లజ్జతోఁ దన పరమపతియగుఁ బరమేశ్వరుని విషయములో 'నేతి నేతి' యని చెప్పి – లజ్జితయై యూరకుండి సంకేతమునఁ జెప్పెను. దీనికే వ్యతిరేకమందురు. ఇదేవిధముగ నన్వయముచేఁ దెలిసికొనుము లేదా అన్నిటిని

ద్రోసిపుచ్చి మిగిలిన దదియేనని గ్రహించుము. ఏవిధముగఁ జూచినను మిగులునది ఆత్మతత్త్వ మొక్కటియే. ఆత్మతత్త్వ మెఱుగఁగోరువారు తెలిసికొనఁదగిన విషయ మిదియే. దీనిని దెలిసికొనినా అన్నిటిని దెలిసికొనినట్లే. దీని నెఱుఁగకున్న సర్వము నెఱుఁగనట్లే.

భగవానుఁడు బ్రహ్మతో నిట్లనెను:- బ్రహ్మా! ఇది నా యొక్క సారతత్త్వము. నీవు కల్ప కల్పాంతరములలోను దీనిని మఱువవలదు. దీనిని స్మరించుచు నీ వెట్టి సృష్టి కావించి నను, నెంతగాఁ బ్రపంచవిస్తారము కావించినను నీకు మోహము కలుగఁజాలదు. తెలిసినదా?''

బ్రహ్మ చేతులు జోడించుకొని వినయముగ నిట్లనెను :- ''అవును! స్వామీ! నేను నీ మాహాత్మ్యమును, నీస్వరూప మును, మాయాస్వరూపమును దెలిసికొంటిని. నీవు అను గ్రహామువలననే లభింతువనియుఁ దెలిసికొంటిని.''

అంత శౌనకుఁ డిట్లనెను:- ''సూతా! 'స్పష్టవక్తా న వంచకః' స్పష్టముగ మాటలాడువాఁడు మోసకాఁడు కాఁజాలఁడు. నీవు గడబిడగఁ జెప్పితివి. బ్రహ్మ ఈశ్వరుఁడు. ఆయన బాగుగా గ్రహించి యుండవచ్చును. ఆతనికిఁ జెప్ప వలసిన దేముండును? కాని యథార్థమునకు మేమేమియును గ్రహింపలేకపోయితిమి. మాయ, సత్తు, అసత్తు, అన్వయము, వ్యతిరేకము, ఉన్నాఁడు, లేఁడు ఇట్టి పారిభాషిక శబ్దములను జెప్పి మమ్ము నీవాశ్చర్యజనకులుగ నొనర్చితివి. మేమును నీ వెట్లు పలికిన నట్లు తలయూపుచుంటిమి. మధ్యలో నేమైన

మాటలాడిన యెడల నీవు విఘ్నమొనర్చినట్లు భావించెద వేమోనని యూరకుంటిమి.''

ఇది వినఁగానే సూతుఁడు బిగ్గఱగ నవ్వి, మరల నవ్వుచు నిట్లనెను:- ''మహాభాగులారా! మీకుఁ జెప్పఁదగిన దేమున్నది? మీరందఱు సర్వమును దెలిసికొనియేయున్నారు. ఎన్నాళ్లక్రిందటనో సర్వము తెలిసికొనియేయున్నారు. ఇదంతయు సాంసారికులకొఱకై యిట్లు వారికి ప్రతినిధులై పలుకుచున్నారు. ఈ విషయమును విస్తారమొనర్పఁగోరిన-చో మునివరులారా! ఈ కథాప్రసంగమున నీ గూఢతత్త్వము నింతకంటె విస్తారముగ నొనర్ప వీలులేదు. మతభేదమునకు కారణమీ మాయమే. 'యథా భాసో యథా తమః' అను దానిపై ననేకులగు నాచార్యులు అనేకములగు నభిప్రాయములను బ్రకటించిరి. వాటినన్నిటిని జెప్పుచుఁ గూర్చుండిన నా కథాప్రవాహము ఆగిపోఁగలదు. కథాప్రసంగము బహుగంభీరము, జటిలమైనది. కావున దీని నింతటితో సరిపుచ్చుదము. ఈ మాయా విషయముననే అనేక వాదవివాదములు కలవు. కొందఱు ఇది భగవంతుని నిత్యశక్తియనియు, మఱికొందఱు అఘటన ఘటనా పటీయసి యనియు జెప్పుదురు. కొందఱు దీనిని సత్తుకాదు, అసత్తుకాదు, సదసత్తుకాదని తప్పించుకొని పోవుదురు. ఈ విధముగ నీవిషయములోఁ జాల మతభేదములు కలవు. ఎవఁడును దీనిని దర్కముద్వారా యథార్థరూపమును నిర్ణయింపఁజాలనంతటి చిక్కువిషయము మాయానిర్ణయము. అందఱు నంధకారములోఁ దడవుకొనుచున్నారు. సమస్తమునుద్యజించి మాయాపతిని శరణుజొచ్చితిమా అప్పుడు

దీని మర్మమును దెలిసినవారమే యగుదుము. ఆతనిముం దిది దాగియుండును. వాచాలస్త్రీ ఉత్సవములలో బడబడ వాగుచుండును. అందఱ నేదియో అనుచుండును. తన భర్త స్నేహితుఁడు వచ్చెనా, ఆమె చాటుకుఁబోయి దాగుకొనును. తల్లికి తండ్రికి నే సంబంధమైన నుండుఁగాక, మన కామె తల్లియే యగును. ఆమెను దల్లిగనే మన మెఱుఁగుదుము. అట్లే భావించెదము. అట్లే ఆదరసత్కారములు కావించెదము. మునివరులారా! మీరు నన్నిప్పుడు మాయాజాలములోనే పడియుండనీయకుఁడు. కృష్ణకథను జరుగనీయుఁడు. ప్రసంగమును జరుగనీయుఁడు.''

ఇది విని శౌనకుఁ డిట్లనెను:- ''మంచిది సూతా! ఈ చిక్కువిషయమును అవకాశము చిక్కినప్పుడు తెలియఁజెప్పవలయును. బ్రహ్మ భగవానునివలనఁ దెలిసికొని తర్వాత నేమి చేయుచుండెను? సూఁతా! సీతారామచంద్రులు, రాధేశ్యామ గోపాలుఁడు నీకు మేలుచేయునుగాక! మాకు సమస్త వృత్తాంతమును వినిపించుము.''

అంత సూతుఁ డిట్లనెను:- ''మునులారా! ఈ విధముగ శ్రీమన్నారాయణుఁడు లోకపితామహున కుపదేశ మొసంగి యంతర్ధానమయ్యెను. భగవంతుఁ డంతర్ధానము కాఁగా సర్వభూతమయుఁడగు బ్రహ్మ భగవంతుఁడున్న దిక్కునకు నమస్కరించెను. గతకల్పముల ననుసరించి యాతఁడు సృష్టిరచనలోఁ బ్రవృత్తుఁడయ్యెను. గారడీవాఁడు నిమిషములో రూప్యముల బొత్తులుపెట్టినట్లును తన సంచినుండి చిత్రవిచిత్ర వస్తువులను

దీసినట్లును బ్రహ్మ గుంపులు గుంపులుగ జీవులను సృష్టించుచుండెను.

ఒకానొకప్పుడు బ్రహ్మ యొక అనుష్ఠానమును బ్రారంభించెను. ఆ అనుష్ఠానము సాంసారికవస్తుప్రాప్తికొఱకు కాదు. కేవలము ప్రజాకల్యాణము గలుగవలెనను శుభసంకల్పము తోడనే. ఆ సమయమున నెల్లప్పుడును దిరుగుచు, వీణ మీటుచు, హరిగుణగానము చేయుచు బ్రహ్మమానసపుత్రు లందఱిలో శ్రేష్ఠుఁడును, మహాభాగవతుఁడును, మహామునియు నగు నారదుఁడు బ్రహ్మకడకువచ్చి యాతని సేవించుచుండెను.

శౌనకాది మహామునులు సూతమహాముని నిట్లడిగిరో అదేవిధముగఁ బరీక్షిన్మహారాజు శుకమహర్షి నిట్లడిగెను:– "మునివరా! నారదుఁడు బ్రహ్మకుమారుఁడు గదా! ఆతఁ డేమైనఁ దెలిసికొనఁగోరి సేవించుచున్నాఁడా లేక కర్తవ్య బుద్ధితో నిష్కామసేవ చేయుచున్నాఁడా?"

అంత శుకమహర్షి యిట్లనెను:– "రాజా! నీవు దేనిని నిష్కామ మనుకొనుచున్నావు? ఇంద్రియ సాంసారిక కామనతో ...గములకొఱకై చేయునది వాస్తవముగ సకామ కర్మ. ...గవత్తత్త్వము నెఱుఁగుటకుఁ గేవలము భగవత్ప్రసన్నత ...ొఱకు చేయు కర్మ నిష్కామకర్మ యనఁబడును. నారదుఁడు కూడ మాయాపతియగు శ్రీహరి మర్మము నెఱుఁగవలెనను కోరికతోఁ జక్కని శీలముతోడను, వినయముతోడను వచ్చి, ఇంద్రియ సంయమము గావించి, విషయములను దొలఁగించి, జ్ఞానియును, దనకుఁ దండ్రియు నగు సరోజభవుని చరణ సన్నిధానమున శ్రద్ధాపూర్వకముగఁగూర్చుండి సేవించుచు, సాతని

సంతుష్టునిఁ గావించెను. తన తండ్రి తాను జేసిన సేవచే సంతుష్టుఁడగుటను గాంచి, యాతఁడు తండ్రిని బ్రశ్నింపఁగాఁ దామరసోద్భవుఁడు దశలక్షణములు గల శ్రీమద్భాగవతము నుపదేశించెను. వెనుక పరీక్షిత్తు శుకమహర్షి నడిగిన రమారమి నలుబది ప్రశ్నలకుఁ బ్రత్యుత్తర మిందుఁగలదు. ఈ దశలక్షణములను శ్రద్ధాభక్తులతో విని గ్రహించినచో మానవుఁడు నిస్సందేహుఁడు కాఁగలఁడు. నారదుఁడు తన తండ్రి వలన వినినదంతయు మా తండ్రి శోకసాగరమున మునిఁగి యున్నప్పు డుపదేశించెను. అదియంతయు నా తండ్రివలన నేను వింటిని. ఇప్పుడు నీవుకూడ చాల దాదాపుగా దానికి సరిపోయిన ప్రశ్నలనే యడిగితివి. వాటి కన్నిటికిని బ్రత్యుత్తరము నే నీ దశలక్షణయుక్తమగు శ్రీమద్భాగవతముద్వారా చెప్పెదను. కావున నీవు జాగ్రత్తగా వినుము."

సూతుఁడు మునులతో నిట్లనెను:- మునులారా! ఇట్లసి మా గురుదేవుఁడు దశలక్షణయుక్తమగు శ్రీమద్భాగవతము నారంభించెను.

ఛప్పయ.

వేదగర్భ! సును సఖీ శాస్త్రకో సార సునాఊఁ।
హూఁ వ్యాపక సర్వత్ర సర్వదా నహీఁ లఖాఊఁ॥
జాహి జాని జగ రచో మోహ హోవే నహిఁ కబహూ।
దేకే సద్ ఉపదేశ భయే అంతర్హిత హరిహూ॥
వీణావాదక దేవఋషి, సునీ పితా తేఁ భాగవతి।
తిన ఉపదేశే మమ జనక, తోహిఁ సునాఊఁ సో నృపతి॥

అర్థము.

"వేదగర్భా! నేను సర్వశాస్త్రముల సారమును జెప్పి దను వినుము. నేను సర్వవ్యాపకుఁడను. సర్వత్ర సర్వదా నుండువాఁడనయ్యుఁ గనఁబడను. నన్నుఁ దెలిసికొని సృష్టి నొనర్చినచో వానికి మోహ మెన్నటికినిఁ గలుగదు." అని హరి చెప్పి అంతర్హితుఁడయ్యెను.

బ్రహ్మకు శ్రీహరి చెప్పిన భాగవతమును బ్రహ్మ వలనఁ దన పుత్రుఁడగు వీణావాదకుఁడగు నారదుఁడు వినెను. ఆ నారదుఁడు నా తండ్రియగు వ్యాసమహర్షికిఁ జెప్పినాఁడు. నేను నా తండ్రివలన వినినదానిని నీకుఁ జెప్పుచున్నాను.



## దశలక్షణ భాగవతము

శ్లో॥ అత్ర సర్గో విసర్గశ్చ స్థానం పోషణ మూతయః,
మన్వంత రేశానుకథా నిరోధో ముక్తిరాశ్రయః॥

దశమస్య విశుద్ధ్యర్థం నవానామిహ లక్షణమ్,
వర్ణయంతి మహాత్మానః శ్రుతేనార్థేన చాంజసా॥

—శ్రీభాగ. ౨ స్కం. ౧౦ అ. ౧, ౨ శ్లో.

"వ. ......అమ్మహాపురాణంబు చతుశ్శ్లోక రూపం బును దశలక్షణంబును నై సంకుచితమార్గంబున నొప్పు నందు దశలక్షణంబు లెవ్వి యనిన సర్గంబును, విసర్గంబును, స్థానం

బును, పోషణంబును, నూతులును, మన్వంతరంబులును, నీశానుచరితంబులును, నిరోధంబును, ముక్తియు, నాశ్రయంబును ననం బది తెఱంగు లయ్యె దశమాశ్రయ విశుద్ధ్యర్థంబు దక్కిన తొమ్మిది లక్షణంబులుఁ జెప్పంబడె నని యెట్టివనిన''

—శ్రీమదాంధ్రభాగవతము.

ఛప్పయ.

జా మేఁ సర్గ, విసర్గ, స్థాన, పోషణ, ఊతీ సబ।
మన్వంతర, ఈశానుకథా, సును లక్షణ నృప అబ॥
హై నిరోధ పుని ముక్తి దశమ ఆశ్రయ బతలావేఁ।
దసమ తత్త్వకీ సిద్ధ హేతు నౌఊ కహలావేఁ॥
శ్రుతి తేఁ అరు బహు అర్థ తేఁ, సాకఛాత కో ఈ కహేఁ।
జాపై హరి కిరపా కరేఁ, భక్తి అహైతుకి తే లహేఁ॥

అర్థము.

దీనిలో సర్గము, విసర్గము, స్థానము, పోషణము, ఊతి, మన్వంతరము, ఈశానుకథ, నిరోధము, ముక్తి, ఇఁక బదియవది ఆశ్రయము. దశమతత్త్వసిద్ధికొఱకే మిగిలిన తొమ్మిది చెప్పఁబడినవి.

శ్రుతుల కనేకార్థములు కలవు. వాటిని సాకల్యముగఁ జెప్పగలవారు లేరు. ఎవ్వనిపై హరికృప గలదో, వానికే అహైతుక భక్తి లభించును.

---

ఏదైన విషయమును నిరూపించుటకుఁ బూర్వము విద్వాంసులు సంక్షేపముగ దానియొక్క భేదలక్షణములను

జెప్పి, తర్వాత వ్యాఖ్యానము చేయుదురు. పరీక్షిన్మహారాజు ఇదివఱలో రమారమి నలువది ప్రశ్నలడిగెను. శుకాచార్యుల వారు ఆప్రశ్నలను మఱచిపోలేదు. ఆప్రశ్నలకుఁ బ్రత్యుత్తర మిచ్చుట కుపక్రమించుచుండెను. పరీక్షిన్మహారాజడిగిన ప్రశ్నల కన్నిటికిని బ్రత్యుత్తరము శ్రీమద్భాగవతము మూలమునసే యీయఁగలఁడు. అందుకనియే మొట్టమొదట భాగవతోత్పత్తిని గుఱించియు, దాని మూలస్వరూపమును గుఱించియుఁ జెప్పెను. బీజము చిన్నదిగ నుండును. దానిలోనుండి అంకురము బయలుదేఱి పల్లవిత పుష్పితమై వృక్షరూపమును జెంది ఫలించినప్పుడు దానికి బీజవిస్తారమని పేరు. భగవంతుఁడు సృష్ట్యాదియందు లోకపితామహుఁడగు బ్రహ్మ కుపదేశించిన మూలభాగవతము యొక్క బీజ మైదుశ్లోకములలోనే కలదు. మూలమును జెప్పి, తర్వాత దాని పరంపరను జెప్పి, ఈ జ్ఞానము కేవలము పుక్కిటి పురాణము వినుటవలన సిద్ధించునది కాదు, పరంపరాగతమని వచించెను. సంప్రదాయపురస్సరమైనదనియు, దీనికి మూలపురుషుఁడు శ్రీమన్నారాయణుఁ డనెను. ఈవిధముగ శాస్త్రముయొక్క విషయ, ప్రయోజన, సంబంధ, అధికారములను గూర్చి చెప్పి లక్షణమును జెప్పుచున్నాఁడు.

శుకమహర్షి పరీక్షిన్నరేంద్రునితో నిట్లనుచున్నాఁడు:– "రాజా! నీప్రశ్న లన్నియుఁ బురాణసమ్మతములు. వీటి అన్నిటికిని బురాణములలో నిరూపణము కలదు."

మహారాజిట్లడిగెను:– "ప్రభూ! పురాణమని దేని నందురు? పురాణలక్షణ మేమి? పురాణములన్నియు నెన్ని?"

శుకుఁ డిట్లనెను:- "పురాతనములగు నాఖ్యానములు కలిగి, వేదములోని సంక్షిప్త వచనములకు వ్యాఖ్యానము చేయఁబడిన వాటిని బురాణము లందురు. పురాణము లసంఖ్యాములు; కాని యీసమయమునఁ బదునెనిమిది మహాపురాణములు, పదునెనిమిది ఉపపురాణములు, పదునెనిమిది ఔపపురాణములు మాత్రము ప్రసిద్ధములుగనున్నవి. అన్నిటిని నాతండ్రియగు వ్యాసభగవత్పాదులు సంగ్రహించెను. దశలక్షణములు కలది పురాణమనియు, పంచలక్షణములు కలది ఉపపురాణమనియుఁ జెప్పఁబడును. ఆ దశలక్షణము లివి:- సర్గము, విసర్గము, స్థానము, పోషణము, ఊతి, మన్వంతరము, ఈశానుచరితము, నిరోధము, ముక్తి; ఇఁకఁ బదియవది యాశ్రయము. ఆయాశ్రయమే ప్రధానము. దాని సిద్ధికొఱకు మిగిలిన తొమ్మిది లక్షణములు చెప్పఁబడినవి. ఎట్లనఁగా— ౧. తోడుపాలు తీసికొని గోవు దగ్గఱకుఁ బోవుటయు, ౨. దూడను విడిచి కుడిపించుటయు, ౩. చన్నులను గడిగి దానిని తోడుపాలతో సంయోగము కావించుటయును, ౪. పాలను బితుకుటయు, ౫. వానిని గాచుటయు, ౬. తోడువేసి పేరఁ బెట్టుటయు, ౭. పేరిన పెరుగును మథించుటకుఁ గవ్వము, కుదురు, త్రాడు చుట్టుటయు, ౮. పెరుగును గవ్వముతోఁ జిలుకుటయు, ౯. పైకి వచ్చిన నురుగుతోఁ గూడిన నవనీతకణముల నొక్కచోటకుఁ బ్రోవుచేయుటయు, ౧౦. ముద్దచేసి దానిని జేతితోఁ దీయుట. ఇచ్చట పాలుపితుకుట మొదలుకొని, వెన్నముద్ద తీయువఱకు చేయవలసిన పనియంతయు నవసరమే. కాని అన్నిటిలోఁ బ్రధానమైనది వెన్నముద్ద.

దానికొఱకే యివి యన్నియుఁ జేయఁబడినవి. అట్లే ఆశ్రయ తత్త్వసిద్ధికొఱకే సర్గవిసర్గాది వర్ణనము. దీనినే శ్రుతిభగవతి ఒక్కొక్కచోట వాక్యములచేతను, నొక్కొకయెడఁ దాత్పర్యముచేతను, నొక్కొక్క స్థలమున సాక్షాద్రూపమునను వర్ణింపఁబడినది."

పరీక్షిన్మహారా జిట్లనెను:- "ప్రభూ! నాప్రశ్న పురాణసంబంధమైనదని మీరంటిరి. మీరు నాకేపురాణమును వినిపించెదరు? అన్నిపురాణములను వినుటకు వ్యవధి లేదు కదా? నాకేడు దినములలోనే మృత్యువు కలదు గదా? ఏడు దినములలోఁ బూర్తియగునదియును, నాప్రశ్నలన్నిటికిని సాంగోపాంగముగఁ బ్రత్యుత్తరము లభించునదియు నగు పురాణమును నాకు వినిపింపవలయును."

అంత శుకదేవుఁ డిట్లనెను:- "రాజా! నేను శ్రీమద్భాగవత పురాణమును వినిపించెదను. దానిలో నీవడిగిన సమస్తప్రశ్నలకు సమాధానము లభింపఁ గలదు. అది పురాణములన్నిటికిని దిలకాయమానమైనది. దీనికి మించిన పురాణము లేదు. పురాణమునకుఁ జెప్పఁబడిన దశలక్షణములు దీనిలోఁ జెప్పఁబడినవి."

అంత మహారాజిట్లనెను:- "స్వామీ! మీరు చెప్పిన పురాణమున కుండవలసిన దశలక్షణములనుగూర్చి క్రమముగ సంక్షేపవ్యాఖ్యానమును వినఁగోరుచున్నాను. ముందుగా 'సర్గ' మని దేని నందురో చెప్పుము."

శుకభగవత్పాదు లిట్లనెను:- "నృపవర్యా! బ్రహ్మయొక్క అచింత్యశక్తి మూలప్రకృతి. కాలకర్మాధీనమున

దానియందుఁ గలుగు సంక్షోభ ముత్పన్నమగును. అప్పుడు దానిలోఁ గొంచెముగఁ క్రియ జరుగును. సత్త్వరజస్తమో గుణములు సమానముగ నుండిన దానిని ప్రకృతియందురు. ఆసమయమునఁ ప్రకృతి యేమియును జేయఁజాలదు. రెండు పాదముల నొక్కసారి యెత్తివేసిన నడువఁగలమా? ఒక పాదము ముందుకును, ఒక పాదము వెనుకకును ఇట్లు విషమతగ వేసిననే గమనము సాధ్యమగును. భార్యాభర్తలు, ఒకే వయస్సు, ఒకేరంగు, ఒకే రూపము ఇట్లొకే రకముగనుండిన వారికి సంతతి కలుగదు. ఇద్దరిలో నొకరు పెద్ద, ఒకరు చిన్న, ఏదో విధముగ విషమత యుండుటచేతనే వంశాభివృద్ధి కలుగఁ గలదు. సామ్యావస్థ నిశ్చేష్టమగుననియే భావము. విషమత లోనే కదలిక, వృద్ధిక్షయములు, తగాదాలు, కొట్లాటలు మొదలగునవి సంభవించు చుండును. మూలప్రకృతి వలన పృథివి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశ మను నీ పంచ భూతములును, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులను పంచ తన్మాత్రలును, వాక్పాణి, పాద, పాయు (లింగము), ఉపస్థ (గుదము) లను పంచకర్మేంద్రియములును, శ్రోత్ర(చెవులు), త్వక్ (చర్మము), చక్షు (కన్నులు), జిహ్వా (నాలుక), ఆఘ్రాణము (ముక్కు) లను పంచజ్ఞానేంద్రియములును, ఒక మనస్సును, మహదహంకారములు రెండును, మూఁడు తత్త్వములు నెప్పు డుద్భవించునో అప్పుడు దానిని సర్గమందురు.''

అంత మహారా జిట్లడిగెను:- ''అయితే స్వామీ! విసర్గ మనఁగా నేమి? ఇఁక నిప్పుడు విసర్గ లక్షణములఁ గూర్చి చెప్పుఁడు.''

అంత శుకమహాముని యిట్లనెను:- "విశేషరూపముగు సర్గముననే విసర్గమందురు. విరాట్పురుష సంబంధమున ననేకాకృతులవారిని, చిత్రవిచిత్ర కర్మలొనర్చు వారిని, నానాజాతులకుఁ జెందిన అసంఖ్యాక జీవుల నుత్పత్తి చేయుటకే విసర్గ మనిపేరు."

"స్థాన పరిభాష యేమి"టని పరీక్షిన్మహారాజడిగెను.

అంత శుకుఁ డిట్లనెను:- "రాజా! వస్తువులు పుట్టినను వాటిని కొన్ని హద్దులలో నుంచకున్నచో నవి వృథాయై పోఁగలవు. కావున నుత్పన్నమైన వస్తువులను హద్దులలో నుంచుటకును, వాటిని హద్దును దప్పనీయకుండుటకును 'స్థాన'మని పేరు. ఒకానొక యంత్ర మున్నదనుకొనుఁడు. దానికి తాళము త్రిప్పిన నడుచుచుండును; కాని దానిని హద్దులో నదుపులో నుంచకుండిన నది పోవుచునే యుండును. అది యెచ్చటికిఁ బోవునో, యేయనర్థము నొనర్చునో యెవ్వరికిని దెలియదు. దాని నదుపులో నుంచువాఁ డుండనంతవఱకు ఇష్టప్రాప్తి కలుగదు. కావున సృజింపఁబడిన పదార్థములను హద్దులలో నుంచుటచేతనే భగవంతుని ఉత్కర్ష ప్రకటమగును. అదియే స్థానము."

"పోషణ మనఁగా నేమి?" యని మహారాజడిగెను.

శ్రీశుకుఁ డిట్లనెను:- "రాజా! పోషణ మనఁగా వేరు కాదు. పోషణ మనఁగా భగవదనుగ్రహమే. భగవదనుగ్రహము లేనిది సాధనారంభములు గాదు, సాధనసిద్ధియుఁ

ప్రాప్తింపదు. కావున సృష్టికార్యము పోషణచేతనే వృద్ధి పొందుచున్నది. చెట్టును నాటి దానికేమియుఁ బాలన పోషణములు లేకున్నచో నది యెండిపోవును. అప్పుడది ఫలముల నీయఁజాలదు.''

అంతఁ బరీక్షిన్మహారాజిట్లనెను:- ''మన్వంతరమనఁగా నేమి? మన్వంతరములో భగవంతుఁ డేమిచేయును?''

ఇది విని శుకమహర్షి యిట్లనెను:- ''రాజా! ఎనిమిది జాములు కల రాత్రింబవళ్లకు దినమని పేరు. ముప్పదిదినము లొక మాసము. పండ్రెండునెల లొక వర్షము. మన సంవత్సరము దేవతలకొక దినము. ఇట్టిదినములు మూఁడువంద లఱువదియైన దేవతల కొక దివ్యసంవత్సరము. ఇట్టివి వేయి దివ్యవర్షములు కలియుగము. రెండువేలైన ద్వాపరయుగము. మూఁడువేలైనఁ త్రేతాయుగము. నాలుఁగువేలైన కృతయుగము. వీనిలో క్రమముగ రెండువందలు, నాలుగువందలు, ఆఱువందలు, ఎనిమిదివందలు సంవత్సరములు సంధి సంధ్యాంశలుగ నుండును. ఈ విధముగ పండ్రెండువేల దివ్యవర్షము లొక మహాయుగమనఁబడును. ఇట్టి మహాయుగములు వేయి గడచిన నది బ్రహ్మ కొక దినము. బ్రహ్మదినములోఁ బదునలుగురు మనువులు మారుదురు. ఒక్కొక్కమనువు డెబ్బది యొక్క మహాయుగములకంటెఁ గొంచె మధికముగనే యుండును. దానిని మన్వంతరమందురు. దీనియందు భగవంతుఁ డాఱురూపములు ధరించి యా మన్వంతరమును రక్షించును. మనువు, మనుపుత్రులు, ఇంద్రుఁడు, సప్తర్షులు, దేవగణము, మన్వంతరములోని విశేషావతారములు — ఇవన్నియు

భగవంతుని కళావతారములుగనో, అంశావతారములుగనో యుండును.''

మరలఁ బరీక్షిన్మహారాజిట్లనెను:- ''ప్రభూ! మన్వంతరార్థమును దెలిసికొంటిని. ఇప్పుడు 'ఊతి' లక్షణమును గూర్చి చెప్పుఁడు.''

శుకుఁ డిట్లనెను:- ''రాజా! నానాజీవులు నానా యోనులలో నేల జన్మించుచున్నవి? భగవంతుఁడా యోనులలో వాటిని బడవేసినాఁడని నీవనవచ్చును. అంతయు భగవత్ప్రేరణచేతనే జరుగుచున్న దనుట యథార్థమే. ఆతఁడొకనిని వేదజ్ఞుఁడగు బ్రాహ్మణునిగను, వేఱొకని శ్వపచునిఁగ నొనర్చును. ఒకదాని నేనుఁగుగను, వేఱొకదానిని సూకరముగ నొనర్చును. దీని కేదియో ఆధారముండవలయును; లేకున్నచో భగవంతునికి వైషమ్యదోషము కలుగును; కాని ఆతనికట్లు లేదు. ఆతనికి సమస్తజీవులందును సామ్యదృష్టియే కలదు. సమస్తజీవులు కర్మవాసనల కధీనులై నానాయోనులందు జన్మించుచుందురు. అదివఱకు సృష్టి లేదు కదా, సృష్ట్యాదియందు జీవులకుఁ గర్మవాసన లెచ్చటనుండి వచ్చినవని మీరడుగవచ్చును. సృష్టిలేనిది కర్మ లుండవు. కర్మలే లేనిది వాసన లుండఁజాలవు. దీనికిఁ బ్రత్యుత్తర మేమి యనఁగా సృష్టికి ఆది లేనేలేదు. ఈసృష్టికి పూర్వము సృష్టులు కలవు. అప్పటి కర్మలు జీవులను జుట్టుకొనియే యున్నవి. ఓషధ బీజములు చెట్టుక్రింద నేలపై బ్రాలును. అవి నశించినవని మనమనుకొందుము. కాని వర్షము కురియఁగానే అవి మొలకలెత్తి ఫలపుష్ప సమన్వితము లగును. అదే విధముగఁ

ప్రళయకాలమునఁ గారణరూపమున వాసనాబీజము లుండును. సృష్టిసమయము రాఁగానే జీవులు శరీరమును ధరించి తమ తమ వాసనానుసారముగ స్వతః కర్మలందుఁ బ్రవృత్తు లగు చుందురు. 'అసంఖ్యాకములగు జీవులు కలరు కదా! వీరిలోఁ గొంచెము గడబిడ జరుగదా? ఒకరి కర్మ లింకొకరికి కలియవా' యని నీవడుగవచ్చును. రాజా! ఆప్రభుని వ్యవస్థ తప్పనిది. వేయి గోవులను నిలుచుండఁబెట్టుము. అసంఖ్యాకములగు దూడల నొక్కసారిగ వదలిపెట్టుము. దూడలు తమ తల్లుల నవి గుర్తించి వాటివద్దనే అవి పాలుత్రాగును. ఎవరి కే కర్మలు కలవో వాని నవి పట్టుకొనును. ఈ కర్మ వాసనకే 'ఊతి' యని పేరు.''

మహారా జిట్లనెను:- ''స్వామీ! జీవులు కర్మవాసనా బద్ధులై సమస్తకార్యము లొనర్చుచున్నారనుట సత్యమే. ఇఁక మీరిప్పుడు 'ఈశానుకథా' మర్మమును గూర్చి చెప్పుఁడు.''

పరీక్షిత్తుని ప్రశ్నను విని శ్రీశుకుఁ డిట్లనెను:- ''రాజా! ఈశ్వరుని కథయు, నాతని కనుయాయులగు భక్తులయొక్కయుఁ బార్షదుల యొక్కయు కథకు 'ఈశానుకథ' అందురు. భగవంతుఁడు నానాయోనులందు కర్మాధీనుఁడు కాక, స్వేచ్ఛగా నవతరించును. వేనిని వినుటచేతనే భవబంధములు పటాపంచలగునో, అట్టి వివిధములగు నలౌకిక దివ్యలీలల నొనర్చును. భగవదవతారములలోనివియు, నాతనికి ప్రియమును, చిత్తాకర్షకములగు కథలకే ఈశానుకథలని పేరు. ఆతని పార్షదులయొక్కయు, భక్తులయొక్కయు సులలిత కథలుకూడ

భగవత్కథలతో సమానముగనే యుండును. వానిలో నచ్చ టచ్చట భగవత్కృపా వర్ణనముండును. ఆభక్తులయొక్క కథలుకూడ యితర నానావిధములగు నుపాఖ్యానములు, ఇతిహాసములచే వృద్ధిని జెందును. భగవంతునియొక్కయు, భక్తులయొక్క సంసర్గముచేఁ గుటిల అభక్తులుకూడ వర్ణ నీయులు, స్మరణీయు లగుదురు. పరమభాగవతుఁడగు పవన కుమారుఁడు జగజ్జననియగు జానకి నన్వేషింపఁ బోయెను. వెదుకుచు వెదుకుచు నాతఁడు క్రూరకర్ముఁడును రాక్షసేశ్వ రుఁడు నగు రావణాసురుని యంతఃపురమునఁ బ్రవేశించెను. రాత్రి సమయము. రావణుఁడు వేలకొలఁది వనితలతోఁ నిద్రించుచుండెను. అచ్చట వివిధములగు సారాయములు, వివిధ జంతువుల మాంసము ఉంచఁబడి యుండెను. ఆదికవి యగు వాల్మీకి మహర్షి ఆ మాంస సారాయములనుగూర్చి యెంతో విశదముగ వర్ణించెను. ఏసారాయమును స్పర్శించినఁ బాపమొదవునో, పొరపాటునఁ దెలియక దేనిని బ్రాహ్మణుఁడు త్రావిన వాని విప్రత్వము నశించునో అట్టి నిషిద్ధవస్తు వర్ణనము కూడ పరమభాగవతుఁడగు హనుమంతుని సంసర్గముచేఁ బుణ్యప్రదమైనది. అసంఖ్యాకులగు భక్తులు సుందరకాండ మును నిత్యపారాయణము సేయు సమయమున యీయమేధ్య వస్తువులనుగూర్చి ధర్మమను భావముతో శ్రద్ధాభక్తులతోఁ బారాయణ మొనర్చుచుందురు. ఈవిధముగ భగవంతుని యొక్కయు భక్తుల సంబంధమునఁ బొడగిన సమస్త కథల యొక్క సమావేశ మీ ఈశానుకథకు అంతర్గతమై యున్నది.''

అంత మహారాజిట్లడిగెను:- "స్వామీ! నిరోధలక్షణ మేమి?"

శుకుఁడిట్లనెను:- "రాజా! భగవంతుఁడు తన శక్తుల నన్నిటి నుపసంహరించి, తనలో లీనము చేసికొన్నప్పుడు ఆతఁడు యోగనిద్రను గ్రహించును. దానికి నిరోధమని పేరు. వ్యాపారి తాను పేర్చిన తన అమ్మకపు సామానంతను ప్రోవు చేసి దుకాణములోఁబెట్టి వాటిని బంధించి తాళము వేసినట్లు, ఈ మహాదుకాణదారుఁడగు నారాయణుఁడుకూడ జీవుల నంద అను దనలోనికిలాగుకొని, బంధించి మెదలకుండుఁడని చెప్పను. దీనిని ప్రళయమనుఁడు, సంహారమనుఁడు, ఏదైన ననవచ్చును. అణువదనిన నేమి? మూఁడిరువదులనిన నేమి? రెండు నొకటే."

రాజు మరల నిట్లడిగెను:- "స్వామీ! ముక్తిలక్షణ మును గూర్చియు తెలవిండు."

శుకమహర్షి నవ్వుచు నిట్లనెను:-"రాజా! ముక్తిలక్షణ మేమనియా? నీ బందిఖానాలో బంధింపఁబడిన యపరాధి వదలఁబడినాఁడనుకొనుఁడు. వాఁడు ముక్తుఁడైనాఁడు. జీవులు అజ్ఞానముచేతనే బంధింపఁబడిరి. మమతయే బంధనము. మోహమే జీవుని బంధించినది. మోహము పోఁగానే ముక్తి లభించును. అజ్ఞానజన్యమగు ననాత్మభావమును వీడి, ఆత్మ స్వరూపమందు నిలుచుటయే ముక్తి."

రాజిట్లనెను:- "ముక్తి కలిగినప్పుడు ఆశ్రయ మేమున్నది?"

శుకుఁడు వెంటనే యిట్లనెను:- ఆశ్రయము లేకున్న నెవఁడైన నుండుటెట్లు? ముక్తికూడ ఒకానొకని ఆశ్రయించి

నది. లోకమంతయు నాశ్రయమునే వెదుకుచుండును. లోక ములో నివసింపవలెననిన నే యాశ్రయమున నుండవలెను? లోకమంతయుఁ బరస్పరాశ్రయముచే నాధారపడియున్నది. మానవుఁడు తనకంటె గొప్పవాని యాశ్రయము నాశించును. సేవకుఁడు స్వామి నాశ్రయించుట కుత్సహించును. పండితుఁడు రాజాశ్రయమున నుండఁ బ్రయత్నించును. స్త్రీ తన పతియే తన కాశ్రయ మనుకొనును. సమస్త చరాచరప్రపంచము ఎవనివలనఁ బుట్టుచున్నదో, పెరుగుచున్నదో, లయమగు చున్నదో, అట్టి పరబ్రహ్మయే యీ విశ్వమున కంతటికి నాశ్రయభూతుఁడు. అతనినే శాస్త్రములు పరమాత్మ యని వర్ణించుచున్నవి.

ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మికముల నెవఁ డెఱుఁగు చున్నాఁడో అట్టి ఆత్మను సమస్తమునకు ఆశ్రయమని తెలియ వలెను.''

అంత రాజిట్లనెను:- ''స్వామీ! ఈ ఆధిభౌతిక, ఆధి దైవిక ఆధ్యాత్మికములన నేమి?''

శుకదేవుఁడిట్లనెను:- ''రాజా! నేను పుష్పమును జూచు చున్నాను. పుష్పము అధిభూతపదార్థము. చూచునది దేని చేత? కన్నులచేత. కన్నులకుఁ జూచు శక్తి యెచ్చటనుండి వచ్చినది? చక్షువులకు అధిష్ఠానదేవతయగు సూర్యునినుండి. కన్నులు సూర్యుఁడు లేక చూడఁజాలవు. కన్నులాతఁడే. చీఁకటిలో సూర్యప్రకాశముండదు కావున నవి చూడఁజాలవు. కావున సూర్యుఁ డధిదేవత. చాలమంది కన్నులు చూచుట కందముగనుండును. సూర్యుఁడుకూడ ఉండును. కాని చూడఁ

జాలవు. సూర్యునకును జక్షుగోళములకును ప్రకాశ విభాగ మును గావించు చక్షుత్వము వానిలో లేవు. ఆ చక్షురాది ఇంద్రియములకు సాక్షియగు జీవుఁడే అధ్యాత్మపురుషుఁడు.

ఆధ్యాత్మికపురుషుఁడగు జీవుఁడును, ఇంద్రియాధిష్ఠాతృ దేవుఁడగు సూర్యాదిదేవతలును, ఈ సమస్తమును ఆధిభౌతిక దృశ్యపదార్థములు. వీనిలో నొక్కటి లేకున్నను మనము మఱియొక వస్తువును దెలిసికొనఁజాలము. నేను పూలను జూచునది కన్నులు, జీవాత్మనిద్వారా. పూలు లేకున్న యెడల నేత్రాధిదేవతయు, జీవుఁడుండినను జూడఁజాలము. పూలు ఉండియుఁ, గన్నులుండియు, జీవుఁడు లేకున్న నేమి చూడఁగలము? ఈ మూఁడింటికి పరస్పర మన్యోన్య సంబం ధము కలదు. ఈ మూఁడింట్టికి సాక్షి యెవఁడో, ఈ మూఁటి నెవఁడు తెలిసికొనుచున్నాఁడో ఆతఁడే ఆత్మ. ఆతనినే పర మాత్మ యందుము. ఆతఁడే అన్నిటికిని అనన్యాశ్రయుఁడు. ఆతఁ డన్నిటికి నాశ్రయుఁడైనప్పటికిని ఆతఁడు దేనికి నాశ్ర యుఁడు కాఁడు. ఆతఁడు విభుఁడు. సర్వాంతర్యామి. పరిపూ ర్ణుఁడు. నిత్యుఁడు. శుద్ధుడు. కార్యకారణరహితుఁడు. సమస్త శాస్త్రములకు లక్ష్యమతఁడే. పైనఁజెప్పిన సర్గ, విసర్గ స్థానాదు లగు తొమ్మిదియు నీ దశమమగు ఆశ్రయసిద్ధి కొఱకే. ఆ దశమ మగు నాశ్రయము ఈ భాగవతములో దశమస్కంధ ములో వర్ణింపఁబడిన శ్రీకృష్ణుఁడే. మిగిలిన స్కంధము లన్నియు నీ దశమముయొక్క పుష్టికొఱకే. ఇది దానికి భూమిక; ఉపక్రమము."

శుకుఁ డిట్లనెను:- "రాజా! నేను శ్రీమద్భాగవతాది సమస్తపురాణములకు గల దశలక్షణములను నీకు సంక్షేపముగ వర్ణించితిని. ఇఁక నీవేమి అడుగఁదలఁచితివి?"

ఇది విని పరీక్షిన్మహారాజిట్లనెను:- "బ్రహ్మణ్యమూర్తీ! నేను దశలక్షణములను గ్రహించితిని. మీరు దీనికి విస్తారము గావించెదరుకదా! విరాట్పురుషుఁ డీ బ్రహ్మాండమును భేదించుకొని యెట్లుద్భవించెనో ఇఁకఁ జెప్పవలెను."

ఇది విని శ్రీ శుకమహర్షి కొంచెముసేపు శాంతముగ మెదలకుండి, రాజున కేవిధముగ నీ గహనవిషయమును నుపాఖ్యానరూపమున సరళాతిసరళముగ వివరింపఁగలనా యని యాలోచించుచుండెను.

సూతుఁడు శౌనకాదిమునులతో నిట్లనెను:- "మునులారా! నా గురుదేవుఁ డెట్టి ఆలంకారికభాషలో నీ గహనవిషయమును జెప్పెనో అట్లే నేనుగూడ నీ సమ్ముఖమున జెప్పెదను. నీవు దీనిని ధైర్యమువహించి శ్రవణము చేయుము."

ఛప్పయ.

ఆశ్రయ సబకే వహీ అఖిలపతి అలఖ అగోచర।
రచనా కూఁ విధి బనేఁ, భరన కూఁ హూఁ విశ్వంభర॥
సృష్టి సమేఁటే సభీ తభీ హరి శివ కహలాఁవేఁ।
యోఁ వే వ్యాపక బ్రహ్మ వివిధ విధి రూప బనావేఁ॥
భౌతిక దైవిక ఆత్మిక, తీనోఁ కూఁ నియమన కరేఁ।
బాలకవత్ క్రీడా కరేఁ, రచైఁ తాహి పోసేఁ హరేఁ॥

అర్థము.

అఖిలపతియు, నిలఖుఁడును, అగోచరుఁడున ఆశ్రయుఁడును. ఈతఁడు సృష్టించుటకై బ్రహ్మయు, పోషణకు విష్ణువుగను, సృష్టి నుపసంహరించునపుఁడు శివుఁడని పిలువఁబడును. ఆ వ్యాపకబ్రహ్మయే వివిధరూపములను ధరించును.

భౌతిక, దైవిక, ఆత్మికములను మూఁడింటిని నియమించుచు బాలుఁడెట్లు తానే బొమ్మరిండ్లను రచించి, పోషించి చివరకు చెఱిపివేయునో అట్లే అతఁడు క్రీడించును.



# విరాట్ బ్రహ్మాండవర్ణనము

౯౭

శ్లో॥ పురుషోఽండం వినిర్భిద్య యదాఽసౌ స వినిర్గతః।
ఆత్మనోఽయన మన్విచ్ఛ న్నపోఽస్రాక్షీచ్ఛుచిః శుచీః॥
తాస్వవాత్సీత్ స్వసృష్టాసు సహస్రపరివత్సరాన్।
తేన నారాయణో నామ యదాపః పురుషోద్భవాః॥

— శ్రీభాగ. ౨ స్కం. ౧౦ అ. ౧౦, ౧౧ శ్లో.

వ. ''అమ్మహాత్ముండు లీలార్థంబై జగత్సర్జనంబు సేయు తలంపున బ్రహ్మాండంబు నిర్భేదించి తనకు సుఖస్థానంబు నపేక్షించి మొదల శుద్ధంబులగు జలంబుల సృజియించె. స్వతః పరిశుద్ధుండు గావున స్వసృష్టంబై యేకార్ణవాకారం

బైన జలరాశియందు శయనంబు సేయుటంజేసి 'శ్లో॥ ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపోవై నరసూనవః। తాయద స్యాయనం పూర్వం తేన నారాయణః స్మృత' యను ప్రమాణము చొప్పున నారాయణ శబ్ద వాచ్యుండు''

—శ్రీమదాంధ్రభాగవతము.

ఛప్పయ.

కర్త్యో సృష్టి సంకల్ప రచ్యో జల బసే ఉదర మహాఁ।
ఇంద్రియ, మన, తనుశక్తి రచీ పుని ప్రాణ ఉదిత తహాఁ॥
భూఖ ప్యాస జబ లగీ కర్ణ గోలక సబ నికసే।
అంతఃకరణ ప్రకాశ అహం, మన, చిత ధీ వికసే॥
కర్తా భోక్తా హరి నహీఁ, సదా రహైఁ నిరలేప హైఁ।
ధరేఁ రూప తోఊ వివిధ, ఉదాసీన రచి కేఁ రహైఁ॥

అర్థము.

సృష్టి సంకల్ప మొనర్చి జలమును రచించి దానిలో నుండి, ఉదరమునుండి ఇంద్రియములు, మనస్సు, తనుశక్తిని రచించెను. అందుండి ప్రాణపంచక ముద్భవించెను. ఆఁకలి దప్పులు కలుగఁగానే కర్ణగోళకములన్నియు వెలువడెను. అంతఃకరణ ప్రకాశమున మనోబుద్ధి చిత్తాహంకారము లుద్భవించెను.

హరి కర్తయును గాఁడు, భోక్తయును గాఁడు. ఆతఁడు సదా నిర్లేపుఁడుగా నున్నాఁడు. ఆతఁడే వివిధరూపములను ధరించి, సమస్తమును సృష్టించి ఉదాసీనుఁడుగా నుండును.



పిండములో నేమి కలదో బ్రహ్మాండములో నదియే కలదని శాస్త్రసిద్ధాంతము. ఒక చిన్న చిత్రములోఁ జేతులు, కాళ్లు, కన్నులు, చెవులు, ముక్కు ఇవన్నియు నుండును. దానిని యంత్ర సహాయమునఁ జిత్రకారుఁడు తనకౌశలముచేఁ బెద్దదిగాఁ జేసినప్పుడు దానిలో రెండు కన్నులకు బదులుగాఁ బదిచెవులుండవు. ఒక్క ముక్కుకు ఐదుముక్కు లేర్పడవు. ఆసూక్ష్మ చిహ్నములే పెద్దవిగ గోచరించును. అదేవిధముగ నీదేహరూపమగు పిండములో నేవస్తువులు కలవో బ్రహ్మాండములో నవియే కలవు. భేదమేమియనఁగా దేహమతి సూక్ష్మమైన వ్యష్టిరూపము, బ్రహ్మాండము సమష్టిరూపము. పిండములో సృష్టి స్థితి లయములెట్లు ప్రతిక్షణముండునో అదే విధముగ బ్రహ్మాండములోఁగూడ నుండును. కావున ముందుగాఁ దన సంగతి తెలిసికొనవలెను.

కొందఱు జ్ఞానముకొఱకు అటునిటుఁ దిరుగుచుందురు. దేవతలారా! బయట జ్ఞానమెచ్చటనున్నది? అది మీలోననే కలదు. దానిని దెలిసికొనుఁడు. చాలమంది ఊరకపుస్తకములు చదువుటకు వ్యగ్రులై యుందురు. పాఠకులారా! మీకీ నిర్జీవ పుస్తకముల వెంటఁబడనేల? ఈ పిండబ్రహ్మాండములే గొప్ప గ్రంథములు. దీనిలో జ్ఞానమంతయు నిమిడియున్నది. దీని పుటలన్నియుఁ దెఱువఁబడియున్నవి. వీనిని మీరేల పఠింపరు? కళ్ళద్దములు (సులోచనములు) లేకయే వీటిని జదువవచ్చును. అజ్ఞానరూపమగు కళ్ళద్దములను దీసివేయుఁడు. జ్ఞానభాండారమును వీడి. మహాసాగరమునువీడి, క్షుద్రములగు గుంటల నేల వెదకుకొనవలయును? కొందఱు "మాకు జ్వరము

వచ్చిన దందురు ” జ్వర మెచ్చటనుండి వచ్చినదయ్యా! అయోధ్యా, కాశీ, కాంచీనుండి పరుగెత్తుకొని నీ శరీరములోఁ బ్రవేశించినదా? గొప్పగొప్పచికిత్సకులకుఁ జూపించుచుందురు. వా రణువీక్షణ యంత్రముద్వారా దానిలోని జంతువులను వీక్షింతురు. ఎంతటి అజ్ఞానము! ఎంతటి భ్రమ! అజ్ఞానులగు నో సోదరులారా! జ్వరమును మీరే సృజించుకొంటిరి. అది యెక్కడినుండియు రాలేదు. ఇక్కడనే పుట్టినది. దానికి జనకుఁడవు నీవే. పుట్టించియుఁ బుత్రుని గనుఁగొనలేకున్నావు. మూర్ఖతకు మితిలేదు.

'మాకు సృష్టి రహస్యమును జెప్పుఁ'డని అందఱు నడుగుచుందురు. ఏమి చెప్పుదును బూడిద? రోజున కింత మంది పిల్లలు పుట్టుచున్నారు? బహుశః మీరుకూడ కని యుండవచ్చును. ఒకవేళ కనకున్నను జూచియుండవచ్చును. పెండ్లి కాకున్నను, పెండ్లికి పోయియుండవచ్చును. బుద్ధిమంతుఁ డింగితమున గ్రహింపవచ్చును. చిందరవందరమై చంచలమైన చిత్తవృత్తిని సూక్ష్మముగ నొనర్చి యీ రహస్యమును దెలిసికొనుము. దర్శనశాస్త్రము దర్శించియే కనుఁగొనుమను చున్నది. ఈ విధముగ బ్రపంచమును దర్శింపుము. ఈ విధముగ బుద్ధితో విచారింపుము. కాని యీ సాంసారిక విషయాసక్తులగువారి బుద్ధి, యీ యనిత్య, క్షణిక, సాంసారిక భోగ్య వాసనలలోఁ దగుల్కొని, యశుద్ధమై, యెదుటనున్న పదార్థములనే చూడఁజాలకున్నది. నిరంతరము సమీపమున నున్న వాటినే గుర్తింపఁజాలకున్నది. అది యీ మాంసాస్థి వసా రక్త మల మూత్ర విష్టాదులతో నిండిన మాంసపిండమును

గూర్చియే యోచించుచున్నారు. నిర్జీవమగు మెఱుగుమట్టిని, లేక కాగితపుముక్కలందు నిమగ్నులై యుందురు. ఈ క్షుద్ర సౌందర్యమే సర్వస్వమనుకొని దాని ప్రాప్తికొఱకే వ్యగ్రులై యుందురు.

మానవుఁడు కొంచెము సుస్థిరచిత్తముతో నాలోచించు నెడల, మనమెంత మోహములోఁ బడినదియుఁ దెలియఁ గలదు. స్త్రీ పురుషుని బాహ్యసౌందర్యమును స్మరించి వ్యాకులపడు నెడలను, పురుషుఁడు స్త్రీ సమస్తసుఖముల కాట పట్టుని గ్రహించి దాని రూప లావణ్యముల కాసక్తిని జెంది యంధుఁడై యున్నప్పుడును వాని వాస్తవిక రూపమును దెలిసి కొను నెడలఁ గన్నులు తెఱపిడిపడును. ఏ దేహమందు రమించి సుఖపడఁదలఁచుచున్నావో, దానిమీఁది వస్త్రము లూడ్చి, పై చర్మమును దీసి నిలువఁబెట్టినచో బ్రదికియుండఁగానే కాకులు, గ్రద్దలు ముక్కులఁ బొడిచి తినును. ఇట్టిదానికొఱకై యీ నిష్ఠుర కవు లెన్నియుపమానములు, ఎన్ని విశేషణము లను జెప్పి వర్ణించుచుందురు!

సృష్టిజిజ్ఞాసులారా! మీలోఁ గల సృష్టిదృశ్యమును జూడుఁడు. పిండజ్ఞానముచే బ్రహ్మాండజ్ఞానమును బొందుము. అప్పుడే నీవు యథార్థమగు తత్త్వవేత్తవు కాఁగలవు. ప్రకృతి నుండి మహత్తత్త్వము, మహత్తత్త్వమునుండి అహంకా రము, అహంకారమునుండి సాత్త్వీక, రాజస, తామసము లను మూఁడుభేదములు, వానినుండి ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి మొదలగునవి పుట్టుటనుగూర్చి ఊరక వల్లించిన నేమియు ప్రయోజనము లేదు. అది వాగ్విలాసము

మాత్రమే కాఁగలదు. సృష్టిరహస్యమును దెలిసికొనుటయే పరమార్థపథమునకు మొదటి మెట్టు. సృష్టిరచనా రహస్యమును దెలిసికొంటిరా ఎప్పటికైన సృష్టికర్తయొక్క పరిచయము కూడ లభింపఁగలదు. ఏలననఁగా బురుషునియొక్క యథార్థపరిచయ మాతని కళయే. కళయందే కళాకారుని హృదయ మంతర్భూతమై యుండును. ఈ సృష్టి యంతయు సర్వేశ్వరుని సర్వోత్కృష్టమగు క్రీడాకళయే. దీని నెఱిఁగియే పరీక్షిన్మహారాజు శ్రీశుకు నిట్లడిగెను:- "ప్రభూ! విరాట్పురుషుఁ డీవిచిత్ర బ్రహ్మాండ వస్తురచన మేవిధముగ నొనర్చెనో, ఆ విషయమును నాకుఁ జెప్పుఁడు."

అంత శ్రీశుకుఁ డిట్లనెను:- "రాజా! ఇది చాల రహస్యమయమగు విషయము. అయినను నేనీ కథాప్రసంగమందు దాని నత్యంత సంక్షేపముగ రూపకముగఁ జెప్పెదను. బ్రహ్మాండరచనా విషయములోఁ జెప్పినదియే పిండములోఁ గూడ కలదని తెలిసికొనవలెను. ఏలననఁగా సమష్టిపురుషుని పిండమునే బ్రహ్మాండమని చెప్పఁబడుచున్నది. వ్యష్టిపిండము పిండమనుపేరఁ బ్రసిద్ధమైనది.

వినుము. ఆ పురాణపురుషుఁడు నిద్రించెను. నిద్రపోవుట యేమిటి? స్వస్థుఁడై కూర్చుండెను. ఇచ్ఛారహితుఁడయ్యెను. అనఁగా సంకల్పము చేయలేదు. చేయలేదనుటయు సరికాదు. కాని పని జరుగుట కట్లనవలయును. భగవంతుఁడు తనలోఁ దానే రమించెను. అంత నాతనికి తా నొక్కఁ డనేకముగఁ గావలెనను బుద్ధి పుట్టెను. ఎందుకు పుట్టినది? ఇప్పుడు నీ వీ గడబిడలోఁ బడవలదు. ప్రతి మాటకు 'ఎందు'కని అడుగ

వలదు. 'ఎందుకు' అనుదానికి అంతముండవలయును. లేకున్న బండి ముందుకుసాగదు. ఇంతవఱకు ఆతని వీర్య (పరాక్రమ) మంతయు నొక గోళాకారమగు నండములో నేకత్రితమై పేరు కొనినది. సంకల్పముచేఁ గామ ముద్భవించినది. కామము సంకల్పముయొక్క పుత్రుఁడు. సంకల్పము లేక కామము కలుగనే కలుగదు. ఆ ప్రభువు శుద్ధసంకల్పుఁడు, సత్యకాముఁడు. కావున నాతని వీర్యము శుద్ధ సంకల్పముచే ద్రవీభూతమయ్యెను. కావున శుద్ధతీర్థరూపమగు జలము సృష్టియయ్యెను. ఆతని సంకల్పముచే నుత్పన్నమైన కామమే ఆతని వీర్యమందు జీవనశక్తి సంచార మొనర్చెను. అందువలన జలములకు ఇంకొక పేరు నారములు. నారముల సహాయముననే కడుపులో నున్న బిడ్డకు ఆహారము లభించును. తాను సృజించిన నీరములందే తాను ప్రవేశించి సహస్రవత్సరములవఱకు నివసించెను. ఇచ్చట సహస్రవర్షము లనునది పెక్కులనుట కుపలక్షణము మాత్రమే. అనఁగాఁ జాలదినము లందు నివసించెను. ప్రవేశింపఁగానే ఆ ద్రవము ద్రవ్యమయ్యెను. ద్రవ్యము కాఁగానే దానిలోఁ గ్రియాసంచారము కలిగెను. ఇట్లు చాలకాలము గడచినప్పటికిని దానికి లెక్క యింతని లేదు. ఆతఁడు దానిలోఁ బ్రవేశింపఁగానే నేఁటికొక దినమైనది, నెలమైనది, రెండు నెలలైనవని యిట్లు లెక్కకూడ ప్రారంభమయ్యెను అంత నది తగ్గుట, హెచ్చుటయు, నెచ్చటినుండి యేమి బయలుదేఱునదియు, నేయంగము మొదట పుట్టవలసినదియు స్వభావముచేతనే ద్రవ్యము తోడనే కలుగును. ఏలననఁగా నది చైతన్యమగుటచే జీవనశక్తియు నుండవలయును. కావున ద్రవ్య,

కర్మ, కాల, స్వభావ, జీవస్థితి ఇవన్నియు నాతని సత్తావలననే. ఈతని సత్తా లేక వీనికి అస్తిత్వమే లేదు.

మొదట నాతఁడొక్కఁడే ఒక్కఁడనేకము కావలెనను కోరిక ఆతనికి కలిగెను. పురుషుఁడొంటరిగాఁ దాను సృష్టి చేయవలెనని మనస్సులో నెంతగా ననుకొన్నను, ప్రత్యక్ష క్రియయందు మాయ నాశ్రయింపక నొక్కఁడనేకము కాలేఁడు. అందువలన నాతఁడు మాయనాశ్రయించెను. "ఈ భూతిసీమాయ తనంతట తా నెచ్చటనుండి యూడిపడిన"దని మీరడుగవచ్చును. దీని కేమి ప్రత్యుత్తర మీయవలయునో నాకుఁ దోఁచుటలేదు. అది ఆదర్గంబలోనే, యెచ్చటనో దాగియున్నదనియు, సంయోగవశమున సమావేశము కలిగినదని మాత్రము భావించుము. ఆ పురాణపురుషుఁడీ స్త్రీరూపమును జెందినదానిని దనకార్యమునకు సహకారిణిగా నొనర్చుకొనెను. ఆతఁడు సువర్ణ సదృశమును ప్రభాకరమగు తన వీర్యమును స్థూల, సూక్ష్మ, అతిసూక్ష్మముగను, ద్రవ్య, దేవతా, జీవులుగను, ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మికములుగ నిట్లు మూఁడు భాగములుగ నొనర్చెను. అనఁగా నావీర్యముచే భౌతిక దేహము, ఇంద్రియగోళకాదులయ్యెను. ఆతఁడే వానిలో వాని కధిష్ఠాతృదేవతలయ్యెను. అతని వీర్యము చేతనే జీవనసంచారము చేయు జీవుఁడయ్యెను. ఎట్లయ్యెనో అదికూడ వినుము. ఈశరీరములో జీవనమునకు ముఖ్యశక్తి యేది? సూత్రాత్మ. అనఁగా ప్రధాన ప్రాణము. ప్రాణము లుండుటచేతనే ప్రాణులు జీవితులై యున్నారని చెప్పఁబడును. కావున శరీరమునకుఁ బ్రాణములే

ముఖ్యములు. ప్రాణములు లేకున్న నే యింద్రియమును దన కార్యమును దానొనర్పలేదు. నిష్ప్రాణశరీరములోని యింద్రియములన్నియు శిథిలములై పోవును. ఆప్రాణమెట్లు పుట్టినది? విరాట్పురుషుఁడు ప్రయత్నింపఁగా నాతని దేహాంతర్వర్తియగు నాకాశమునుండి యింద్రియములకు బలము నొసంగు శక్తి యుత్పన్నమయ్యెను. దానిని వీర్యసారమగు ఓజస్సందురు. ఆ శక్తి మనస్సులోఁ బ్రవేశించినప్పుడు ఆ బలమునకు 'సహ' యను పేరు కల్గును. 'సహ' వలననే సాహసము కలుగును. ఆశక్తియే శరీరమందు సంచారముచేసి కార్యమొనర్పు నప్పుడు దానికి శారీరక బలమని పేరు. ఈవిధముగ మూఁడు రకముల బలములు కలవు. ఆకాశమునకెట్లు రూపము లేదో బలమునకుఁగూడ అట్లే రూపము లేదు. ఆ ఓజస్సు సాహస, పరాక్రమముల ద్వారా ప్రకటము కాఁగలదు. సేనయంతయు సేనాపతి యధీనమైనట్లును, రాణివాసమునకు మిగిలిన తేనెటీగ లన్నియు నధీనమైనట్లును, రాజునకు సేవకు లధీనమైనట్లును, సమస్తేంద్రియములును, మనస్సు మొదలగున వన్నియు ముఖ్యమగుఁ బ్రాణమున కధీనములు. రాజు పోయిన నవియుఁ బోవును. రాజుండిన నవియు నుండును.

వీర్యము గట్టిపడఁగాఁ గఠినమగు బుద్బుదములో ముఖ్యప్రాణశక్తి సంచారము చేయఁగా దానిలోఁ దనంతటఁ దాను బ్రవేశించిన విరాట్స్వరూపమునకుఁ బ్రాణముల కారణమున నాఁకలిదప్పులు కలిగెను; ఏలననఁగాఁ బ్రాణసంచారము లేక ఆఁకలిదప్పులు కలుగవు. ఆవశ్యకతయే ఆవిష్కారమునకు జనని యనుట నిజము. కావున నా శరీరమందొక

ఛిద్రము కలిగెను. అన్నిటికంటె నదియే ముందుగ నుత్పన్న మయ్యెను. ముఖ్యమగుటచే దానికి ముఖమను నామము కలిగెను. ఆ ముఖములోఁ గొండనాలుక పుట్టెను. రసనేంద్రియ ముల కది యునికిపట్టయ్యెను. ఇఁక సృష్టివృద్ధి కాఁజొచ్చెను. రసనేంద్రియమునకు ఉనికిపట్టేర్పడఁగనే రసనేంద్రియము వచ్చెను. వట్టి యింటిలో వట్టిచేతి నూఁపుటచే నెన్ని దినములు సాగును? దాని కుపయోగించు సామానుకూడ కావలెను. కావున రసనోపభోగమునకుఁ బులుపు, తీపి, కారము మొదలగు నానారకములగు రుచులు గల పదార్థముల సృష్టి యయ్యెను. ఆ నారములద్వారా విరాట్టు వాని నుపభోగించుచుండెను. ఏలననఁగా నేపదార్థమైన నీవు లేక పుట్టదు. హత్యకు ముఖ్యజడ మీ ముఖమే. దీనిలోఁ గూర్చుండి సదయ్య మీ రసనేంద్రియమే. రసన రసముల నాస్వాదింపకున్నచో నే క్రియయు నుండదు. మానవుఁడు నిశ్చేష్టుఁడై యుండును. రెండుపిడికెళ్ల అన్నము కడుపులోఁ బడకపోయెనా అన్నియు నుత్పాతములే. ఇప్పటికి నో రేర్పడినది. ఆహార పానీయములు కొనుచుండెను. ఇప్పుడు వస్తువుల నడుగు కోర్కెయు నావిరాట్స్వరూపమునకుఁ గలిగెను. సత్యసంకల్పుఁడగు నా భూమాపురుషుని ముఖమందు అగ్నిదేవుని సహాయముచే వాగింద్రియ ముద్భవించెను. వీటి అన్నిటికిని మూఁడు విషయములుండును. ఒకటి అధిష్ఠాతృదేవతయు, రెండవది ఇంద్రియమును, మూఁడవది విషయము. తాలువునకు ఆకాశము దేవత. ఇంద్రియము రసనము. తినుట, త్రాగుట దాని విషయము. ఇదేవిధముగ నోటి లోనగ్ని దేవత కలదు. ఇంద్రి

యము వాక్కు. మాటలాడుట, పలుకుట ఆ యింద్రియము నకు విషయము.

ఇన్నాళ్లనుండి విరాట్టు జలములోనే మునిగియుండెను. ప్రాణసంచారము లేనంతవఱ కేమియును లేదు. ప్రాణ సంచారమై, తినుట, త్రాగుట మొదలిడఁగానే, ప్రాణ సంచారము తీవ్రముగ జరుగుచుండఁగానే ఆతనికి శ్వాసింప నిచ్ఛ కలిగెను. ఇచ్ఛ కలుగఁగానే జలదారి సూాము గొట్టము వలె ముక్కు ఏర్పడి దానిలో రెండు ఛిద్రములుకూడ యేర్పడెను. ఛిద్రము లేర్పడఁగానే ఆతనికి ఇచ్ఛ వృద్ధి చెందెను. లాభమువలన లోభము పెఱుఁగును. అతఁ డిట్లాలో చించెను:- 'ఏదైన సుగంధ పదార్థము వాసనచూచుటకు దొఱకిన బాగుండును.' ఇట్లనుకొనఁగానే ఘ్రాణేంద్రియ మచ్చటికివచ్చి చేరెను. దీనికి రెండు వాకిండ్లు యిల్లు లభించెను. వాయుదేవుఁ డీయింద్రియమున కధిపతి యయ్యెను. ఇద్దరును గలిసి ఆఘ్రాణ విషయసుఖము ననుభవించుచుండెను.

ఇప్పుడు తినుట, మాటలాడుట, వాసన చూచుట మొదలిడఁగానే, యెక్కడనుండి సుగంధము వచ్చుచున్నదో చూాత మనుకొనెను. చూడ నిచ్ఛ కలుగఁగానే యా విరాట్టు నకుఁ గమలముల వంటివై, లోపలఁ దెల్లరంగుమీఁద నెఱ్ఱని రక్తరేఖలు కలిగి మధ్య నల్లని కంటిపాపలు కలిగిన రెండు నేత్రములు, ఛిద్రములు ఏర్పడెను. అన్నియింద్రియములు ఆవాస మేర్పఱచుకొనఁగాఁ జక్షురింద్రియము మాత్ర మేల యూరకుండును? అది యెదురుగాఁ గనఁబడుచున్న సూర్యు నితోఁ బరిణయమాడి; ఆతనిని తనపై నధికారిగా గ్రహించి

పతి పత్ను లిద్దఱును గలిసి, నానావిధములగు దృశ్యవిషయము లను గాంచి యానందపడుచుండిరి. నేత్రగోళముల కధిష్ఠాతృ దేవుఁడు సూర్యుఁడు; చక్షురింద్రియము; దానికి విషయము రూపము.

భగవంతుని శరీరములో సదా వేదము అంతర్వ్యాప్తమై యుండును. ఇప్పుడు నిర్గుణుఁడగువాఁడు సగుణుఁడై నాఁ డనియు, నరూపుఁడు రూపవంతుఁడై నాఁడనియు నెప్పుడు వేదములు గ్రహించెనో, అప్పుడవి ఆతనికి వాక్కులయ్యెను. ఏలననఁగా నవి భగవంతున కభిన్నములు. అవి యానందమున నిండి గానముచేయ నారంభించెను. విరాట్పురుషుఁడు తన పెద్దకన్నులను దెఱచి వేదములేవియో పెదవులు కదుపుచుఁ బలుకుచున్నవి. అవి యేమి పలుకుచున్నవో వినవలె నను కొనెను. అయితే వినుటకుఁ జెవులు లేవు. వినవలెనను నిచ్ఛ కలుగఁగానే గన్నేరు పూలవలెఁ జెవు లిటునటు బయలు దేఱెను. వానికి రెండు ఛిద్రము లేర్పడెను. దిశలు మేముంటిమి గదా యని వెంటనే వాటిలోఁ బ్రవేశించెను. ఇంతలోనే శ్రోత్రేంద్రియ మచ్చటికి వచ్చెను. 'మేము బయట నుండ లేము. మేమందఱము బ్రహ్మచారిణులము. బయటకు పో' మ్మని దిశలనెను. శ్రోత్రేంద్రియ మిట్లనెను:- "ఈ స్థానము నాకొఱ కేర్పడఁగా నీవు వచ్చి ఆక్రమించితివి. నేనే దీనికి యజమానిని."

దిశ లిట్లనెను:- "నీవు యజమానివా? మేము పదు గురము. నీవొక్కడానవు. రమ్ము, పోరాడుదము. మేము మొదటనే భుక్తపఱచు కొంటిమి. కావున మొదటి అధి

కారము మాది. నీ స్థానమగు నెడల.రమ్ము, మమ్ముల నేమి చేయఁగలవో?''

అంత శ్రోత్రేంద్రియము ఆ పదింటిని జయింపఁజాలనని గ్రహించి చేతులు జోడించి యిట్లనెను:- ''అక్కలారా! ఇప్పుడు నేనెక్కడికి వెళ్ళఁగలను? నన్ను నాయింటిలో నుండనిండు. మీరుకూడ యిక్కడనే యుండవచ్చును.''

దిశ లిట్లనెను:- ''మాకు నీవుండిన నేమి బాధయును లేదు, కాని మేము బ్రహ్మచారిణులము. నీవు యజమానురాలవై యేదైన దేవతను పెండ్లాడెదవు. కావున గృహస్థుల సంగమము మాకు మంచిది కాదు.''

అంత శ్రోత్రేంద్రియ మిట్లనెను:- ''మంచిది, నేను గూడ బ్రహ్మచారిణిగా నుందును. మీరందఱు నాకధిష్ఠాత్రు దేవతలు. నేను మీదాసిని. ఈవిధముగఁ బరస్పరము రాజీనామాపడి, అందఱు నివసించుచుండిరి. కావున కర్ణముల కధిష్ఠాత్రుదేవతలు దశదిశలు, శ్రోత్రేంద్రియము. శబ్దము వినుట దీనికి విషయము.

ఇప్పటికి రసన, కన్నులు, చెవులు, ముక్కు యేర్పడినవి. ఏదైన వస్తువు దూరమునఁగాని. సమీపమునఁగాని యుండిన నది కోమలమో లేక కఠినమో, తేలికయో లేక బరువో, ఉష్ణమో లేక శీతలమో తెలిసికొనవలెనను కోరిక కలుగఁగానే శరీరమంతటను జర్మ మేర్పడెను. దానిలోనికి స్పర్శేంద్రియము వచ్చిచేరెను. పైనుండి క్రిందవఱకు, లోపల నుండి పైవఱకు ఇంతపెద్ద స్పర్శదేవత తిష్ఠవేసికొనఁగా నట్టులే పెద్దదగు నధిష్ఠాత్రుదేవతకూడ కావలెను. కావున సమాన

వాయువు దానిని దన పత్నిగాఁ జేసికొనెను. కావున సమాన వాయువు అధిష్ఠాతృ దేవుఁడయ్యెను. త్వక్కు ఇంద్రియ మయ్యెను. ఏవస్తువునైనఁ దాఁకి తెలిసికొనుట దానికి విషయ మయ్యెను. ఈ విధముగ విరాట్పురుషుని శరీరమందు జ్ఞానేంద్రియము లేర్పడెను. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు ఈ పంచేంద్రియములకు విషయములు. జ్ఞానము కలిగినతర్వాత నాతనికి కర్మ లొనర్ప కోరిక జనించెను. ఏలననఁగా మొట్ట మొదట జ్ఞానేంద్రియములద్వారా యేదైన వస్తుజ్ఞానము కలిగిన తర్వాత మనస్సు కర్మేంద్రియములను ప్రేరించును. మాతృగర్భమందును బిల్లవానికి మునుముందుగా శిరస్సును, జ్ఞానేంద్రియ గోళకములు నేర్పడును. తర్వాతఁ గర్మేంద్రియములగు చేతులు, కాళ్లు మొదలగునవి బయలుపెడలును.

శ్రీ శుకుఁ డిట్లనెను:- రాజా! నేను విరాట్ పురుషుని జ్ఞానేంద్రియోత్పత్తి విషయమును సలంకార సహితముగ వర్ణించితిని. దీని తర్వాత నేవిధముగఁ గర్మేంద్రియములు, అన్య శరీరోపయోగకరమగు నంగప్రత్యంగము లుత్పన్నమయ్యెనో, ఆవర్ణనమంతయు నేను ముందు చేసెదను. నీకీ వర్ణనమున విసుగు జనించుటలేదు కదా! ఇది చాల ఆవశ్యకమైనది.''

సూతుఁ డిట్లనెను:- ''మునులారా! రాజోపు వర్ణనమును నేను నెమ్మదిగఁ జెప్పెదను. ఇంతటి గొప్ప గహనవిషయమును నొక్కసారిగా వినిపించుటచే మనస్సు చంచలము కాఁగలదు. కావున మధ్యమధ్య కొంచెము కొంచెముగ నాఁగి ఆగి వినిపించుట యుత్తమము.''

ఛప్పయ.

ప్రభు విరాట్ తేఁ ఓజ ఔర సహా, బల ప్రకటే సబ ।
పుని ఉపజే యే సభీ విషయ ఇంద్రియ దేవహుఁ తబ ।
తాలు మాఁహి నభ దేవ రసన ఇంద్రియ రస చాఖై ।
ముఖ మహఁ వాచా, అగ్ని దేవ బాణీ బహు భాషై ।
ఘ్రాణ, చక్షు శ్రోత్రహు త్వచా, గంధ, రూప, శబ్దహుఁ పరస ।
వాయు సూర్య దిగ్ప్రాణసమ, క్రమశః దేవ భయే హరష ।

అర్థము.

ప్రభువు యొక్క విరాట్స్వరూపమునుండి ఓజస్సు, క్షమ, బలము పుట్టినవి. ఇంకను సమస్త విషయములు, విషయము లనుభవించుటకు ఇంద్రియములు, ఇంద్రియాధి దేవతలు సృష్టింపఁబడెను. తాలువున నభ దేవతయు, రసనేంద్రియము రసమును రుచిచూచుటకును, ముఖమున వాక్కును పుట్టినవి. దాని కధిదేవత అగ్ని. వాక్కు అనేకముగ సంభాషించును.

ఘ్రాణమునకు వాయువు, చక్షువునకు సూర్యుఁడు, శ్రోత్రములకు దిక్కులు, త్వక్కునకుఁ బ్రాణములు అధిదేవతలు. క్రమముగా ఘ్రాణమునకు గంధము, చక్షువునకు రూపము, శ్రోత్రమునకు శబ్దము, త్వక్కునకు స్పర్శము తన్మాత్రలు.

---

# విరాట్పురుషునకుఁ గర్మేంద్రియోత్పత్తి

౯౮

శ్లో॥ హస్తౌ రురుహతు స్తస్య నానాకర్మ చికీర్షయా ।
తయోస్తు బలమింద్రశ్చ ఆదానముభయాశ్రయమ్॥
గతిం జిగీషతః పాదౌ రురుహాతేఽభికామికామ్ ।
పద్భ్యాం యజ్ఞః స్వయం హవ్యం కర్మభిః క్రియతే నృభిః॥
—శ్రీభాగ. ౨ స్కం. ౧౦ అ. ౨౪, ౨౫ శ్లో.

‘‘వ. .....అధిగత స్పర్శగుణుండును నంతర్బహిః ప్రదేశంబుల నావృతుండును నగు వాయువు వలన బలవంతంబులును నింద్రదేవతాకంబులును నాదాన సమర్థంబులును నానాకర్మ కరణ దక్షంబులును నగు హస్తంబు లుదయించె. స్వేచ్ఛా విషయగతి సమర్థుండగు నీశ్వరునివలన విష్ణుదేవతాకంబులగు పాదంబు లుదయించె.’’
—శ్రీమదాంధ్రభాగవతము.

ఛప్పయ.

భయే హస్త జిన కాజ గ్రహణ సురపతి దేవహు తహాఁ ।
చలివే కూఁ ద్వై చరణ, విషయ గతి, విష్ణు దేవ జహాఁ॥
విషయ కామనా హేతు ఉపస్థ ప్రజాపతి జామేఁ ।
వాయు గుదా మలత్యాగ దేవ మిత్రహు హైఁ తామేఁ॥
తను తజి జావే అన్య మహఁ, నాభి అపానహు మృత్యు భయ ।
కుక్షి అంత నస నదీ-పతి, దేవ తుష్టి పుష్టి విషయ॥

అర్థము.

హస్తములు పనులు చేయుటకును గ్రహించుటకును నేర్పడినవి. దాని కధిపతి ఇంద్రుఁడు. పాదములు నడుచుట కేర్పడినవి. వాని కధిపతి విష్ణువు. విషయకామనకై ఉపస్థ ఏర్పడినది. దానికి ప్రజాపతి అధిదేవత. గుదము అనఁగా పాయువు మలత్యాగమున కేర్పడినది. దాని కధిదేవత మిత్రుఁడు.

శరీరమును వదలి యింకొక శరీరములోనికి పోవుట కింద్రియము నాభి. అపానము. విషయము మృత్యుభయము. కుక్షి, ఆంత్రములు, నరములు వీనికి సముద్రము దేవత. తుష్టియుఁ బుష్టియు విషయములు.



తండ్రియే తనయుఁడై భార్యాగర్భమునఁ బుట్టును. కావుననే శాస్త్రకారులు భార్యకు 'జాయా' యను పేరిడిరి. విరాట్పురుషుఁడే మాయ నాశ్రయించి జీవరూపమున నానా రూపములను ధరించును. సృష్టిచేయఁ గోరిక కలవాఁడును, నొక్కఁడు బహురూపములుగ నుండగోరువాఁడు నగు విరాట్పురుషుఁడే సమస్తసృష్టికిఁ గారణుఁడు. సత్యసంకల్పుఁడును, అమోఘేచ్ఛ కలిగినవాఁడగుటచేఁ దన శరీరములో నేవస్తువు కావలెననుకొనునో అది వెంటనే యుత్పన్నమగుచుండెడిది. ఆధిభౌతిక వస్తువు లీ భౌతిక చర్మ చక్షువులకుఁ గనఁబడును. చాల వస్తువు లట్లు కనఁబడవుకూడ. ఆధిదైవిక, ఆధ్యాత్మిక వస్తువులు బుద్ధిద్వారా తెలియఁగలవు. భౌతికవాదులు ఈసృష్టి

కార్యమునకుఁ గర్తయొకఁడు కలఁడని యంగీకరింపరు. పరస్పరము కలిసి యీప్రపంచమంతయు స్వభావముచేతనే యేర్పడుచున్నదని వారందురు. ఈమత మెంతటి భ్రమ మూలకమైనదో ప్రసంగానుసారముగ విచారింపఁబడును. ఇప్పుడు విరాట్పురుషోత్పత్తి విషయము విచారింతము. ఈవర్ణనములో ఫలాని యింద్రియముల తర్వాత ఫలానివి యుత్పన్నమైనవని యనుకొనఁ గూడదు. ముందుగా జ్ఞానేంద్రియము లుత్పన్నమైన తర్వాతనే కర్మేంద్రియము లుత్పన్నమైనవనియు ననుకొనఁగూడదు. ఇచ్చట కేవలము వర్ణింపవలసినది ఆధ్యాత్మరూపమగు నింద్రియములును, ఆధిదైవికములగు దేవగణమును, ఆధిభౌతిక రూపమగు వానివిషయములును దోడుతోడుగ నుత్పన్నమైనవనియే. రసనేంద్రియోత్పత్తివర్ణనము వచ్చిన చోటనే ప్రసంగానుసారముగఁ గర్మేంద్రియముగు వాగింద్రియము విషయవర్ణనముకూడ వచ్చినది. ఈ విధముగఁ బంచేంద్రియముల యొక్కయు, వాగింద్రియము యొక్కయు సిట్లాటింద్రియముల వర్ణనము కావించి, అనంతరము శ్రీశుకమహర్షి రాఁబోవు వర్ణనమును బ్రారంభించుచున్నాఁడు.

శ్రీ శుకమహర్షి యిట్లనెను:– ''రాజా! 'ఊరక బండవలె నొకచో బడియుండు టేమిటి? ఏదైన పనిచేయువలె' నని విరాట్పురుషునకుఁ గోరిక కలిగెను. ఈసంకల్పము రాఁగానే ఐదు వ్రేళ్లతోడను, ఐదు గోళ్లతోడను పొడుగుగాఁ జేతులు చెట్టునకుఁ గొమ్మలు పుట్టినట్లు పుట్టెను. వీనివలనఁ బనులు జరుగునని యింద్రుఁడనుకొని యాతఁడు వానిలోఁ బ్రవేశించెను. బలవంతుని గాంచిన నెవ్వరు నేమియు ననరు.

అందఱును వానిని గాంచి భయపడుదురు. అందుచేఁ జేతు లింద్రునకు వశమయ్యెను. కావున హస్తేంద్రియమునకు దేవత దేవేంద్రుఁ డయ్యెను. వస్తుగ్రహణము చేయుట దానికి విషయమయ్యెను.

అటు నిటుఁ దిరిగివచ్చి, కొన్నివస్తువులను బోయి తీసికొనిరావలయు ననియు నభీష్టస్థానమునకు వెళ్లవలెననియు, నీవిధముగ మనస్సు నానందమున నోలలాడింపవలయు ననియుఁ గోరిక కలుగఁగానే రెండు దీర్ఘములగు కాళ్లుకూడ పుట్టుకొని వచ్చెను. ఇవి అన్నిటికిని గ్రిందనున్న యవయవములు. శరీరము నంతను నెత్తి యిటునటుఁ దీసికొనిపోవు భారము వీనిమీఁదఁ గలదు. ఇవి నేలమీఁద నిలువఁబడవలయును. కావున నన్నిటికిని గ్రిందనున్న యీయింద్రియముల మీఁద నుండుటకే దేవతకు నిష్టము లేకుండెను. అంత విష్ణు విట్లనెను:- "అన్నిటి కంటెఁ గ్రిందనున్న యింద్రియముపై నేనుందును. ఎవరు నొల్లని దానిని నేను గ్రహింతును. ఇతరుల కక్కఱలేనిది నాకు కావలయును. అందఱును దిరస్కరించిన దానిని నేను ప్రేమించెదను. మీ దేవత లందఱకును భేదబుద్ధి కలదు. నాకు ఉచ్చనీచములను భేదభావములు లేవు." అని చరణేంద్రియమునకు స్వామి విష్ణువయ్యెను. రాకపోకలు దానికి విషయమయ్యెను. పాదములతో నడచియే మానవుఁడు జీవన సాధనసామగ్రిని యజ్ఞీయ వస్తువులను బ్రోవుచేయును.

ఇప్పుడాతఁడిట్లనుకొనెను:- "ఒంటరిగా నెక్కడికి తిరుగుదును? ఎవరెవరి పనులు చేయుదురు? ఈ లోక సుఖములను బొందునట్లును, ఈ సుఖముతోఁ బాటుగాఁ

బుత్రుఁడుకూడ కలిగి స్వర్గసుఖప్రాప్తికూడ కలుగునట్లును నాతో సమానుఁడగుఁ బుత్రునిఁ గందును.'' ఇట్లనుకొనుచుండఁగనే ఉపస్థేంద్రియ ముత్పన్నమయ్యెను. ప్రజాపతి దానికి దేవత యయ్యెను. ప్రజాపతి అక్కడుండుటచేఁ గామవిషయ ముత్పన్నమయ్యెను. కావున జననేంద్రియమునకుఁ బ్రజాపతి దేవత. ఉపస్థ ఇంద్రియము. కామవాసన, మూత్రోత్సర్గము విషయము లయ్యెను.

తాలువు మొదటనే యేర్పడినది. దానియందలి తినుటకుఁ ద్రావుటకు రసనా, జిహ్వాలుకూడ యుత్పన్నమయెను. తినునది పార్థివ పదార్థము. పార్థివ పదార్థములోఁ గొంత భాగము రసముగ నగును. కొంత మలమగును. రసమువలన శరీరము పుష్టి చెందును; కాని మలభాగము శరీరములో నిలిచిపోయినచో నిది మలాలయమగును. కావున మలత్యాగేచ్ఛ కలుగఁగా మలద్వార మేర్పడెను. ఎచ్చటనైన మంచిస్థానము దొఱకునేమోనని మిత్రదేవుఁ డాలోచించెను. కాని జ్ఞాన కర్మేంద్రియములు రెండును పూర్తియైనవని తెలిసికొనఁగానే చిక్కినంతనఱకే చాలును; ఇంకను బ్రతీక్షించితిమా యేదియు దొఱకదేమోనని భావించి దానిలోఁ బ్రవేశించెను. కావున నా ఛిద్రములో వాయువింద్రియము, మిత్రుఁడు దేవత. మలత్యాగము దాని విషయము. అంత విరాట్పురుషుఁడు 'పంచభూతములు శరీరములోఁ బ్రవేశించినవి. ఇవి యనిత్యములు. క్షణభంగురములు, పరివర్తనశీలములు. ఇవి జీర్ణశీర్ణములై పోఁగానే, దీనిని వదలి యింకొక శరీరములో బ్రవేశింపవలసి యుండును. అప్పుడు దీనికేదైన మార్గముండవలె'ననుకొనెను.

ఈ యాలోచన మనస్సులోనికి రాఁగానే ఆతనికి నాభి యుత్పన్నమయ్యెను. అచ్చటికి అపానవాయువు వచ్చి చేరెను. మృత్యుదేవతకూడ యిదియే తనకు యోగ్యమగు స్థానమను కొని అచ్చట నిలిచెను. ఇట్టిద్దఱు నచ్చట పడియుండిరి. హృదయములోఁ బ్రాణవాయు వుండును. నాభిస్థానమునకుఁ గ్రింద అపానవాయు వుండును. వీనిమధ్య సమానవాయువు, వీటిగతిని సరిగా నుంచుచు మధ్యస్థమైయుండును. ప్రాణాపానములు విడిపోయెనా హాని యనవలసినదే. మృత్యుదేవత సమస్తదేవతలను దన వెంటఁ గైకొని వేఱొక శరీరములోనికిఁ బోవును.

ఇప్పటికి రచనా విధానము పూర్తియయ్యెను. అలంకారము పూర్తియైనది. బండికి యిరుసు, చక్రము, గాళ్లు యేర్పడి నడుచుటకు వీలయ్యెను. తాలువేర్పడెను, జిహ్వ యేర్పడెను. చేతులు కాళ్లు యేర్పడినవి. నాభి యేర్పడినది. రసమునకు రసమేర్పడెను. దీనిలో నేమియు వ్యత్యాసము లేదుకదా, ఇది సరిగా నడచునో లేదో చూతమని విరాట్పురుషుఁ డనుకొని, కొంచెము తిని, త్రాగెను. వెంటనే అది ముఖద్వారము కుండా క్రిందకుఁబోయెను. అది వెంటనే మలద్వారమునఁ గ్రిందికిపోయెను. అప్పుడు విరాట్పురుషుఁడు చాల చింతించెను. ఇది బాఁగుండలేదు. ఇట్లైన బండి నడువఁ జాలదు. తినినది త్రాగినది కడుపులో నిలువకఁబోయిన నది విశుద్ధమగు రసమగు టెట్లు? అట్లయిన శరీర మెన్నిదినములు నిలుచును? భౌతిక శరీర పోషణము నియమముగా నుండవలయును. కొంచెము నిలువ జేసికొనుటకు స్థానముండ

వలయును. ఇట్లనుకొనునప్పటికి చిన్నప్రేవులు, పెద్దప్రేవులు కడుపులో నేర్పడెను. రసాదులు ప్రవహించుటకు చాలనాడులు కూడ బయలుదేరెను. రెండువైపులఁ గుక్షి యేర్పడెను. ఆంత్రములకు, కుక్షికి సముద్రుఁ డధిదేవత యయ్యెను. నాడులకు నదు లధిదేవత లయ్యెను. కుక్షికి విషయము తుష్టియు, నాడులకు విషయము సమస్తావయవములకుఁ బుష్టియు నయ్యెను.

ఇప్పు డాతఁ డిట్లనుకొనెను:- "నేనా నిస్సంగుఁడను, నిర్లిప్తుఁడను, అకర్తను. ఈ యంగము లెట్లేర్పడెను? ఈ ప్రపంచ మెట్లేర్పడినది? ఓహో! ఇదియంతయు నా మాయా ప్రసారము. ఆహా! నా మాయ యెట్టిది?" అని యిట్లు విచారించునప్పటికి విచారస్థానమగు హృదయ మేర్పడెను. ఇంద్రియము లివి. చేతులు, కాళ్లు, కన్నులు, చెవులు ఇవి బాహ్యకరణములు. అనఁగా బయటకుఁ జూచు ఇంద్రియములు. లోపలకుఁ జూచు నింద్రియము కావలెను. అంతఃకరణ నివాసస్థానము హృదయము. మనస్సు ఇంద్రియము. చంద్రుఁడు దానికి దేవత. నానావిధములగు కోరికలు, వివిధ సంకల్ప వికల్పములు దీనికి విషయము.

రాజిట్లడిగెను:- "స్వామీ! ఈ మనస్సను నింద్రియము స్త్రీయా? పురుషుఁడా? దీని రూపమేమి?"

ఇది విని శ్రీశుకుఁడు బిగ్గఱగ నవ్వుచు నిట్లనెను:- "రాజా! ఈ మనస్సును గూర్చి కొంచెమైన నడుగవలదు. అది ధూర్త. అది స్త్రీయుఁ గాదు, పురుషుఁడును గాదు, కొజ్జా కాదు, నపుంసకము కాదు. ఒక్కొక్కప్పుడిది స్త్రీ యగుచుండును. ఒక్కొక్కప్పుడు స్త్రీగాను, బురుషుఁడు

గాను నగును. ఒక్కొక్కప్పుడు పురుషుఁ డగును. అదియే నపుంసకముఁగఁ గూడ నగును.

పరీక్షిన్మహారా జిట్లనెను:- "మహారాజా! ఒకే వ్యక్తి నాల్గువిధములుగ నెట్లుండఁగలదు ?"

అంత శుకమహర్షి నవ్వి యిట్లనెను:- "ఇదేమి శంక కలిగినదయ్యా! నీవు రాజసింహాసనమున గూర్చుండి రాజ కార్యము లొనర్చునపుడు రాజని పిలువఁబడుదువు. యజ్ఞదీక్ష గొనిన యజమాని వగుదువు. భాసికము ధరించి పెండ్లి చేసి కొనఁబోయినఁ బెండ్లికొడు కగుదువు. ప్రజలు నిన్ను రాజం దురు. నీ కొడుకు నిన్ను తండ్రి యనును. నీ కూఁతురుకొడుకు నిన్ను తాత యనును. నీ భార్యాసోదరుఁడు నిన్ను బావ యనును. నీ తమ్మునిపిల్లలు నిన్ను కక్క యనుచుందురు. అత్త అల్లుఁడా యనును. మామ అబ్బాయీ యనును. నీ గురు జనము నిన్ను బరీక్షిత్తందురు. నీ వొక్కఁడ వైనప్పటికిని అందఱు వేఱువేఱు నామములతో నిన్ను బిలుచుచుందురు. నీ వెప్పు డేకార్యము నొనర్చిన అప్పుడు నిన్నట్లు పిలుచుచుం దురు. నీవు యాత్ర చేయునప్పుడు నిన్ను యాత్రికుఁడు వెళ్లు చున్నా డందురు. నీవు జబ్బుపడిన వైద్యుఁడు రోగిని జూడ బోవలె ననును. అట్లే యీ నపుంసకుఁ డేదైన నిశ్చయము కాపించెనా అప్పుడు స్త్రీలింగమగు బుద్ధి యని పిలువఁబడును. అది నేను, నేను అనుకొనుచుండిన అహంకారమని పిలువఁ బడును. అది స్త్రీశరీరమునఁ బ్రవేశించి స్త్రీగా మాటలాడును. అప్పుడు నేను వచ్చుదానను, పోవుదాన నగును. పురుషుని శరీరములోఁ బ్రవేశించి నేను వచ్చువాఁడను, నేను పోవు

వాఁడ నను. చింతించునప్పుడు చిత్తమగును. కాఁబట్టి రాజా! సమస్త జంజాటమునకు బీజమిదియే. దీనిని విషగుళిక యని గ్రహించుము. మనస్సును వశపఱచుకొనినవాఁడు సమస్తమును వశపఱచుకొనినవాఁడే. మనస్సునకు వశమై, మనస్సున కధీనుఁడగుచో సంసారమునకు వశుఁడైనట్లే.

ఈ విధముగ విరాట్పురుషుఁడు అన్నపానీయములను గొనుచుండ శరీరమందు త్వక్చర్మ, మాంస, రుధిర, మేద, మజ్జాస్థులను సప్తధాతువు లేర్పడెను. జల, వాయు, ఆకాశముల వలనఁ బ్రాణ ముత్పన్నమయ్యెను. కర్ణాది యింద్రియముల పని శబ్దాదిక విషయములను గ్రహించుట. సమస్త విషయ గ్రహణము ఇంద్రియములద్వారా జరుగుచుండును. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాది విషయములు భూతముల కాదికారణమగు నహంకారముననే యుత్పన్నమగుచున్నవి. కావున నహంకారపురుషుఁడు 'ఇది నాది' అనుచుండును. ఏలననఁగా, సంతానము నెడల నందఱకును మమత్వముండును. ఈ పృథివ్యాది భూతములకును గంధాది విషయములకును అహంకారమే అబ్బ. మనస్సు ఊరకఁ గూర్చుండి వ్యర్థ విషయములను విచారించుచుండును. దారములు లేకుండ గుడ్డలు నేయుచుండును. హర్ష శోకాది వికారములు ఈ నపుంసకుని అశరీసంతానమే. బుద్ధి రాణి. చాటునఁ గూర్చుండి ఆజ్ఞల నిచ్చుచుండును. దీని యాజ్ఞలను దిరస్కరించుట కెవరికి శక్తి కలదు? ఇదెట్లు నిశ్చయించిన — స్త్రీ జితుఁడగు పురుషుఁడు భార్య యెట్లు చెప్పినఁ గుక్కిరిమిక్కిరి లాడక పను లెట్లు చేయునో — అట్లే మనస్సు చేయుచుండును. రాజా! ఈ విశ్వ

బ్రహ్మాండమే విరాట్పురుషుని స్థూలరూపము. బ్రహ్మాండములో విరాడ్రూపమెటులో పిండమందు జీవరూపమటులే. బ్రహ్మాండములో నేవస్తువులు కలవో పిండములో నా వస్తువులే కలవు. బ్రహ్మాండము బృహద్రాజసంస్కరణము. ఈ పిండము సంక్షిప్త జేబీ సంస్కరణము.

ఇది బ్రహ్మాండముయొక్క లోపలి రూపము. ఈ బ్రహ్మాండమునకు బయటకూడ అత్యంత సూక్ష్మమైనవి యెనిమిది కలవు. ఈ బ్రహ్మాండమునకు బయట మొదట సూక్ష్మ పృథ్వీ ఆవరణము కలదు. తర్వాత జలావరణము. ఈ విధముగఁ దేజ, వాయు, ఆకాశ, అహంతత్వ, మహత్తత్వ, ప్రకృతి తత్త్వావరణము లిట్లెనిమిది కలవు. ఇది యింత గొప్ప బ్రహ్మాండమునకుఁ బరమైన భగవంతుని సూక్ష్మాతి సూక్ష్మ రూపము.''

అంతఁ బరీక్షిన్మహారాజిట్లడిగెను:- ''ప్రభూ! ఆ భగవంతుని సూక్ష్మరూపమును వర్ణించుఁడు. ఎట్లుండి యీ బ్రహ్మాండమును సంచాలనము గావించుచుండును?''

ఇది విని శుకుఁ డిట్లనెను:- ''రాజా! ఆ భగవానుని సూక్ష్మరూపము మనోవాక్కుల కతీతమైనది. దానిని 'అవాఙ్మానస గోచర' మని వేదములు వాక్కొనినవి. అది అవ్యక్తము, నిర్విశేషము. దానికి ఆదిమధ్యాంతములు లేవు..అది యెట్లుండెనో అట్లే యున్నది. దాని నత్యంత సూక్ష్మమని చెప్పవచ్చును. ఈ విధమున నీ సన్ముఖమున భగవంతుని విరాడ్రూపమును, సూక్ష్మరూపమును గూర్చి వర్ణించితిని. ఇప్పుడు నీ వేమి వినఁదలఁచితివి?''

మహారాజిట్లనెను:- "ప్రభూ! నా సందేహ మొకటి నిలిచియేపోయినది. మీరు వర్ణించిన పంచమహాభూతములు, పంచతన్మాత్రలు, ఇంద్రియములు, అంతఃకరణాదులచేఁగూడిన విరాడ్రూపమును, బ్రహ్మాండమున కావల నెనిమిది ఆవరణములను జెప్పి నిరూపించిన భగవంతుని సూక్ష్మాతి సూక్ష్మరూపమును, ఈ రెండురూపములు మాయాశ్రితములు కదా! మాయ నాశ్రయించియే భగవంతుఁ డీ విశ్వబ్రహ్మాండమును రచించెను. అభ్యంతరమున స్థూలరూపము చేతను, బాహ్యాభ్యంతరములందు సూక్ష్మరూపముచేతను మాయ నాశ్రయించియే యాతఁడు వ్యాపించెను. అట్టైన భగవంతుని స్థూలరూపము నుపాసింపవలయునా? సూక్ష్మరూపము నుపాసింపవలయునా?"

ఇది విని శుకుఁ డిట్లనెను:- "రాజా! ముందుగా స్థూల జగత్తునందు లగ్నమైన మనస్సును విరాడ్రూపమందు లగ్నము కావింపవలయును. విరాడ్రూపమందు స్థిరత్వ మేర్పడఁగానే సూక్ష్మమందు లగ్నము గావింపవలయును. చిత్తము సూక్ష్మమందు స్థిరముకాఁగానే స్థూల సూక్ష్మముల రెంటిని బరిత్యజించి వీటికిఁ బరమగు సాక్షాన్నందనందనుని చరణారవిందములందు చిత్తమును విలీనము కావింపవలయును. అంశమును అంశియందు గలుపవలెను. చంచలచిత్తమును జంచల చూడామణి చరణములందు లగ్నము కావించి, చేష్టారహితమై, ఆనందమురళిని వాయించవలయును లేదా మ్రోగుచున్న మురళీనాదమును వినుచుండవలయును."

